మీరు సంపాదించేదంతా మీ ధనం కాదు !
మీరు పొదుపు చేసేదే మీ ధనం

ఆ పొదుపు ధనాన్ని పెంచి మీ జీవితం సుఖమయం చేసేందుకు
ఆంధ్రా బ్యాంక్ అనేక పథకాలు చేపట్టింది.
భవిష్యత్తును భద్రపరిచే ఆ పథకాలు అన్నివర్గాల వారికి
అందుబాటులో వున్నాయి.

| | | |
|---|---|---|
| కిడ్డీ బ్యాంక్ | : | బాలలకు పొదుపు నేర్పడ కోసం |
| కల్పతరువు | : | మీ భవిష్యత్ అవసరాలకోసం |
| కర్షక సహాయి | : | రైతు సోదరుల స క్షేమం కోసం |
| గృహకల్ప | : | మీకంటూ ఒక ఇంటి కోసం |
| సంరక్ష | : | వృద్ధాప్యంలో రక్షణ కోసం |
| సంక్షేమ | : | ప్రమాదాలవల్ల రక్షణ కోసం |
| మహిళా సంక్షేమ | : | వనితలకు భవిష్యత్తులో భద్రత కోసం |
| ఆంధ్రాబ్యాంకార్డ్ | : | మీ అవసరాలకు తోడ్పడే కార్డ్ |
| ట్రావెలర్స్ చెక్స్ | : | పౌండ్లు, డాలర్లలో మీ సొమ్ముకు భద్రత, సౌకర్యం కల్పించే చెక్స్ |

ఇంకా ఎన్నెన్నో పథకాలు....... ..
ప్రజావసరాలకై పాటుపడేదే - ఆంధ్రా బ్యాంక్

## ఉగాది శుభాకాంక్షలతో



# ఆంధ్రా బ్యాంక్

(భారత ప్రభుత్వ సంస్థ)

**కేంద్ర కార్యాలయం : సుల్తాన్ బజార్**
**హైదరాబాద్-500 001**

మీరు భాగ్యవంతులు కావడానికి ఆంధ్రుల అదృష్ట దేవత
దేవి భాగ్యలక్ష్మి ఆశీస్సులను పొందండి.



భాగ్యలక్ష్మి

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ లాటరీ

టికెట్ ఖరీదు

రు. 1/-

# ఉగాది బంపర్ డ్రా

# 8—4—1982

మొత్తం బహుమతుల విలువ

# 22,00,000

బంపర్ బహుమతి

# రూ. 12 లక్షలు

**ఇతర బహుమతులు**

| | | | |
|---|---|---|---|
| 5 | మొదటి బహుమతులు | రూ. 1,00,000/- | ఒక్కొక్కటి |
| 5 | రెండవ బహుమతులు | రూ. 10,000/- | ,, |
| 10 | మూడవ బహుమతులు | రూ. 5 000/- | ,, |
| 50 | నాల్గవ బహుమతులు | రూ. 1,000/- | ,, |
| 1,000 | ఐదవ బహుమతులు | రూ. 50/- | ,, |
| 5,000 | ఆరవ బహుమతులు | రూ. 10/- | ,, |
| 50,000 | ఏడవ బహుమతులు | రూ. 5/- | ,, |

మొత్తం బహుమతులు 56,071

ఎం. వి. ఎస్. ప్రసాదరావు, ఐ. ఏ. ఎస్.,
కమీషనర్, రాష్ట్ర లాటరీలు మరియు స్మాల్ సేవింగ్స్
ఎ. సి. గార్డ్స్, హైదరాబాద్-500 004

భాగ్యలక్ష్మి కనకవర్షం కురిపిస్తుంది. అది మీ ఇంట్లోనూ కావచ్చు.
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర లాటరీలు

సంస్థాపకులు
కీ॥ శే॥ వి. వి. రాఘవయ్య



మేనేజింగ్ ఎడిటర్
శ్రీమతి వి. లీలావతి
రాఘవయ్య

సంపుటి 20 ఏప్రిల్ 1982 సంచిక 3

# ఇదీ వరస...



ఈ నెల నవలానుబంధం

# బలం

రచన

## సదానంద్ శారద

జ్యోతి, పి. బి. నెం. 1824, హైదరాబాదు-20

ముందు : జ్యోతికి జ్యోతే ... వెనుక : కార్తికకృష్ణ

# తొలిమాట

కారెవరూ
పాలన కనర్హం!
కాదేదీ
ఛార్జెస్ కదనం!!



సర్వత్రా, సదా మనం ప్రతి ఇంచీ పరిపాలించబడుతూ వుంటాము. పాలన, పాలించబడటం, ఓటు, గాంధీజీ లాటి కొన్ని పదాలు వింటూవుంటాం-అవన్నీ వున్నట్టు భ్రమకూడా వుంటుం దొక్కోసారి - అంచేత రాజకీయ పరిపాలనా యంత్రాంగం, నిర్వహణ ఇత్యాది చిత్రమైన విషయాల్లో మరోమలుపు కొచ్చాం- కొత్త సంవత్సరం కొత్త మలుపు ఎలా వుంటుందో చూడాలి మనం!

మనిషి వేగంగా చేరడానికి ప్రతి గమ్యందగ్గరా రైలొకటి (లేటుగా) వుంటూనే వుంటుంది. అందరూ నిష్కారణంగా గమ్యాలు చేరిపోయి, చాలా చాలా పనులున్నవారికి కాళ్ళకి అడ్డు రాకండా ఓ ఏర్పాటయింది-రైలు ఛార్జీలు పెరిగాయి-సామాన్యుడి కాళ్ళు విరగ్గొట్టినట్టే మరి! వాళ్ళు హూనం అయ్యేలా ధరలు....

పోతే నూతన శీర్షిక ఆరంభమైంది.

మరో సరికొత్త శీర్షిక రాబోతోంది.

# సాంస్కృతిక విశేషాలు




ఈమధ్య మద్రాస్‌లో....శ్రీ ఎల్. వి. రామయ్య షష్టిపూర్తి సందర్భంలో
శ్రీ ఎల్ వి రామయ్య, జస్టిస్ శ్రీ చల్లాకొండయ్య, జస్టిస్ శ్రీరామ ప్రసాద రావు

ఇప్పుడు...
అందానికి ఒక కేలమైన్




# పాండ్స్

## కేలమైన్ లోషన్

**పూసిన అందం,
సంరక్షించే గుణం,
తాజా మురిపెం,
మీ చర్మానికిది లాభమయం.**

చర్మానికి ఆరోగ్యంతోబాటే అది ఒక అందాల గని కావాలని కోరుకోరామరి ? ఈ రెంటి కోసమూ యిదుగో కొత్త పాండ్స్ కేలమైన్ లోషన్ :

మచ్చలేని, నిర్మలమైన ఛాయ, చల్లదనం యిక మీ వంటిపైన_గాలిలోని, సంతోషం విరిసే, మారని ఆ తాజాదనం. మేకప్ వేసుకునే ముందైనా, లేదా దానంతట అదిగానే వాడటానికి వీలు. సుగంధం విరజిమ్మే, అందాన్నిచ్చే పాండ్స్ కేలమైన్ లోషన్.






# జ్యోతి-భాగ్యలక్ష్మి లాటరీ-కథల పోటీలో

## సాధారణ ప్రచురణకు అంగీకరించిన కథలు

| | | |
|---|---|---|
| ఒకే రక్తం | ... | ఎమ్. వి. వి. సత్యనారాయణ |
| బొమ్మలు | .. | జి. సుబ్రహ్మణ్య |
| భూతం | ... | ద్విభాష్యం రాజేశ్వరరావు |
| నరబలి | ... | వీరవల్లె వీణావాణి |
| అవ్యక్తం | .. | గంగుల నరసింహారెడ్డి |
| స్త్రీ | .... | ఎన్. సంజీవ్ |
| కొత్త మలుపు | .... | వి. వి. ఆర్. శివకుమార్ |
| ఆత్మహత్య | ... | ముంగండ రామచంద్రరావు |
| రంగు వెన్నెల | . | బి. చంద్ర |
| తల్లీ గోదారి | .... | పాలకోడేటి సత్యనారాణయణరావు |
| తెలిసిన శత్రువు | .. | బి. కుసుమకుమారి |
| ప్రేమలేఖ | .. | ఎలిశెట్టి శంకర్రావు |
| ఇదీ కథ | .... | మాజేటి సుదర్శనరావు |
| బంధితులు | ... | వై. యస్. మురళీధర్ |
| తృప్తి | .... | దీపశిఖ |
| ఈ క్షణం నీదిచేసుకో | ... | ఆదిమధ్యం రమణమ్మ |



జ్యోతి సంపాదకురాలు శ్రీమతి లీలావతిగారిని సత్కరిస్తున్న శ్రీ ఎల్ వి రామయ్య



సంపాదకుల సత్కార దృశ్యం

జ్యోతి-భాగ్యలక్ష్మి లాటరీ-కథల పోటీలో ద్వితీయ బహుమతి పొందిన కథ

# మానవత్వం ఓడిపోతోంది!

ఉదయం అయిదు గంటల సమయం.

చలికి ముడుచుకుని, రగ్గు ముసుగు పెట్టుకుని పడుకుని ఉన్న అర్జున రావు పక్కమంచం మీద చేయివేసి చూశాడు. ఖాళీగా ఉందక్కడ. "అప్పుడే లేచిపోయిందేమో ఈశ్వరి. బాబోయ్ ఈచలిలో ఇంత ప్రొద్దున్నే లేచి ఏం చేస్తున్నట్టు" అనుకున్నాడు.

"ఇదుగో ఏమోయ్ ఓ సారిలా రా" అని ముసుగు తియ్యకుండానే కేక వేశాడు.

"తెల్లారి ఏమిటా గావుకేకలు! మీ పాటికి మీరు పడుకోకుండా...." అంటూ వచ్చిందొ ఈశ్వరి.

"ఏమిటే నావి గావుకేకలా? అవున్లే నీకలా అర్థంకాదు" అంటూ విసురుగా ఆమె చేయిపట్టి మంచం మీదికి లాగేడు.

"చాల్చాలు వదలండి. తలకి ఆముదం అంటుకున్నాను-నీళు కాగిపోతున్నాయి. అవతల స్నానం చెయ్యాలి"

"ఇంత ప్రొద్దుటే స్నానమేమిటోయ్"

"శనివారం కదండీ. వెంకటేశ్వర స్వామి పూజ చేసుకోవద్దూ. మీకంటే ఏ పూజలు అవసరం లేదు, నేనూ మానేస్తే ఎలాగు? అయినా బొత్తిగా పూజలూ, జపం, ధ్యానం అంటే పట్టవేమిటండీ మీకు"

"మహాతల్లీ నమస్కారం. వెళ్లి స్నానం, పూజ, జపం, ధ్యానం అన్నీ చేసుకో. నన్నిలా వదిలేసి పుణ్యం కట్టుకో. మరో గంటయినా హాయిగా నిద్రపోతాను"

మళ్ళీ ముసుగు పెట్టాడు అర్జునరావు.

ఇవాళ శనివారం, వెంకటేశ్వర స్వామి పూజ. శుక్రవారం లక్ష్మి పూజ. గురువారం సాయిబాబా పూజ. మంగళవారం గౌరీపూజ, సోమవారం శివపూజ-ఇదీ తంతు. ప్రతీరోజూ ఏదో ఒక ప్రత్యేకత ఉండనే ఉంటుంది.

- వింధ్యవాసిని -

ఈశ్వరి తెల్లారే నిద్రలేచి పని చేసు కున్నరోజే నయం. పొరపాటున ఆమె ఆలస్యంగా లేచిన రోజు అర్జునరావు



దుంప తెంచుతుంది. సమయానికి ఏ పనులూ కావు. ఆఫీస్‌కు టయిం అయి పోతూ ఉన్నా భోజనం తయారు అవదు. అతడెంత కోపంగా కేక వేసినా, చిందులు తొక్కినా ప్రయోజనం మాత్రం అంతగా ఉండదు.

అయితే ఈశ్వరిలో ఒక సుగుణం ఉన్నది. ఏదయినా ఒకటి గట్టిగా నిర్ణయించుకుంటే, దానికి కట్టుబడి ఉంటుంది. ఆదివారం తప్ప మిగిలిన రోజులన్నీ ఆమె ఇష్టం. ఆదివారం మాత్రం భర్త చెప్పిన రీతిగా నడచుకోవాలి. దేనికీ అడ్డు చెప్పకూడదు. ఇది ఎన్నేళ్ళ క్రితమో ఇద్దరూ కలిసి తీసుకున్న ఒప్పందం. అందుకే ఆదివారాలు మాత్రం, అర్జునరావు తెల్లవారి ఎంత సేపు నిద్రపోయినా కోపగించదు. ఆమెనీ లేవనియ్యకుండా, తన పక్కనే ఉండమని బలవంతం చేసినా, విసుక్కోదు. అతని కెంతో మోజయిన బెడ్‌కాఫీ ఇచ్చేస్తుంది. తనే తలంటి స్నానం చేయిస్తుంది. అయిదు నిమిషాల్లో దేవుడి పూజ ముగించి వేస్తుంది. అతనుకోరిన వంటకాలు వండి వడ్డిస్తుంది. అతను వేసిన ప్రోగ్రాం ప్రకారం ఎటు వెళదామన్నా, అతనికి నచ్చేవిధంగా తయారయి వెంట బయలు దేరుతుంది. రాత్రి ఎంతసేపు అతను నిద్రపోకుండా, కబుర్లు చెప్పినా వింటూ కూర్చుంటుంది.

"ఒక్కో వారం ఒక్కో దేవుడికిలాగే ఆదివారం పతిదేవుడికి కేటాయించుకు న్నావా? నీవు పూజించే దేవుడికన్నా నేను సులభంగా వరాలిచ్చేస్తాలే" అని ఎగతాళిచేస్తూ ఉంటాడు అర్జునరావు.

అతను నాస్తికుడుకాదు. కానీ ఈశ్వరి పద్ధతి చాదస్తమూ విసుగు పుట్టి, అలా

మాట్లాడ తూ ఉంటాడు అంతే!

అర్జునరావుకి ప్రతీరోజూ దేవుడిదగ్గర దీపం వెలిగించటం, పూజ చేసుకోవటం, ఉపవాస దీక్షలు పట్టటం వంటి నియమాలూ, ఆచారాలూ అలవాటులేవు.

మనసును నిర్మలంగా ఉంచుకోవటం, తన మనసుకు సంతృప్తినీ, సంతోషాన్నీ కలిగించే విధంగా ప్రవర్తించటం, ఒకర్ని నొప్పించకుండా నడచుకోవటం, ఇవే అతనుంచుకున్న నియమాలు. వీలయినంత వరకూ ఇతరుల్లో మంచిని చూడటం, శక్తిమేరకు సహాయపడటం ఇవే అతని ఆచారాలు. ఇందునే మామూలుగా, భార్య భర్తలిద్దరూ ఘర్షణ పడుతుంటారు.

ం ం ం

ఏవిధమయిన సమస్యాయి, కష్టాలు లేకుండా జీవితం సాఫీగా సాగిపోతున్నా, పిల్లలు లేరనే లోటుతో లోలోపల బాధ పడుతుంటారు ఈశ్వరీ అర్జునరావులు.

సంతానంకోసం, ఈశ్వరి చేయని పూజలు, వ్రతాలులేవు. ఎవరేది చేయమని చెప్పినా ఆచరిస్తుంటుంది. ఇద్దరి ఆరోగ్యాలనీ ఎందరో వైద్యులు పరీక్ష చేయటమూ అయింది. ఎవరు చూసినా, ఇద్దర్లో ఏలోపమూ లేదని చెప్పేవారే. కాని ఏం లాభం? ఇన్నేళ్ళయినా వాళ్ళ కోరిక మాత్రం తీరలేదు. ఈశ్వరి మాత్రం ఎప్పటికో ఏదేవుడయినా కరుణించక పోతాడా అని ఎదురు చూస్తూ ఉంటుంది.

కొన్ని రోజులుగా అర్జునరావు మనసులో ఒక కోరిక ఉంది. పిల్లలు పుడతారో లేదో అని ఇలా ఏళ్ళతరబడి కాచుకోవటం అతనికి విసుగ్గా ఉంది, అసలు పుట్టకపోతే పోయారు. ఎవరినయినా తెచ్చి పెంచుకుంటే బావుంటుంది అనిపిస్తుంది అతనికి.

అతనాకోరిక ఈశ్వరి ముందర వెలిబుచ్చినప్పుడు ఘర్షణ తప్పలేదు.

"అయినా మనకేమంత వయసయి ముసలి వాళ్ళమయి పోయామని ఇలా ఆలోచిస్తున్నారు? నేను గొడ్రాలిననీ, మనకు పిల్లలు పుట్టరనీ అనిపిస్తుందా మీకు" అని కళ్ళనీళ్ళ పర్యంతం అయింది ఆమెకి.

అలిగి ఒక రోజంతా భోజనం మానేసింది. తన ఉద్దేశ్యం అదికాదని ఆమెకు నచ్చచెప్పి, బుజ్జగించేసరికి, తల్లక్రిందులు తపస్సు చేసినట్లయింది అర్జునరావుకి.

అర్జునరావు అయితే ఆదెబ్బతో మళ్ళీ ఆ విషయాన్ని ప్రస్తావించే సాహసం చేయలేదుకానీ, ఈశ్వరి ఆలోచిస్తోనేఉంది చాలా రోజుల వరకు.

"ఆయన పయికి చెప్పకోరుగానీ ఇంట్లో పసిబిడ్డ తిరగాడాలని ఎంత ఇష్టంగా ఉందో....అందుకే అలా అడిగేరు....ఆ ఇష్టంతో....నన్ను నిజంగానే గొడ్రాలు అనుకుని మళ్ళీ పెళ్ళి చేసుకుందాం అనుకుంటారేమో ఇంకా కొన్నాళ్ళు ఇలాగేసాగితే .... అయినా ఆయన కోరికలో తప్పేముంది? దేవుడి దయవల్ల తమకు భుక్తికి లోటులేదు. ఒకరిని పెంచుకున్నారా, తమకు సంతానం కలిగినా లక్షణంగా భరించ గల స్తోమతు ఉంది....ఈ మగాళ్ళని ఎవరు నమ్మేరు!....ఎప్పుడెలా మనసులు మార్చుకుంటారో...." ఇలా సాగేయి

## రచయిత్రి పరిచయం



వయసు 28 సం.లు. పది సం.లుగా 'వింధ్యవాసిని' అన్న కలం పేరుతో రచనలు చేస్తున్నాను.

ఒకటవ తరగతినుండీ, ఎం.ఎస్సీదాకా విద్యాభ్యాసం అంతా స్వస్థలం అనంతపూర్ లోనే సాగింది. శ్రీవారి ఉద్యోగ రీత్యా బెంగుళూర్ లో స్థిరపడ్డాము. గత సంవత్సరం భారతీయ విద్యాభవన్ వారి 'డిప్లొమా ఇన్ జర్నలిజమ్' అందుకోవటం జరిగింది. సంతానం-ఒక నాలుగు సం. వయసు అమ్మాయి. ఉద్యోగం-ఒక కెమికల్ ఇంజనీరింగ్ కన్సల్టెన్సీ ఆఫీస్‌లో డాక్యుమెంటేషన్ ఆఫీసర్‌గా.

నవలలు వ్రాయటంకన్నా, కథా రచనలోనే అభిలాష ఎక్కువ. దాదాపు యాభయి కథలు, రెండు నవలలు. కొన్ని వైజ్ఞానిక వ్యాసాలు, వివిధ వార, మాసపత్రికల్లో వచ్చాయి. వనితాజ్యోతి, 1981 దసరా-దీపావళి కథల పోటీలో నా కథ రెండో బహుమతి అందుకున్నది.

హాస్యం, వినోదం మేళవించిన కథలు వ్రాయటం, చదవటం రెండూ చాలా ఇష్టం. వ్రాసిన ప్రతీ కథలో 'వాస్తవికత' ప్రతిబింబించేందుకు ప్రయత్నిస్తాను. ఎన్ని రచనలు చేసిందీ లెక్కపెట్టుకోవటం కన్నా, ఏం వ్రాశాను, ఎలా వ్రాశాను అని పరిశీలన చేసుకోవటంలో ఆసక్తి ఎక్కువ.

దొరికిన ప్రతీ తెలుగు లేదా ఇంగ్లీషు పుస్తకాన్ని చదివెయ్యటం హాబీ.

ఇంతకన్నా నన్నుగురించి చెప్పుకోవలసిందేమీ లేదు.

-డి. విజయలక్ష్మి

---

రాజేశ్వరి ఆలోచనలు.

అప్పటి కప్పుడు నిర్ణయించుకుని, ఆలస్యం చేయకుండా ఆవేళే అతనికి, తన అంగీకారాన్ని తెలపాలని అనుకుంది.

అంతటితో ఇద్దరూ ఒక మాటమీదికి వచ్చి, ఆ ప్రహసనం అక్కడికి ముగిస్తే, వాళ్ళిద్దరూ రాజేశ్వరి అర్జునరావులు ఎందుకవుతారు?

"మరి....మీరావేళ చెప్పింది బాగానే ఉంటుందేమో అనిపిస్తుందండీ నాకూడా"

"ఏరోజోయ్....ఏం చెప్పాను!"

అతనికి తెలుసు, ఆమె ఏవిషయం మాట్లాడతున్నదీ. కానీ తను అడిగిన వెంటనే, మండిపడి, గొడవచేసి, ఇన్నాళ్ళయాక అంగీకరించబోతున్నదని. తనా విషయం పూర్తిగా మరిచి పోయిన వాడిలా అయోమయంగా అన్నాడు.

అతను సాయంత్రం ఆఫీసునుండీ వచ్చి కాఫీ టిఫిను ముగించి, తీరుబాటుగా

న్యూస్ పేపర్ పుచ్చుకుని కూర్చున్న సమయంలో మొదలయింది సంభాషణ.

"అదికాదండీ .... మీరారోజు చెప్ప లేదూ మనం ఒక పాపాయిని తెచ్చి పెంచుకుందామని .... అదే బాగుంటుం దేమోనని...."

"ఏం మనకప్పుడే వయసయి పోయిందా, ఇక పిల్లలు పుట్టరని పిస్తోందా?" అతను మామూలుగానే అంటున్నా తన మాటలు తనకే ఒప్పు జెప్పుతున్నాడని ఈశ్వరికి తెలుసు. అయినా ఉక్రోషాన్ని తమాయించుకుని, "ఎందుకండీ అంతకోపం, మీ మాట కాదన్నాననేనా....మనకు పుట్టరనికాదు. ఇప్పటికి ఒక పాపాయిని తెచ్చుకుందాం. ఇంట్లో పసిబిడ్డ తిరుగాడాలని నాకూ ఉందండి"

అతని పక్కనే నేలమీద చతికిల బడి, అతని మోకాళ్ళకి తల ఆన్చుకుని అంది ఈశ్వరి. అర్జునరావు మనసు కరిగి పోయింది. చేతిలో పేపర్ పక్కన పడేసి, భార్య తల నిమురుతూ, "అవునుమరి ఎన్నాళ్ళని నీకునేనూ నాకు నువ్వు పాపాయిలుగా ఉంటాం? మనిద్దరికీ వేరే పాపాయి కావాలి" అన్నాడు మృదువుగా.

"మరి ఎవర్నడుగుదాం....ఒకసారి మా ఊరికి వెళ్ళివద్దామండీ....మనకోరిక అమ్మకీ, నాన్నకీ చెబితే వాళ్ళే ఏర్పాటు చేస్తారు. ఏవరయినా మన బంధువుల్లో ప్రయత్నించమందాం....అసలు నా మన సులో ఒకటుంది....మా అక్కయ్యకి నలుగురుపిల్లలుకదా? ఒకర్ని మన కివ్వమంటే బావుండదూ? మా అక్కయ్య కూతురయితే మనకి బావుంటుంది కానీ... వాళ్ళే మంటారో మరి...."

ఈశ్వరి చెబుతూనే ఉంది. అర్జున రావు ఆలోచిస్తున్నాడు. అప్పటికప్పుడు భార్యకి ఏ సమాధానమూ చెప్పలేదు. అతని మనసులో ఉన్నదివేరు.

కానీ అతని మౌనాన్నే అంగీకారం అనుకున్న ఈశ్వరి అక్కడినించీ లేచి లోపలకి వెళ్ళి పోయింది.

"కూరేం వండమంటారు?" అనడి గింది మళ్ళీ ఇటువచ్చి.

"నీ ఇష్టం ఏదయినా త్వరగా ముగించెయి. సినిమాకి వెళదాం"

"సినిమాకా?"

"ఏం వద్దా?"

"అహ అదేంకాదు. ముందే చెబితే బావుండేదికదా అని. ఇప్పుడిక హడా విడిగా తయారు కావాలి....పోనీ కూర ఏదీ చెయ్యను....వచ్చిన తర్వాత రెండు ఆమ్లెట్ వేసుకుని, తింటే పోతుంది" అంటూనే ముఖం కడుక్కోబోయింది.

ఎంత హడావిడిగా తయారు కావలసి వచ్చినా, ఈశ్వరి సినిమా అనగానే వద్దు అనదని అర్జునరావుకి తెలుసు. ఆమెకి సినిమాల పిచ్చి ఎక్కువే.

ం ం ం

సినిమా కూడా, వీళ్ళలాగా పిల్లలు లేని దంపతులగురించే. వాళ్ళొక పిల్లవాణ్ణి తెచ్చి పెంచుకున్న తర్వాత, వాళ్ళకో కుర్రాడు పుడతాడు. పిల్లలిద్దరూ పెరిగి పెద్దయాక, కన్నకొడుకు వాళ్ళని ధిక్క రించి ఇల్లు వదిలి వెళ్ళిపోతాడు. పెంపుడు కొడుకే తల్లిదండ్రుల నుద్ధరించి, సినిమా సుఖాంతం చేస్తాడు. ఇదీ కథ.

రాత్రి భోజనాలు అయిన తర్వాత మళ్ళీ ప్రస్తావించింది ఈశ్వరి, "మరి ఎప్పుడు ఊరు వెళదామంటారు" అంటూ.

పక్కపొడి నములుతూ, మంచంమీద వెల్లకిలా రెండు చేతులమీద తల పెట్టుకుని పడుకుని, పైన తిరుగుతున్న ఫేను వంక చూస్తూ "ఊరికా? ఎందుకూ?" అన్నాడు అర్జునరావు.

"ఏమిటండీ అప్పుడే మర్చిపోయారా? మనం సాయంకాలం అనుకున్న విషయం..." నమ్మలేనట్లుగా అడిగింది.

"ఉహు మరచిపోలేదు...నాకు బాగానే గుర్తుంది"

"మరి..."

"మనం ఒక పాపని పెంచుకోవాలని అనుకుంటే, ఈ ఊళ్ళో ఎక్కడా పాపలు దొరకరా? మీవాళ్ళతో సంప్రదించటం ఎందుకూ?"

"అదేం మాటండీ...పిల్లని తెచ్చి పెంచుకోవటం అంటే అంత సులభం అనుకున్నారా ? కులం, మతం, కుటుంబ చరిత్ర ఇలాంటి మంచిచెడ్డ లెన్నో విచారణ చేయాలి ముందుగా.

అసలీ సమస్యలేవీ ఉండవనే, మా అక్కయ్య కూతుర్ని అడుగుదామండీ అన్నది. అది ఒప్పుకుంటే బావుంటుంది. అలా కానిపక్షంలో వేరే ప్రయత్నాలు చేయాలికదా?"

"ఉహు, నాకవన్నీ ఇష్టం లేదు. ఎవరుకన్న బిడ్డ అయితేనేం మన ఇంటి కొచ్చాక మనబిడ్డే అవుతుంది. ఆమాత్రానికి, కులం, మతం చూడాల్సిన అవసర మేమిటి? మన కులమతాలే మన బిడ్డ పీను...ఏమిటో యీ సీకీ పిచ్చి" చిరునవ్వుతోనే అన్నాడు అర్జునరావు.

ఒళ్ళు మండిపోయింది ఈశ్వరికి.

"ఛీ, ఇదేం మాటలు. ఎవరు పడితే వాళ్ళుకన్న బిడ్డని తెచ్చి ఏ వివరాలు తెలుసుకోకుండా మన ఇంట్లో ఎలా చేర్చుకుంటాం? ఉహు....నేను చచ్చినా ఒప్పుకోను."

"సరేలే. నిన్ను ఒప్పుకోమని బలవంతం చేస్తున్నదెవరు? నీ ఇష్టంకాకుండా ఈ ఇంట్లో నా ఇష్టం ఏనాడు సాగింది కనుక. నేను మాత్రం ఏ ఊరికీ రాను. ఎవరితో ఏమీ చెప్పను. నీ ఇష్టం. ఏమయినా చేసుకో" అనేసి, విసురుగా అటుతిరిగి పడుకుని కళ్ళుమూసుకున్నాడు అర్జునరావు.

ఈశ్వరి కింకా మాట్లాడాలనీ, అతన్ని సమాధానపరచాలనీ ఉంది. కానీ అతను నిద్ర కుపక్రమించేసరికి తనకూ కోపం వచ్చేసింది. తను బిగుసుకుని, లైట్ ఆర్పేసి, ఇటుతిరిగి పడుకుంది.

ఈ గొడవ అంతా ఇద్దరి మనసుల్లో మరుగునపడి మళ్ళా ఆ ఇంట్లో మామూలు పరిస్థితులు ఏర్పడేందుకు మూడురోజులు పట్టింది.

పుట్టింటికి ప్రయాణం అయింది ఈశ్వరి. అర్జునరావు ఆమెను సంతోషంగానే సాగనంపేడు కానీ, వెంట రమ్మని ఎంతగా బతిమాలుకున్నా, తనుమాత్రం బయలుదేరలేదు.

ఈశ్వరి వెళ్ళటమూ అయింది, మూడు రోజులకే తిరిగి రావటమూ అయింది. ఎంతో ఉత్సాహంగా వెళిన మనిషి, ముఖం వేలాడవేసుకొని ఇంటికొచ్చింది.

ఆమె చెప్పకముందే జరిగిందేమిటో ఊహించగలిగాడు అర్జునరావు. అయినా ఏమీ తెలియనట్లే "విశేషాలేమిటి?" అని అడిగి చెప్పించుకున్నాడు.

"మా అమ్మతో విషయం చెబితే, నువ్వే వెళ్ళి అక్కనీ బావనీ అడుగు అన్నదండీ. వెంటనే బయలుదేరాను అక్క ఇంటికి.

అంత ఆశగా నేను వెళ్ళి నీ పిల్లల్లో ఒక్కర్నియ్యవే, నేను పెంచుకుంటానని అడిగితే, తోడబుట్టిన చెల్లెలు అన్న అభిమానం అయినా లేకుండా ఎన్నిమాటలు అన్నదో.

హు, అవన్నీ నా నోటితో చెప్పలేను. నాకు అహంకారమట....నా మొగుడు పెద్ద ఉద్యోగంలో ఉన్నాడని.. అదెప్పుడూ అంతేనండీ..మాబావ వ్యాపారంలో వేలకువేలు సంపాదించి తెస్తున్నా సంతృప్తి లేదు. ఆయన ఎక్కువగా చదువుకోలేదని, హోదాగల ఉద్యోగం చేయటంలేదనీ చిన్నతనంతో కుళ్లుతూ ఉంటుంది" అంటూ కళ్లు తుడుచుకుంది ఈశ్వరి.

"పోన్లెద్దూ. ఆవిడేదో అన్నదని అంతగా బాధపడిపోవాలా? నిన్ను చూసినవాళ్లెవరూ నీకు అహంకారమని అనుకోరులే."

''నలుగురు పిల్లల్ని పెంచుకోలేనంత గతిలేనివాళ్ళం కాదు లేవే అన్నదండీ. మరో నలుగురు పుట్టినా, మహరాజులా పెంచి పెద్దచేయగలరట. అసలు దీన్ని అడగటానికి ఎందుకొచ్చేనా అనిపించిందండీ.

పిల్లలను కననివాళ్ళకి పెంచటం ఏం తెలుస్తుంది? అలాంటివాళ్ళకి కడుపు తీపి తెలిసిన తల్లిదండ్రులెవరూ పిల్లల్ని పెంపకాని కివ్వరు అని కూడా అనేసింది.

ఇంక ఊరుకోలేక పోయాను. నోటి కొచ్చినట్టు నేనూ నాలుగు దులిపేను. బావగారు వచ్చేదాకా ఉండటం కూడా దండుగ అనిపించి, వెంటనే బయట పడ్డాను, అక్కడినించీ"

ఇన్నీ విని అర్జునరావు అసలేమీ అనకపోయినా బావుండేది. కడుపులో దాచుకున్న మాటలన్నీ బయటికి వచ్చేశాక ఈశ్వరి మనసు శాంతించిఉండేది.

"నాకు తెలుసోయ్ ఇలా అవుతుందని. అందుకే నేను రానన్నది"

"అవున్లెండి. మీ తెలివితేటలు అందరికీ ఎక్కడ్నించివస్తాయి. అన్నీ తెలుసుకోగలరు మీరు. నేనే బుద్ధిలేనిదాన్ని. సిగ్గు లేకుండా వెళ్ళి, మాటలుపడి వచ్చాను" అని ఎగిరిపడుతూ, భర్త ఎదురుగా ఉండకుండా లోపలికి వెళ్ళి పోయింది ఈశ్వరి.

ం ం ం

తనతో మాటమాత్రం అనకుండా భర్త ఇంతపని చేస్తాడని ఈశ్వరి కలలో కూడా ఊహించి ఉండలేదు.

అర్జునరావు ఊళ్ళో లేడు. ఆఫీసుపని మీద ఊరువెళ్ళాడ. రాత్రి పదిన్నరకి తలుపుకొట్టిన చప్పుడుకి నిద్రమెలకువ వచ్చింది ఈశ్వరికి.

లేచివెళ్లి తలుపు తీసింది. అతని భుజంమీద నాలుగేళ్ళ పసిబిడ్డ నిద్ర పోతూ ఉంది. మరో చేతిలో సూట్ కేస్ ఉంది.

చూస్తున్నది కలో నిజమో అర్థం

## పితృవాక్యం

ఈ దేశ జీవితం శిథిలాలయంలో గబ్బి
లంలా గాక
అస్తమయం ఎరుగని సూర్యుడిలా వెల
గాలనీ
ఈ వ్యవస్థ పగబట్టిన పాములా గాక
పచ్చని చెట్టులా నీడనివ్వాలనీ
ఈ పుచ్చిపోయిన ప్రభుత్వాలు ఎండు
టాకుల్లా రాలి
ప్రజా ప్రభుత్వాలు నందనాల్లా మొల
వాలనీ
విచ్చుకత్తుల ఈ విలువలబోను ముక్కలై
పుచ్చపువ్వులా బతుకులో
వెన్నెల కాయాలనీ
కోరుకునే వాళ్లు
తమ దేశంలో తామే పరాయి వాళ్లుగా
తిరుగుతున్నారు
కాంతా కనక మదిర సుఖాలకు లొంగని
ధీరులు
పదవీ లాలన విషకోరల నెదిరించే వీరులు
కృత్రిమ పరలోకాన్ని కాదని
ఈ బాహ్యలోకాన్నే వాసయోగ్యం
చేద్దామనుకునే
కృత నిశ్చయులు
మాటువేసి పట్టుకోబడుతున్నారు
హంతకులుగా అభివర్ణింపబడి
అరదండాలతో అలంకరింప బడు
తున్నారు
ఆశయాలు అజ్ఞాత వాసంలో
విప్లవ కార్యకలాపాలు వదంతులుగా
ప్రతిఘటనా నినాదాలు గోడ మీద
రాతలుగా
సమ సమాజ సిద్ధాంత విశ్వాసం రహస్య
చర్యగా
కరపత్రాలు గాలిలో కలిసిపోయే ఆలోచ
నలుగా
కవిత్వాలు మూగివాడి సంభాషణగా
మార్చబడుతున్న మాంత్రిక ప్రదేశం
బయొనెట్లలో వెక్కిరింపబడే హరి
జనం
ఇనప బూట్ల పహారాలో విశ్వవిద్యా
లయం
ఇంకా ఎంతకాలం
నేస్తుడా
అజ్ఞాత వాసం శత్రువుకి మరింత బలం
ఆశయ జ్ఞానమే ఆయుధం
ఎదురొచ్చి తలపడు
విప్లవ సూర్యుణ్ణి రాత్రిలోకి వెళ్లనియ్యకు

-నగ్నముని-

కాలేదు ఈశ్వరికి. ఏంచేయాలో తోచని వెర్రిదానిలా అలాగే చూస్తూ నిలుచుండిపోయింది భర్తవైపు.

"పాపని లోపల పడుకోబెట్టు" అంటూ, ఆమెకు అందించాడు అర్జునరావు.

అనాలోచితంగానే పాపని ఎత్తి గుండెల కాన్చుకున్న ఈశ్వరికి ఎందుకో ఒళ్లు జల్లుమన్నది. "ఎవరీ పాప?" అని మనసును తొలుస్తున్న సందేహ నివృత్తిని వాయిదా వేసి, పాపని తీసుకెళ్ళి పక్క మీద పడుకోబెట్టింది.

అర్జునరావు చన్నీళ్ళతోనే స్నానం చేసి వచ్చాడు. అంతరాత్రి అన్నం తినటం అయినా కష్టంఅని, అతను స్నానం చేసేసరికి, గబగబా పిండి తడిపి చపాతీలు తయారుచేసింది ఈశ్వరి.

పప్పూ, చపాతీలు వడ్డించి, ఓ కప్పు

పోర్న్‌పీటా కలిపి అతనికి అందించింది. అతని ముఖంలో కనిపిస్తున్న అలసట గమనించి మౌనంగా ఉండిపోయింది.

అతను సిగరెట్ వెలిగించుకుందుకు అగ్గిపెట్టె అందిస్తూ అడిగింది, "ఎవరండీ ఈ పాప?" అని.

సీరియస్‌గా సిగరెట్ వెలిగించుకుంటూ అన్నాడు అర్జునరావు, "ఎవరు అంటే ఎవరో నాకే తెలియనప్పుడు నీకెలా చెప్పను? మన ఇంట్లో మన పాపగా పెంచుకుందామని తీసుకొచ్చాను."

"అంటే ఎక్కడ దొరికింది పాప మీకు?"

"దొరకడమేమిటి, అదేమయినా మనం పోగొట్టుకున్న వస్తువా?"

"పోనీ ఎక్కడ కనిపించింది? ఎక్కడినించి తెస్తున్నారు? మీకెవరు అంటగట్టేరు చెప్పండి"

ఈశ్వరికి కోపం వచ్చేస్తోందని తెలుసు. కానీ ఏం చేయగలడు? అతనికి నిజంగానే తెలీదు, ఆ పిల్ల ఎవరో. పోనీ జరిగిన విషయం చెబుతాను అనుకున్నాడు.

"రాత్రి నే వచ్చిన రైల్లో నాతోటి ప్రయాణీకుల్లో ఈ పిల్ల, వాళ్ళమ్మా ఉన్నారు. రాత్రి నిద్రలో చాలామటుకు అంతా జోగుతున్నారు. ఈ పిల్లని వది లేసి పిళ్ళమ్మ ఒక్కతే అవతలికి వెళ్ళటం నేను చూసాను. బాత్‌రూంకి కాబోలు అనుకున్నాను. కానీ ఆ చీకట్లో రైలు ఒక బ్రిడ్జిమీద వెళుతుండగా, పెద్దగా కేక వేయటంలో ఆమె కిందికి దూకేసిందని అర్థం అయింది. గొలుసు లాగి రైలు ఆపాం, కానీ ప్రయోజనం ఏమీ లేకపోయింది. బ్రిడ్జికింద ఉధృతంగా ప్రవహిస్తున్న ఏటి నీళ్ళలో, ఆ చీకట్లో మనిషి కోసమయినా, శవంకోసమయినా ఏమని వెతుకుతాం?

ఈ పిల్ల నేం చేయాలి అన్న ప్రశ్న వచ్చింది. ఏశరణాలయంలోనో చేర్పించమని అందరూ నాకే సలహా ఇచ్చారు. నేను మాత్రం అప్పటి కప్పుడే నిర్ణయం చేసుకున్నాను, ఈ పాప మనతో ఉండాలని. అందుకే తీసుకొచ్చేసాను"

"ఇంత రాత్రివేళ మీరుమాత్రం ఇంత కన్నా ఏం చేస్తారు. ఉదయం ఆలోచించి, పోలీస్ స్టేషనులోనో, అనాధ శరణాలయంలోనో అప్పగిస్తే సరి" తేలికగా అన్నది ఈశ్వరి.

"వద్దు ఈశ్వరీ. ఈ పాపని మనమే పెంచుకుందాం. ఇలా జరగాలని రాసి పెట్టబడి ఉందేమో అసలు. లేకపోతే, ఎప్పుడూ రిజర్వేషను లేకుండా ప్రయాణం చేయని నేను ఇలా జనరల్ కంపార్ట్‌మెంట్ ఎక్కవలసి రావటం ఏమిటి?"

"మీరొక్కరేనా నిర్ణయించుకోవలసింది? నా ఇష్టాఇష్టాలతో పనిలేదా? ఆ పిల్లని కన్నతల్లి ఎవరో ఏమిటో, ఏ అక్రమ సంబంధంవల్ల కలిగిన సంతానమో, ఛీ తలచుకుంటే ఒళ్ళు జలదరిస్తుంది. ఇలాంటి దిక్కులేని అప్రాచ్యపు పిల్లని మనం పెంచుకోవడమేమిటి? వద్దు, నామాట వినండి."

"నిజంగా ఆ పిల్ల తల్లిదండ్రులే పాపమో చేసి ఉంటే, అందుకీ పసిబిడ్డ ఎలా బాధ్యురాలవుతుంది. అంతో ఇంతో చదువుకున్నదానివిలా చాదస్తంగా

మాట్లాడతావేమిటి?"

"చదువుకుంటే మాత్రమేం? కులం, మతం, ఆచార , సాంప్రదాయం అన్నీ వదిలేసి వీధిని పడాలా? ఆ పిల్లమీద అంత జాలి ఉంటే, ఏ అనాధ శరణాలయంలోనో చేర్చి ధనసహాయం చేయండి, వద్దను. మన ఇంట్లో ఉంటే మాత్రం నేను భరించలేను.''

"ఓహో నీ నిర్ణయం అదే అయితే, నేనూ నా నిర్ణయం చెబుతున్నా చూడు. ఈ పిల్ల మనింట్లోనే ఉంటుంది. నువ్వేం దాన్ని సాకనక్కరలేదు. అన్నీ నేనే చూసుకుంటాను.

ఇంతవరకూ నేను, ఎప్పుడూ, ఏ విషయంలోనూ నీమాటని కాదనలేదు. అన్నీ నీ ఇష్టంగానే జరుపుకుని వస్తున్నావు. కానీ ఈ ఒక్క విషయంలో నీకు చేతనయితే రాజీపడు. లేదా పట్టించుకోకుండా ఉండు....అంతేగానీ నన్ను వేధించొద్దు ఈశ్వరీ" అంటూ నిద్రపోతున్న పాపపక్కన పడుకున్నాడు అర్జునరావు.

అంతే. ప్రచ్ఛన్న యుద్ధానికి అదే ప్రారంభం. భార్యాభర్త లిద్దరిమధ్యా కళ్లకు కనిపించని తెరలేవో దిగినట్లయింది.

కలతనిద్రలో రాత్రి గడిపిన ఈశ్వరి బాగా పొద్దెక్కేదాకా నిద్ర లేవలేదు. కళ్లు తెరవగానే పక్కన మంచంమీద భర్త, అతని మెడచుట్టూ చేతులేసి నిద్రపోతున్న పాప కనిపించారు.

రాత్రి హడావిడిలో సరిగ్గా గమనించలేదు ఈశ్వరి. ఇప్పుడు ఉదయపు వెలుగులో పరిశీలనగా పాప ముఖంలోకి చూసింది నల్లగా, ఒత్తుగా, మెడదాకా మాత్రం ఉన్న జుట్టు ఒంకరలు తిరిగి ముఖాన పడి నుదురునంతా కప్పేసింది. నిద్రలో మూసుకుని ఉన్న చిన్నకళ్లు, కొద్దిగా రోజారంగు కనిపిస్తున్న పలుచని బుగలు, సున్నాలాగా చుట్టినట్లున్న పెదవులు, చిన్నారి ముక్కుతో రబ్బరు బొమ్మలా ఉంది.

లేచివెళ్ళి స్నానంచేసి పూజగదిలో కూర్చుంది. ఎప్పటిలా విష్ణుస్తోత్రం, లలిత సహస్రనామాలు పారాయణం చేసుకుంది. కనులు మూసుకుని, తనకు సంతానాన్ని ప్రసాదించమని దేవుణ్ణి కోరుకుంది. వెంటనే ఆవతల నిద్రలో ఉన్న పాప ముఖమే కన్నులముందు సాక్షాత్కరించింది. 'ఛీ, పాడుపిల్ల' అనుకుని, అపరాధం అయినట్లు చెంపలు వాయించుకుని లేచి ఇవతలి కొచ్చేసింది.

○ ○ ○

పాపకు శైలజ అని పేరుపెట్టి, ఇంటికి దగ్గరగా ఉన్న ఒక నర్సరీ స్కూల్లో చేర్చాడు అర్జునరావు. స్కూల్లో పాపని వదిలి, తీసుకురావటానికి, మధ్యాహ్నం అన్నం తినిపించటానికీ ఆయాను ఏర్పాటు చేసాడు. ఉదయం ఇంట్లో ఉన్నంత సేపు పాప అవసరాలన్నీ తనే చూసుకుని ఆఫీసుకు వెళుతున్నాడు.

ఈశ్వరి కిదంతా కంటగింపుగా ఉంది. అసలీయన కెందుకింత పట్టుదల. ఈ పిల్లనిగురించి, ఆయన చెప్పినదంతా నిజమేనా అసలు? లేదా ఇంకేదయినా తనకు తెలీని కథ ఉన్నదా అని అనుమానం కూడా రాకపోలేదు, ఒకటి రెండుసార్లు. కానీ ఇన్నేళ్ళ కాపురంలో

భర్త అబద్ధం చెప్పటం ఆమె ఎన్నడూ ఎరుగదు. తను ఏపని చేసినా, తప్పయినా, ఒప్పయినా, పైకి చెప్పేందుకు జంకే మనిషి కాడు అతను. అందుకే అతను చెప్పిందే నిజం అయిఉండాలని నమ్మింది చివరికి.

అతను మాత్రం ఏమీ జరుగనట్లే మసులుకుంటున్నాడు. అవసరం అయినప్పుడు ఈశ్వరితో మామూలుగానే మాట్లాడుతున్నాడు.

ఈశ్వరి తనూ అలాగే ప్రవర్తించాలని ప్రయత్నిస్తోంది. కానీ, ఇద్దరి మనసులు ఎంత దూరం అయాయో, అందువల్ల ఎంత అశాంతిగా ఉందో ఇద్దరికీ తెలుస్తూనే ఉంది. అయినా ఒకరిది పంతం అయితే, మరొకరిది పట్టుదల అయికూర్చుంది.

ఆవేళ సాయంత్రం అర్జునరావు ఇల్లు చేరేసరికి కొద్దిగా ఆలస్యం అయింది. శైలజ లాన్ లో మట్టితో ఆడుతూ ఉంది, బొమ్మలు పెట్టుకుని. స్కూటర్ శబ్దం వినిపించగానే, చేతులు గౌనుకి తుడిచేసుకుని, గేటుదగ్గరికి పరిగెత్తి వెళ్ళింది.

"ఇంతలేటయిందేం నాన్నా. నేనొచ్చి ఎంతసేపయిందో" అని పలకరించింది.

"సారీ బేబీ....కొంచెం పని ఉండి ఆలస్యం అయిపోయిందమ్మా" అని రెండుచేతుల్లో శైలజని ఎత్తుకుని లోపలికొచ్చాడు అర్జునరావు.

"డ్రస్ మార్చుకోవాలికదూ నువ్వు" అంటూ తనే అతని ఒళ్ళోంచి దిగేసింది శైలజ.

"వద్దులేమ్మా. మనం షికారుకి వెళ్దాం. కాఫీ తాగేసి వచ్చేస్తాను. నువు పాలు తాగేవా?"

"ఊఁ... ఉండు అయితే నేను ముఖం కడుక్కుంటాను" అంటూ తుర్రుమని లోపలికి వెళ్ళిపోయింది.

ముఖం కడుక్కోవటమంటే పూర్తిగా బట్టలు తడిపేసుకుంటుందని తెలుసు. అందుకే రెండు గుక్కల్లో కాఫీ తాగేసి బాత్రూం దగ్గరికి పరిగెత్తాడు అర్జునరావు.

పాపను రెడీ చేసుకుని, షికారుకి తీసుకుని బయలుదేరాడు స్కూటర్ మీద.

చాలామటుకు రోజూ జరిగే తంతు ఇదే. అంతా చూస్తూ, కోపంతో మండిపోవటమేకానీ, ఏం చేయలేకపోతోంది ఈశ్వరి. తనిలాగే మొండికేస్తే, అతను విసిగిపోయి, భయపడి, ఎప్పటికయినా ఈ పిల్లని ఏ అనాధ శరణాలయానికో పంపించేస్తాడన్న నమ్మకం, రోజులు గడిచినకొలదీ సడలిపోతోంది.

ఆ పిల్ల 'నాన్నా' అని పిలిచినప్పుడంతా ఈశ్వరి మనసు కలచివేసినట్లు అవుతుంది. వాళ్ళిద్దరూ తన ఉనికిని మరిచిపోయి కధలు, కబుర్లు చెప్పుకోవటం చూసినప్పుడల్లా ఉక్రోషంతో ఉడికిపోయినా, ఈ పిల్లే తమకి కావలసినవారెవరి బిడ్డో అయితే ఎంత బావుండేది అనిపిస్తుంది.

"అమ్మ ఎందుకలా కోపంగా ఉంటుంది? నాతో మాట్లాడదేం? అని రోజు కొకసారయినా అడక్కుండా ఉండదు శైలజ.

"ఆవిడ అంతేనమ్మా. నాతోనూ మాట్లాడదు, పోనీ మనమే కబుర్లు చెప్పుకుందాంలే" అని సర్ది చెపుతూ ఉంటాడు

అర్జునరావు.

వచ్చిన నెలరోజులకే బొద్దుగా ముద్ద బంతి పువ్వులా తయారయింది శైలజ "ఎంతముద్దుగా ఉందో" అని ఎప్పు డయినా అనిపించినా, దగ్గరికి తీయటానికి మాత్రం చేతులు రావు ఈశ్వరికి, "ఆయనయితే, 'సర్వం జగన్నాథం' అని ఇంట్లో కలిపేరు కానీ, ఆపిల్లని నేనెలా అక్కున చేర్చుకునేది" అనిపిస్తుంది.

చీకటి పడుతుండగా పాపతో ఇల్లు చేరాడు అర్జునరావు. ఎప్పటిలా స్కూటర్‌దిగి లోపలికి నడచుకు రావలసిన శైలజని అతను భుజం మీద వేసుకుని రావటం చూసింది ఈశ్వరి. ఏమయిందో అనుకుంది కానీ అడగ లేక పోయింది.

కళ్ళు మూసుకుని ఉన్న పాపని పదిలంగా మంచంమీద పడుకోబెట్టి మళ్ళీ బయలుదేరాడు అర్జునరావు.

"నేవెళుతున్నా తలుపేసుకో ఈశ్వరీ. పాపకి జ్వరం వచ్చినట్లుంది. ఏదయినా ముందు తెస్తాను" అంటూ వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి ఇద్దరికీ జాగరణే అయింది, పాపకి టెంపరేచర్ బాగా ఎక్కువ యింది. పిచ్చిదానిలా నిద్రలో ఏదో మాట్లాడుతూ ఉంది.

తను తెచ్చివేసిన మందువల్ల ఫలితం ఏమీ కనిపించక అర్జునరావు పదిన్నరకి వెళ్ళి డాక్టర్ని పిలుచుకొచ్చాడు.

అతను వ్రాసి ఇచ్చిన మందులు రాత్రంతా గంట గంటకీ శైలజ చేత మింగిస్తూ నుదుట తడిచేస్తూ కుర్చునే ఉన్నాడు. ఈశ్వరికి ఏం చేయటానికి తోచకుండా అయింది.

భర్త పడుతున్న బాధచూస్తే, ఒక వైపు జాలేస్తోంది. ఏమిటో దారిన పోయే తద్దినాన్ని తెచ్చి తల మీద పెట్టుకుని ఇంత శ్రమ పడుతున్నారు అని మరో వైపు చిరాకుగా ఉంది.

తెల్లవారుజామున కొద్దిగా నెమ్మ దించింది శైలజకి. కలవరింతలు లేకుండా నిద్రపోతోంది. అప్పుడే కొంచంసేపు విశ్రాంతి తీసుకుని ఆఫీస్‌కి బయలు దేరాడు అర్జునరావు.

"పది నిముషాల్లో సెలవు పెట్టి వచ్చేస్తానింటికి" అని చెప్పి వెళ్ళి పోయాడు.

పదినిముషాల్లో వస్తానన్న మనిషి గంటయినా పత్తాలేదు. పదిన్నరకి కాబోలు ఆఫీసు జవాను వచ్చాడు, స్కూటర్ తీసుకుని.

"అయ్యగారు అర్జంట్‌గా కేంపు వెళ్ళాలిసొచ్చిందమ్మా. మూడు రోజులకి బట్టలు సర్దియ్యమన్నారు. ఇంటి కొచ్చేందుక్కూడా టయిం లేదట" అన్నాడు హడావిడిగా, చీటీ ఒకటి అందిస్తూ.

అర్జున రావుకిలాంటి అర్జంటు కేంపులు మామూలే. అందుకే చీటీని అలా టేబుల్ మీద ఉంచేసి, ముందుగా అవసర మయిన వస్తువులు, దుస్తులు సర్ది సూట్ కేస్ అందించి అతన్ని పంపించే సింది ఈశ్వరి.

ఆటుతర్వాతే కవర్లో ఉన్న చీటీని విప్పిచదువుకుంది.

"ఈశ్వరీ,

సారీ. ఇంటికి వచ్చి వెళ్ళేందుకు టయింలేదు. ఫైల్సుకొన్ని సరిచూసుకొని,

# మీ గుడ్డలకు పోటీలేని తెలుపు తెచ్చే మేటియైన నిరాలా.




ఈ రోజే **నిరాలా** కొనండి. సరసమైన ధర—సరియైన సబ్బు.



తుంగభద్రా ఇండస్ట్రీస్ లిమిటెడ్ వారి ఉత్పాదన కర్నూల్ (ఆంధ్రప్రదేశ్)

## శాపగ్రస్తులా?

తల్లి గర్భాలలోనే బాల్యాన్ని వదిలి
వచ్చిన వాళ్ళు
రేపటి మమతానురాగాల కలలు కంటూ
పేవ్‌మెంట్ల వాడిలో ముడగ తీసు
కుంటున్న వాళ్ళు!
వెచ్చని బతుకులోని తడిని
రోజూ ఇంత పీలుస్తున్న మీరు,
యవ్వనపు జాడే కనపడనీకుండా
పతితలోకం ముసలితనాన్ని
మోపుతున్న మీరు
"శాపగ్రస్తులని" ఈ దేశపు లేతమొగ్గలను
కాని దేవుళ్ళ పాదాల్లో అలంకరిస్తున్నారు
ఈ జాతి సంపదలో
నును లేత చేతులు భాగమెంత?
పసిపిల్లల శ్రమదోపిడిలో
"అన్ని పాపాలు అనుభవిస్తూ
పెరుగుతున్న
బాలపౌరులు" ఎంతమంది?
అడుగడుగునా
గాడీపడే ఈ వ్యవస్థా యంత్రంలో
ఇంధనమవుతున్న దీనుల్లో అంగ
విహీనుల్లో
మన తమ్ముళ్ళు మన బిడ్డలు
పూలకే శపించే మీతరం లోంచి
చీల్చుకుంటూ గాథ పలుకుతున్నది
ప్రతిఘటించే మరోతరం!

**నిఖిలేశ్వర్**

ట్రెయిన్ అందుకోవాలి. మూడు రోజులవుతుందేమో, తిరిగి రావటానికి.

నిన్నరాత్రి అనుభవంతో నానిర్ణయం పొరబాటేమో అనుకోవలసి వచ్చింది. ఎవరో కన్న బిడ్డని తెచ్చి; అమ్మా నాన్నా రెండూ నేనే అయి పెంచుదాం అని అనుకోవటం ఎంత తెలివి తక్కువో తెలిసింది. నేనే ఓడిపోయాను ఈశ్వరీ! తిరిగి ఇంటికి రాగానే, శైలజని ఎటయినా పంపించే ఏర్పాటు చూస్తాను.

అంత వరకూ కాస్త కనిపెట్టుకుని ఉంటావుకదూ? నా కోసం అయినా. దానికి నువ్వు అమ్మవి కానక్కర్లేదు. మామూలు మనిషిగా, సాటిమనిషి పట్ల చూపించాల్సిన మానవత్వపు దృష్టితో అయినా జ్వరంతో మంచాన ఉన్న ఆ పసిదాని మంచి చెడ్డలు చూస్తావని ఆశిస్తున్నాను.

నువు రోజూ పూజలు చేసే దేవుడు నీ పూజగదిలో, పటాల్లో విగ్రహాల్లో మాత్రమే ఉన్నాడని అనుకుంటావు కదూ? ఎంత పిచ్చిదానివి నువ్వు. ఈ ప్రపంచంలో ఆదేవుడు సృష్టించిన ప్రతీ ప్రాణిలోనూ ఆయన అంశ ఉంటుందని నీకెప్పుడూ అనిపించదూ? అంత దైవ భక్తిఉన్న నీమనసు మరికాస్త విశాలమయి ఉంటే ఎంత బాగుండేది?

పోనీలే 'ఉంటాను మరి' ఉయిం అవుతోంది.

ప్రేమతో, 'అర్జున్'" అనిఉంది.

అప్పటికప్పుడే ఉత్తరాన్ని ఎన్ని సార్లు చదువుకుందో, చదువుకుంటూ ఆలోచిస్తూ, ఎంత సేపలా కూర్చుండి పోయిందో ఈశ్వరికి గుర్తేలేదు.

శైలజకి మెలకువ వచ్చిందేమో 'నాన్నా' అని పిలుస్తోంది, నీరసంగా ఉత్తరాన్ని తీసిపెట్టి పాప దగ్గరికి నడిచింది ఈశ్వరి.

ఆమెని చూసి కళ్ళు చిట్లిస్తూ "నాన్న లేడూ?" అడిగింది.

'ఊహు' అంది ఈశ్వరి ఇంకేం చెప్పాలో తెలియలేదు. దగ్గరికి వెళ్ళి నుదురు తాకి చూసింది. జ్వరంలేదు అనుకుని సంతృప్తి పడింది. చిత్రంగా తనముఖంలోకి చూస్తున్న శైలజని, "పాలుతాగుతావా?" అనడిగింది.

"అప్పుడే ఆఫీస్‌కి వెళ్ళిపోయాడా నాన్న"

"ఊరెళ్ళారు. ఇప్పుడేరారు. ముఖం కడుక్కుందువురా" అని చేతులుచాచి ఎత్తుకోబోయింది.

ఇదేమీ గమనించనట్లుగా శైలజ తనే లేచి బాత్‌రూమ్‌కి నడుచుకుని వెళ్ళి పోయింది. గౌను ముడుచుకుని, గొంతు క్కూర్చుని పళ్ళుతోముకుంది. రాత్రంతా జ్వరంతో మూలుగుతూ ఉన్న పిల్ల తెల్లారేసరికి అంత హుషారుగా తిరగటం ఆశ్చర్యంగా ఉంది ఈశ్వరికి.

కానీ పాలుతాగేసి ఆగకోకుండా శైలజ మళ్ళీ వెళ్ళి పడుకుంది. దాంతో విషయం అర్థమయిపోయింది. నాన్న లేడు. ఇప్పుడే రాడు అని తెలిసిన తర్వాత తన పనులు తనే చేసుకోవాలని తెలుసుకున్నందుకే నీరసంగా ఉన్నా లేచి తిరిగిందన్నమాట.

"పసిబిడ్డ అయినా ఎంత పట్టుదల" అనుకుంది ఈశ్వరి.

హఠాత్తుగా గుర్తొచ్చినదానిలా, "నేను స్కూలుకు వెళ్ళొద్దా?" అనడిగింది శైలజ.

"ఒద్దులే. జ్వరం బాగయాక పోదువు గాని" అని చెప్పింది.

ఆవేళ రెండు పూటలా కొద్దిగా బ్రెడ్, పాలు ఇచ్చింది శైలజకి. రాత్రయేసరికి, మళ్ళీ అడిగింది, "నాన్న రాలేదేం?" అని

"ఊరు వెళ్ళాడు కాదూ, ఇప్పుడే రాడు"

మాట్లాడకుండా మంచంమీద మూలకి ముడుచుకుని పడుకుంది శైలజ. ఈశ్వరి మనసు పరిపరి విధాల పోతోంది. ఉదయం పదేపదే చదువుకున్న భర్త ఉత్తరంలో మాటలే గుర్తొచ్చి కలవరపెడుతున్నాయి.

అర్ధరాత్రి నిద్రలో "నాన్నా నాన్నా" అని కలవరిస్తోంది శైలజ. ఉలిక్కిపడి లేచిన ఈశ్వరికి, అంతదాకా తను లైట్ కూడా ఆర్పకుండా నిద్రపోయానని గుర్తొచ్చింది.

పాపకి మళ్ళీ జ్వరం వచ్చిందేమోనని చూసింది. దగ్గిర కూచుని, మెల్లిగా జో కొట్టింది. కొంత సేపు పాప చిన్నారి చేతిని తన చేతిలో ఉంచుకుని, అలాగే నిద్ర పోయింది.

ం ం ం

శైలజ అప్పుడు బాగుంది. స్కూలుకి వెళ్ళి వస్తూంది. అర్జునరావు కేంపు ఇంకా మూడు రోజులు పొడిగించబడింది.

ఇష్టంగానో అయిష్టంగానో శైలజకి దగ్గరవటం తప్పనిసరి అయింది ఈశ్వరికి. మధ్యాహ్నం నుంచీ తలనొప్పిగా ఉంది ఆమెకు. సాయంత్రం ఇంటికి రాగానే పసికట్టేసింది శైలజ. "డల్‌గా ఉన్నావేం?" అనడిగింది, పాలల్లో బిస్కెట్ అద్ది కొరుక్కుని తింటూ,

జవాబు చెప్పకుండా కణతలు నొక్కుకుంటూ పడుకుంది ఈశ్వరి. "తలనొప్పికదూ? తైలం రాసుకుంటే పోతుంది" అంటూ ఎక్కడనుంచో అమృతాంజనం సీసా తెచ్చి పక్కమీద

# ఆంధ్రప్రదేశ్ లో రైతులకు చేయూత

రైతు మన ఆర్థిక వ్యవస్థకు వెన్నెముక. శ్రీ టి. అంజయ్య నాయకత్వంలో ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం రైతుల ఆర్థిక అభ్యున్నతికి అనేక చర్యలు తీసుకున్నది.

※ రుణాల చెల్లింపు గడువు పునర్నిర్ణయం.

1980 జూన్ 30వ తేది నాటికి సహకార పరపతి సంస్థలకు రైతులు బకాయి పడ్డ రుణాల వసూళ్ళ విషయంలో కాల వ్యవధిని పునర్నిర్ణయించారు.

| | |
|---|---|
| ※ అసలు మొత్తం సాధారణ రుణం మధ్యకాలిక (మార్పు చేసిన) రుణ వాయిదా.<br>మధ్యకాలిక (పునర్నిర్ణయాల) రుణ వాయిదా. | మూడు సంవత్సరాల రుణంగా పునర్నిర్ణయం సాధారణ రుణంతో కలుపుకొని సగటు రుణం మొత్తం 5 సంవత్సరాల రుణంగా పునర్నిర్ణయించబడి సాధారణ, మధ్యకాలిక (మార్పు చేసిన) రుణాలతో సహా మొత్తం రుణాన్ని 7 సం. రుణంగా పునర్నిర్ణయించబడింది. |

※ వడ్డీ :

| | |
|---|---|
| ఒక సంవత్సరానికి వడ్డీ బకాయి | ఒక సంవత్సరంపాటు వాయిదా వేశారు. |
| రెండు సంవత్సరాల వడ్డీ బకాయి | రెండు సంవత్సరాల గడువు పెంచారు. |
| మూడు సంవత్సరాలు, అంతకు మించిన కాలానికి వడ్డీ బకాయిలు | మూడు సంవత్సరాల పాటు వ్యవధి పెంచారు. |

మొత్తం మీద గడువు పొడిగింపు మూడు సంవత్సరాలకు మించకుండా దీర్ఘకాలిక రుణాలను రుణం కాలం వ్యవధితో పాటుగా బకాయిపడ్డ వాయిదాల సంఖ్య మేరకు తిరిగి చెల్లించడానికి గడువు పెంచారు.

## ✱ పంట రుణాలు

1980 ఖరీఫ్ కాలంలో సహకార బ్యాంకులు రికార్డు స్థాయిలో రు [illegible] కోట్ల మేరకు పంట రుణాలను రైతులకు మంజూరు చేశాయి

75 శాతం సహకార బ్యాంకు రుణాలను 5 ఎకరాల మాగాణీ లేదా 10 ఎకరాల మెట్ట భూమిగల రైతులకు మంజూరు చేస్తారు ఇందువల్ల చాలా వరకు బలహీన వర్గాలకు లాభం కలుగుతుంది ఇందులో మూడవ వంతు మొత్తాన్ని షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు తెగల వారికి కేటాయిస్తారు

## ✱ దీర్ఘకాలిక రుణాలు

రాష్ట్ర సహకార వ్యవసాయ అభివృద్ధి బ్యాంకు ప్రస్తుత సంవత్సరంలో రు 65 కోట్ల మొత్తాన్ని భూముల అభివృద్ధి, బావుల త్రవ్వకం, తోటలు, గొర్రెలు, కోళ్ల పెంపకం పథకాలకు కేటాయించింది

## ✱ రుణాల వసూళ్ళ నిలిపివేత

కరువు బాధిత ప్రాంతాలలో రుణాల బకాయీలు, సెస్సులతోసహా భూమి శిస్తు వసూళ్ళను ప్రభుత్వం నిలిపివేసింది

## ✱ పంటల భీమా

వరి జొన్న, వేరుశనగ పంటలకు భీమా పథకాన్ని ప్రవేశపెట్టారు

---

**డైరెక్టరు, సమాచార, పౌరసంబంధ శాఖచే ప్రకటితము.**

కూర్చుంది.

ఈశ్వరి జవాబుకోసం కూడా చూడకుండా, తన చిన్న వేళ్ళతో తైలాన్ని అద్దుకుని ఆమె నుదుటికి రాసి మెల్లిగా నొక్కుతూ ఉంది శైలజ.

"నాన్న ఇవేళ వస్తాడా?"

"అవును"

"నాన్న వచ్చాక కూడా నా దగ్గిర నువ్వే పడుకోవూ?"

సరిగ్గా అప్పుడే ఊరినుంచీ వచ్చిన అర్జునరావు ఇంట్లోకి రావటమూ, నేరుగా లోపలికొచ్చి వీళ్ళిద్దర్నీ చూడటమూ జరిగింది.

ఈశ్వరి తప్పు చేస్తూ పట్టుబడిన దానిలా గభాలున లేచి కూర్చుంది. ఈ కొన్నిరోజుల సాన్నిహిత్యానికే, ఆ పసిపాప తన మీద ఏర్పరచుకున్న ప్రేమాభిమానాన్ని జీర్ణించుకో లేకుండా ఉంది మనసు.

దుస్తులు మార్చుకుంటూ, "ఏమిటోయ్ నుస్తీనా?" అడిగాడు అర్జునరావు.

"అబ్బే లేదు. కొద్దిగా తలనొప్పిగా ఉంటేను, అమృతాంజనం రాస్తానని తనే కూర్చుంది శైలజ."

"ఓహో" అన్నాడు ఏదో అర్థమయిన వాడిలా. సాయంత్రం అంతా తండ్రీ కూతుళ్ళిద్దరూ కరువుదీరా కబుర్లు చెప్పుకున్నారు. తనకోసం అతను తెచ్చిన కొత్త ఫ్రాక్ వేసుకుని మురిసి పోతూ వెళ్ళి ఈశ్వరికి చూపించింది, "బావుందామ్మా?" అంటూ.

శైలజ తన్ని 'అమ్మా' అనిపిలవటం ఎప్పటినించీ ప్రారంభించిందీ ఈశ్వరికి గుర్తులేదు. "చాలా బాగుందమ్మా" మనస్ఫూర్తిగా అన్నది.

రాత్రి శైలజ నిద్రపోయేక, "సారీ. బాగా ట్రబుల్ ఇచ్చిందా శైలూ....బాగా తిట్టుకుని ఉంటావుకదూ నన్ను" అనడిగాడు అర్జునరావు.

"అబ్బే. అదేంలేదు." తడబడింది ఈశ్వరి, ఏదో చెప్పాలనుంది ఆమెకి. మాటలు అందటంలేదు.

"హైద్రాబాద్‌లో ఒక కాన్వెంట్ స్కూల్లో చేర్పిద్దామనుకుంటున్నా శైలజని' పెద్దగా ఖరీదయిన స్కూలేం కాదు. నెలకి వందరూపాయలు పంపితే చాలు. అదయినా నీకిష్టమయితేనే.... లేదంటే దిక్కులేని వాళ్ళని చేర్చుకునే అనాథ శరణాలయమేదో ఒకటి దొరక్కపోదు"

మంచంమీద బాసింపట్టు వేసుక్కూర్చుని మాట్లాడుతున్న అర్జునరావు, ఈశ్వరి ముఖంలోకి చూడటంలేదు.

అందుకే ఏడుపు గొంతుతో, ఏమండీ, నన్ను "క్షమించరూ" అంటూ ఆమె తనఒడిలో తలదాచుకునే సరికి బిత్తరపోయి చూసాడు.

"ఎందుకెందుకు? ఏమయిందోయ్" అన్నాడు అదుర్దాగా, ఆమె జుట్టులో వేళ్ళు పోనిచ్చి నిముర్తూ.

"నేనెంత మూర్ఖురాల్నో తెలుసుకున్నాను....శైలజ మానతోనే ఉంటుంది. 'అమ్మా' అని పిలిచే దాని పిలుపునుంధి దూరం కాలేను....మీరింకేం చెప్పద్దు" అంటున్న భార్య తలని గుండెలకి అదుముకున్న అర్జునరావు కళ్ళకి సీటిపొర ఏదో అడ్డు పడినట్లయి, కళ్ళు మూసుకున్నాడు. ❊

## యండమూరి వీరేంద్రనాథ్

సీరియల్

# డబ్బు డబ్బు

(జరిగిన కథ)

(లక్ష్మి సాయంతో గాంధీ స్టాక్ ఎక్స్ఛేంజ్ బిజినెస్‌లో దిగిపోయాడు-బ్రోకర్ లాలా సాయంతో కొద్ది లాభాలు చూస్తూనే వున్నాడు-ఈలోగా 'షార్క్'లు మోసాల బంధాలు వేస్తూనే వున్నారు. ఈ గొడవల్లో లక్ష్మి వదిన టెంప్టింగ్ ప్రహసనం-ఉన్నట్టుండి వార్తల్లో మైకా నిధి స్థలాల ఆకర్షణ. గాంధీకంటె ముందు T. F. C. సంస్థ స్థలాన్ని కొనేయటం-తను సంపాదించిన డబ్బంతా ఆ కంపెనీ షేర్లకి పెట్టేశాడు గాంధీ. కంపెనీ డైరెక్టర్ పోటీకి నిలిచాడు-అప్పుడు బిగించి వచ్చు-కంపెనీ రహస్య హామీలు పుట్టినవని తేలాయి-బ్రిటిష్ పరిశోధన బృందం మైకా కాదుకదా మట్టికూడా పడదంది తవ్వితె. అంతే-షేర్ల పతనం! గాంధీ పతనం! ఇప్పుడిక ఐ. పి. బికారి గాంధీకి టెలిఫోన్‌లో మంతనం-"టిట్ ఫర్ టాట్" అని రాజా రామ్మోహనరావు ఫోన్ పెట్టేశాడు-మోస వలయంలో తలకిందలయిన గాంధీ పాత పూరిపాకకి పయనం కన్నీటితో!)

---

—ఇక చదవండి—

"పందెం అయిపోయిందా?" అంది లక్ష్మి.

"పందెం సంగతి సర్లే. మనం సర్వనాశనమైపోయాం" నవ్వుతూ అన్నాడు గాంధీ. ఆ నవ్వులో జీవంలేదు. ఆటలో ఓడిపోయిన వాడు ఎక్కడో వున్న గెలిచిన వాడికి అభినందనలు చెబ్తూ చుట్టూవున్న ప్రేక్షకుల కోసం నవ్విన నవ్వులావుంది.

"డబ్బు పోయింది సరే. బల్లలూ కుర్చీలూ, టైప్ రైటరూ అన్నీ అమ్మెయ్యాలా?"

ఇన్సాల్వెన్సీ ఆక్టు ప్రకారం కట్టుబట్టలూ-కొంత (చాలా తక్కువ) విలువ చేసే సామాన్లు మాత్రం మనకి దక్కుతాయి. సాధారణంగా అందుకే ఐ.పి పెట్టే ముందే బంధువుల పేరా, స్నేహితుల పేరా ఆస్థంతా దొంగతనంగా సరఫరా చేస్తారు" అన్నాడు గాంధీ.

"మనం కూడా అలాగే రాత్రికి రాత్రి కారూ అవీ అమ్మి డబ్బు చేసుకుందాం" అంది ప్రియంవద చప్పున. లక్ష్మి ఆమెవైపు సూటిగా చూసింది. ఈ సంభాషణలో ఆమె పాల్గొనటం లక్ష్మికి ఇష్టంలేదు. గోడకి చేతులు కట్టుకుని నిలబడి వున్నాడు హనుమంతరావు. జరుగుతున్న సంభాషణనంతా మౌనంగా వింటున్నాడు. మధ్యలో కల్పించుకోలేదు.

"....ఏం! నేను చెప్పిన ఆలోచన బావోలేదూ?" అంది ప్రియంవద.

"నాపందెం చట్టబద్ధంగా డబ్బు సంపాదించటం. నేనుగానీ రాత్రికి రాత్రి ఆస్థుల్ని ట్రాన్స్‌ఫర్ చేసేనంటే అది నేరం అవుతుంది" అన్నాడు గాంధీ.

"పూర్తిగా మట్టిగొట్టుకు పోతున్న టైమ్‌లో న్యాయాన్యాయాలేమిటి-పందెం ఏమిటి" అన్నాడు అప్పటివరకూ మౌనంగావున్న హనుమంతరావు.

గాంధీ నవ్వి "ఇందులో పందెం ప్రసక్తి ఏమీలేదు. ఇక నేను గెలుస్తానన్న

నమ్మకం కూడా నాకు లేదు. సంవత్సరం - సంవత్సరంన్నర టైమ్‌లో యాభై లక్షలు గెలవటం కలలో కూడా సాధ్యం కాదు. కాని నేను భవిష్యత్తులో కూడా చట్టరీత్యా ఏ నేరమూ చేయకుండా బ్రతుకుదామనే అనుకుంటున్నాను. దానికీ పందేనికీ సంబంధం లేదు" అన్నాడు.

"మేం వెళ్ళొస్తాం."

హనుమంతరావు ఉన్నట్టుండి అలా అనేసరికి లక్ష్మి గాంధీ విస్మయంగా అతడివైపు చూసేరు. అతడు అడుగు ముందుకువేసి, "అవును. ఏదో వెన్నెళ్ళకు చన్నీళ్ళు తోడుగా మీతో కలసి వుందామనుకున్నాం. కానీ ఇప్పుడు మీ పరిస్థితే ఇలా వుంటే ఇంకా మీకు మేం బరువు అవటం దేనికి ఎక్కడికైనా దూరప్రదేశానికి వెళ్ళి కలో గంజో తాగుతాం"....గాంధీ పరిస్థితి పట్ల చాలా విచారిస్తున్నట్లు మాట్లాడుతున్నాడు అతడు. కానీ అతడి కళ్ళలో లీలగా ఆనందం కనబడ్తూంది. కొద్దికొద్దిగా ఉబికివస్తున్న ఆ సంతోషాన్ని గమనించింది లక్ష్మి మాత్రమే. అయితే, అది తాము ఓడిపోవడంవల్ల వచ్చిన సాడిస్ట్ ఆనందం అని అనుకుందేకాని, అతడు రామ్మోహనరావు నియమింపగా వచ్చిన మనిషి అని గ్రహించలేకపోయింది. అందువల్ల అతడి ఆనందానికి పెద్దగా ప్రాముఖ్యత ఇవ్వకుండా గాంధీవైపు సాలోచనగా చూసింది.

గాంధీ అతడితో, "ఎక్కడికి వెళ్తారు మీరు?" అని అడిగాడు.

"మా పూర్వపు ఇంటికి...."

"నేనూ - నా పూర్వపు ఇంటికే-" అని లక్ష్మివైపు తిరిగి, "నువ్వు" అన్నాడు. లక్ష్మి అప్రతిభురాలైంది. ఆమె ఈ ప్రశ్న వూహించలేదు. అతడన్నది నిజమే. ఇంతకాలం ఆ పందెం వేడిలో సామాజిక కట్టుబాట్లని మరిచి అతడితో కలిసి వుంది. అతడు నిప్పులాటివాడు. అది వేరే సంగతి. సమాజం దాన్ని గుర్తించదు.

ఆమె ఏదో మాట్లాడబోయేటంతలో హనుమంతరావు, "మరి మేం వెళ్తాం" అని భార్యతో సహా కదిలేడు. ప్రియంవద గుమ్మంవరకూ వెళ్ళి వెనుదిరిగి, గాంధీ వైపు చూసి, ఒకసారి విషాదంగా-కానీ పలకరింపుగా నవ్వి, ముందుకు నడిచింది.

గాంధీ, లక్ష్మి ఇద్దరే మిగిలేరు. గాంధీ నెమ్మదిగా తలతిప్పి లక్ష్మివైపు చూసేడు. లక్ష్మి పేలవంగా నవ్వుతూ, "విధి ఇంత గ్రాండ్‌గా మనమీద పగ తీర్చుకుంటుందనుకోలేదు" అంది.

"ఏది ఏమైనా రామ్మోహనరావు తెలివి తేటలకి అభినందనలర్పించాలి. చాలా పకడ్బందీగా ప్లాన్ వేసాడు...."

"ఇంకా ఉత్పత్తి కూడా ప్రారంభంకాని కంపెనీ షేర్లు అంత హెచ్చుధరకి ఎలా కొన్నావ్ గాంధీ?"

"స్పెక్యులేషన్" అన్నాడు గాంధీ. కొంటే అలాటివే కొనాలి. అప్పటి వరకూ పెరిగినంత వేగంగా షేరుధర ఉత్పత్తి మొదలయ్యాక పెరగదు ..."

"కానీ నువ్వు తొందరపడ్డావని అనిపిస్తుంది."

"నష్టపోయాం కాబట్టి అలా అనిపిస్తుంది. నిజానికి చాలా జాగ్రత్తగా స్టడీ చేస్తూవచ్చాను. కేవలం నన్ను గమ్యంగా పెట్టుకొని ఆ కంపెనీ వ్యవహారాలు రామ్మోహనరావు నడపటం వల్ల ఇలా జరిగింది కానీ,.లేకపోతే రాత్రికి రాత్రి షేరు ధర పడిపోదు. అంతేకాదు-నేను స్థలం కొనటానికి వెళ్ళిన ముందురోజే దాని అమ్మకం జరగటం, మైకానంగతి పేపర్లో పడినరోజే డైరెక్టర్ పదవి ఖాళీ అవటం-రైలుమార్గం పడుతుందన్న వార్త వచ్చినరోజే బొంబే నుంచి మార్వాడీ రావటం-ఇవన్నీ చూస్తూంటే నామీద దాదాపు పదిమందిదాకా వేగులవాళ్ళని పెట్టి అనుక్షణం నేను ఏం చేస్తున్నానో గమనిస్తూవచ్చాడన్నమాట. అంత జాగ్రత్తగా ప్లాన్ వేసేడు కాబట్టే 'టిట్ ఫర్ టాట్' అనగలిగేడు. ఇక్కడ ఈ వ్యవహారం అంతా అనుకున్నది అనుకున్నట్టు జరుగుతూవుంటే అక్కడ అతడ తన ఎయిర్ కండిషన్డ్ రూమ్‌లో కూర్చొని, నేను ఆమెచ్యూరిష్‌గా ప్రవర్తించే విధానాన్ని గమనిస్తూ అనుక్షణమూ తనలో తను నవ్వుకుంటూ వుండి వుంటాడు. నిజంగా హాట్సాఫ్ టు హిమ్."

"మరిక మనం ఇప్పుడేం చెయ్యాలి?"

"దార్లు వెతుక్కోవటమే. అయిదు సంవత్సరాల గడువు పూర్తవ్వక ముందే మనం ఓడిపోయిన సంగతి రామ్మోహనరావుకి తెలియక్కర్లేదు. వందెంరోజు నేను వెళ్ళకపోతేచాలు. ఓడిపోయినట్టేలెఖ్ఖ. వీటన్నిటికన్నా ముఖ్యంగా నేను నిన్ను కోరుకుందామనుకున్న సంగతి ఇంకొకటివుంది."

"ఏమిటి"

"క్షమాపణలు"

"ఎందుకు" అందామె విస్మయంతో.

"ఇంత కాలం ఒక గమ్యం లేకుండా నిన్ను నాతో తిప్పినందుకు...."

లక్ష్మి నవ్వి, "ఇందులో నేను కోల్పోయిందేమీలేదు. నెలనెలా నాకు జీతం ఇస్తూనే వచ్చావ్‌గా" అంది.

"నా పూర్వపు ఇంటికి నేను వెళ్ళిపోతానని మీ అన్నయ్యతో అన్నప్పుడు, "మరి నువ్వో" అన్నాను నీతో. నిజానికి ఆ పూర్వపు పాక నీదే. నేనే ఇంకో చోటు చూచుకోవాలి. దానిక్కూడా సారీ"

"మరీ మనం పాకలో బ్రతికేటంత హీనస్థితిలో లేమని నా వుద్దేశ్యం" అంది లక్ష్మి.

"ఎలా?"

"ఇంజనీర్లతో మన పరిచయం-సొసైటీలో తిరగటం ఇవన్నీ మనకి ఆమాత్రం ఉద్యోగం సంపాదించి పెట్టలేవా?" అంది.

"ఎలా సంపాదిసాయి!" అర్థం కాక అడిగాడు.

"మన క్వాలిఫికేషన్ గురించీ, తెలివి తేటలు గురించీ తెలుసు కాబట్టి, ఏదైనా

చిన్న వుద్యోగం చూపించమని ఉదాహరణకి నేను సంపత్‌కుమార్‌ని అడిగాననుకో... అతడామాత్రం....

"లక్ష్మీ-" అని అరిచాడు గాంధీ. అంత బిగ్గరగా అరిచినందుకు తన ఆవేశానికి తనే సిగ్గుపడతూ, అయినా తన భావాల్ని నొక్కిపట్టే ప్రయత్నం ఏదీ చెయ్యకుండానే "నువ్వు సంపత్‌కుమార్ దగ్గరికి వెళ్ళటం నాకిష్టంలేదు. ఈ ః నికే కాదు. దేనికీ...." అన్నా డు.

"ఎందుకు" అంది అర్థంకాక.

"అతడు నిర్లిప్తంగా ''నాకిష్టంలేదు అంతే'' అన్నాడు.

"అదే ఎందుకు అని అడుగుతున్నాను" రెట్టించింది.

"ప్రతీదీ నీకు నేను చెప్పాలా?'' అన్నాడు విసుగ్గా. ఆ విసుగు చూసి ఆమెకి కూడా కోపం వచ్చింది. కానీ తాపీగా ''నన్ను నీ పెర్సనల్ సెక్రటరీగా వుంచుకుంటున్నావా-'' అని అడిగింది. ఉన్నట్టుండి ఆమె అలా అడిగేసరికి అతడు తెల్లబోయి, "ఇంకాఏమిటి-నాదగ్గిర ఉద్యోగం? ప్రతీదీ నీకు చెప్పాలా" అన్నాడు విసుగ్గా.

అతడి విసుగు చూసి ఆమెకు కోపం వచ్చింది. "అక్కర్లేదు'' అంది. "ఉదాహరణకి నీకు ఉద్యోగం చేసే కోర్కె లేదనుకో. అది నాకు చెప్పక్కర్లేదు. 'నన్ను' సంపత్‌కుమార్ దగ్గిరకి వెళ్ళొద్దంటే మాత్రం ఎందుకు వద్దంటున్నావో చెప్పవలసి వుంటుంది."

అతడు మరింత మండిపడి-''అంటే నా మాటకంటే నీకు సంపత్‌కుమారే ఎక్కువా" అని అడిగాడు.

ఆమెకూడా అంత ఆవేశంగానే-''ఇందులో ఎక్కువ తక్కువల ప్రసక్తి ఏముంది? నాకు సంబంధించిన విషయాల్లో నువ్వు జోక్యం కల్గించుకున్నప్పుడు దానికి కారణం ఏమిటో చెప్పవలసిన అవసరం నీమీదుంది" అంది. జోక్యం అన్న మాట అతడిని బాధపెట్టింది. ఇంతకాలం కలిసివుండి ఇప్పుడు తను సర్వనాశనమైపోయాడు అని తెలియగానే తనని విడిచిపోతూంది. జోక్యాలగురించి కూడా మాటాడుతూంది. మనిషికి మనిషి ఎంత తొందర్లో దూరం అయిపోతాడు! ఈ ఆలోచనే అతడ్ని కదిలించివేస్తూంది.

లక్ష్మి ఆలోచనే వేరు. ఇతడెందుకు తన మనసులో భావాలు స్ఫుటంగా చెప్పడు? ఎందుకు వెళ్ళవద్దంటున్నాడు?? అతడికి ఇంత సాయం చేస్తూ వచ్చిందే.... ఎందుకు చెప్పడు మరి? ఎందుకు తనని వేరుగా చూస్తాడు? అందుకే అతడిచేత కారణం చెప్పించాలని పట్టుదలతో ప్రయత్నం చేస్తూంది. అలా ఆమె ప్రయత్నించే కొద్దీ అతడి అహం దెబ్బతింటూంది.

"కారణం చెప్పను. నువ్వుమాత్రం నేను చెప్పినట్టు చెయ్యాలంతే" అన్నాడు ఫర్మ్‌గా.

"నువ్వు చెప్పినట్టు నేను చెయ్యాలని రూలేం వుంది" అంది. అన్నతరువాత

అతడి మొహాన్ని చూసి అలా ఎందుకన్నానా అని బాధపడింది-ఆమె మాటలకి అతడు నిశ్చేష్టుడయ్యాడు.

"అంటే మనిద్దరిమధ్యా డబ్బు తప్ప ఇంకేం సంబంధమూ లేదన్నమాట" అన్నాడు గొంతులో కొద్దిగా జీర ధ్వనిస్తూ వుండగా.

"ఈ ప్రపంచంలో డబ్బుతప్ప ఇంకేం లేదన్న థియరీ నాదికాదు గాంధీ నీది" అందామె. సరిగ్గా తనకి కావల్సినచోట అతను దొరికాడు. ఆమె వుద్దేశ్యం-"ఇప్పటికి అర్థమయిందా గాంధీ నీకు ఈ ప్రపంచంలో డబ్బు కాక ఇంకా చాలా వున్నాయని" అని. కానీ అతను దాన్ని వేరేలా అర్థం చేసుకున్నాడు. ఆ మాటలకి ఎవరో కొట్టినట్టు అతడి మొహం వాడిపోయింది. "నువ్వు....నువ్వేం మాట్లాడుతున్నావో నీకు అర్థం అవుతూందా" అని అడిగాడు కోపంగా.

"అవుతూంది" అందామె మామూలుగా. "కానీ నీగురించే నీకు అర్థంకావటం లేదు. ఇన్నాళ్ళ పరిచయంలోనూ నీలో విసుగు ఎప్పుడూ కనిపించలేదు. ఈరోజు మొట్టమొదటిసారి చూసేను. పరిస్థితులు కొద్దిగా తలక్రిందులవగానే విసుక్కోవటం మంచిలక్షణంకాదు. డబ్బు నీమీద ఎంత ప్రభావాన్ని చూపిస్తూందో ఆలోచించు"

అతడు అందామనుకున్నాడు-నా యీ విసుగు పరిస్థితులు తలక్రిందులవటం వల్ల వచ్చిందికాదు-నువ్వు సంపత్కుమార్ గురించి మాట్లాడటంవల్ల వచ్చింది-అని. కానీ ఈ లోపులోనే ఆమె బైటకి నడిచింది.

అతడొక్కడే మిగిలేడు ఆగదిలో.

తోడుగా నిశ్శబ్దం మిగిలింది.

చాలాసేపు అతడు కదల్లేదు. అలాగే ఆ టేబిల్ పక్కనే నిలబడ్డాడు. లక్ష్మి చాలా సున్నితమైనచోట దెబ్బకొట్టింది. సంపత్ కుమార్‌ని ఆమె ఉద్యోగం అడగటం అతనికి ఇష్టంలేదు. చట్టరీత్యా మోసం చెయ్యకపోయినా, ఒకరకంగా ఆ సంస్థని మోసపుచ్చినట్టేలెక్క. అటువంటి మనిషి దగ్గరికివెళ్ళి ఉద్యోగం అడగటం. అతడు పునరాలోచించాడు. నిజంగా అందుకేనా తను ఆమెని వెళ్ళొద్దని కోరుకుంటున్నది! కాదు అని అంతరాత్మ చెబుతూంది. అంతకన్నా ఎక్కువ ఆలోచించడానికి సంస్కారం అడ్డు వస్తూంది.

అతడి చేతివేళ్ళు టైప్ మిషన్‌ని కొడ్తున్నాయి. ఆలోచన్లు మాత్రం ఎక్కడో పరిభ్రమిస్తున్నాయి. లక్ష్మి చెబ్తున్నట్టు కొద్దిగా పరిస్థితులు తారుమారు కాగానే తను బ్యాలెన్స్ తప్పి మాట్లాడేడు. అందుకే కాబోలు కోటీశ్వరులకి లక్షాధికారులకి వ్యాపారంలో నష్టం వచ్చినప్పుడూ, ఇన్‌కంటాక్సు రైడింగ్ జరిగినప్పుడూ హార్ట్ ఎటాక్, మూర్ఛపోవటం లాటివి జరుగుతూ వుంటాయి! ఇంత చిన్న విషయానికే తను ఇలా తలక్రిందులయిపోతున్నాడే....మరి అంత కష్టపడి డబ్బు సంపాదించిన వాళ్ళకి హార్ట్‌అటాక్‌లు రావటంలో ఆశ్చర్యం ఏముంది. బైటనుంచి చూసేవాళ్ళు కథల్లో ఈ సంఘటనలని చదివినవాళ్ళు భలే జరిగింది,

డబ్బున్నవాడికి అలా జరగాల్సిందే" అనుకుంటారు. కానీ అతడు ఆ డబ్బు సంపాదించటానికి ఎంత కష్టపడ్డాడో-ఎన్ని నిద్రలేని రాత్రులు పథకాలు వేస్తూ గడిపేడో ఆలోచించరు. డబ్బు సంపాదన అనగానే అది బ్లాక్ మార్కెట్‌లో సంపాదించిందనో-లేకపోతే కాంట్రాక్టుల్లో మోసం చేసిందనో ఒక చెడు అభిప్రాయం అందరికీ వుంది. డబ్బు సంపాదించేవాడు ఎయిర్ కండిషన్ రూమ్‌లో కూర్చొని విస్కీ తాగుతూ కేవలం ఫోన్ కాల్స్‌మీద డబ్బు సంపాదిస్తాడనే దురభిప్రాయం కూడా చాలా మందికి వుంది. వ్యాపారం ద్వారా డబ్బు సంపాదించేవాడు గానీ, మల్టీనేషనల్ కంపెనీల హైపైరేటరైనా గానీ అలా కూర్చొని డబ్బు సంపాదించడు. అనుక్షణం ఆలోచిస్తూనే వుంటాడు. చివరికి పార్టీ ఇచ్చినా, ఆ పార్టీ ఏదో ఒక కారణం కోసం ఉద్దేశింపబడినదే అయివుంటుంది. అక్కడ కూడా అతడు ఆ విషయాలని గూర్చే చర్చిస్తాడు. అనుక్షణం ఇలా విరామం లేకుండా పనిచేయటంతో డబ్బు అంటే ఒకరకమైన ఆప్యాయత, ఇష్టం ఏర్పడుతుంది. ఇంత కష్టపడి సంపాదించిన డబ్బుని ఎవరో అనామకులైన ప్రజల నుద్ధరించటం కోసం "టాక్సు'' ల రూపంలో కట్టటం ఇష్టం వుండదు. నాడబ్బు ప్రభుత్వానికి ఎందుకివ్వాలి అన్న ప్రశ్న ఉదయిస్తుంది. ఆత్మవంచన నెమ్మదిగా వంచనగా మారుతుంది. టాక్స్‌ప్లానింగ్ కొద్దికొద్దిగా టాక్స్ ఎవేషన్ అవుతుంది-తను చేస్తున్నది అన్యాయం అన్న స్ఫురణే రాదు-నా డబ్బు నేను దాచుకుంటున్నాను అన్న భావనే వుంటుంది. అందుకే రైడింగ్ జరగ్గానే హార్ట్ ఎటాక్ వస్తుంది.

ఇది తప్పా కాదా అన్నది కాదు ఇక్కడ చర్చ! డబ్బువట్ల ఆప్యాయత-డబ్బు సంపాదించటం అన్న వ్యసనం ఎలా అలవడ్తుంది అన్న పరిణామ సిద్ధాంతం గురించిన వివరణ. డబ్బున్న వాడి కొడుకులు, భార్య, బావమరదులు దాన్ని అనుభవిస్తే అనుభవిస్తూ వుండవచ్చుగాక. కానీ సంపాదించేవాడికి ఆనందం వుండదు. యూనియన్ లీడర్నుంచీ ఇన్‌కంటాక్స్ ఆఫీసులో నోటీసు సర్వర్ వరకూ అందరూ భయోత్పాదకులే. రణరంగంలో శత్రుసైనికుల్ని చంపుతూ ముందుకు పోతుంటే కలిగే ఆనందంలాటిది, వ్యాపార రంగంలో ప్రత్యర్థుల్ని దెబ్బ కొడ్తున్నప్పుడు కలుగుతుంది.

మరి ఓడిపోతే?

గాంధీ వేళ్ళు టైప్ మిషన్‌మీద ఆగినయ్. అప్పటికే గదిలో చీకట్లు బాగా అలుముకున్నాయ్. లైటువేసేడు. అతడి దృష్టి టైప్ మిషన్‌లో వున్న కాగితంమీద పడింది. అనాలోచితంగా టైప్ చేసిన కాగితంవైపు చూసుకున్నాడు. నవ్వొచ్చింది అందులో ఇలావుంది.

ఐ యామె ఫూల్

ఐ యామె నిడియెట్

ఐ యామె స్టుపిడ్

మోర్ బ్యాలెన్సింగ్ రిక్వైర్డ్
మోర్ బ్యాలెన్స్
బాలెన్స్
బాలెన్స్
లెన్స్
యస్

అతడు కాగితం నలిపి చెత్త బుట్టలో పారేస్తూ వుండగా గుమ్మం దగ్గిర చప్పుడయింది. తలెత్తిచూసేడు.

ప్రియంవద.

"ఆయన ఇల్లు చూడటానికి వెళ్ళారు. తరువాత సామాన్లు తీసుకెళ్దామన్నారు"

అతడు మాట్లాడలేదు. ఆమెవచ్చి పక్క కుర్చీలో కూర్చొని 'అలావున్నావేం' అని అడిగింది. దీనికి కూడా అతడు మాట్లాడలేదు.

"డబ్బన్నాక వస్తూవుంటుంది పోతూవుంటుంది దానికింత ఆలోచన దేనికి?"

"నేను దానిగురించి ఆలోచించటంలేదు" అన్నాడు.

"మరి దేనిగురించి?"

'మనిషి గురించి అందామనుకున్నాడు. అనలేదు. అన్నా అర్థంకాదు. అతడి నిశ్శబ్దాన్ని ఆమె మరోలా అర్థంచేసుకొని అతడి చేతమీద చెయ్యి వేసింది. అతడు చేతిని వెనక్కి తీసుకోలేదు. అదో రకమైన నిరాసక్తత. అతడి చేతనిరాస్తూ- "నేను ఓ విషయం చెప్పనా" అంది.

"ఏమిటి" మామూలుగా అడిగాడు.

"నీ మీద జరిగిన కుట్రలో భాగస్వాముల గురించి"

అతడు గిరుక్కున ఆమె వైపు తిరిగి, "ఏమిటి నువ్వు అంటున్నది?" అన్నాడు. ఆమె నవ్వి "నాకొక్కన్ని విషయాలు తెలుసు. నీకు ఉపయోగపడేవి" అంది

"నాకు ఉపయోగపడేవా? ఏంటవి?" ఆతృతగా అడిగాడు. అతడి ఆతృతని గమనించి ఆమె పెదవులు బిగించి నవ్వి లేచి నిలబడింది. అందాన్నంతా పోగు చేసుకున్న ఆమె నడుము మెలికమీద నిలచిన దృష్టిని క్షణం పాటైనా అక్కడ ఆపు చెయ్యకుండా ఆతృతగా "ఏమిటి చెప్పనా-ప్లీజ్" అన్నాడు.

"బిజినెస్" అంది ఆమె అదే చిలిపితనంతో. "మీమధ్య తిరిగి నాకూ వ్యాపారం అలవాటయింది. ప్రతీదీ బిజినెస్సే, చెప్పు! నాకేం ఇస్తావ్?" అంటూ నవ్వి, గాంధీ మొహంలో సీరియస్‌నెస్ చూసి, నవ్వుఆపి, "ఏం నేను అన్నదాంట్లో తప్పేం వుంది? మీరంతా ప్రతీ పనినీ బిజినెస్‌తోనే జతపరుస్తారుగా!" అంటూ అతడి చేతిని తన చేతిలోకి తీసుకుని "గాంధీ నాకు పెద్దపెద్ద మాటలు తెలియవు. నవ్వంటే నాకిష్టం. అంతే. ఒక్కసారి... ఒక్కసారి... ప్లీజ్" అంది.

"ఏమిటొక్కసారి?" అన్నాడు అతను అయోమయంగా.

ఫక్కున నవ్వబోయింది గానీ గాంధీకి మరింత కోపం వస్తుందని భయపడి, "నువ్వీ పట్నంలో ఎలా ఇరుక్కున్నావో తెలుసుకోవాలంటే నన్ను మంచి చేసుకోవాలి. ఆడదాన్ని మంచి ఎలా చేసుకోవాలో లక్ష్మి అంటూ వుంటుందే ఏమిటామాట- ఆ-కంప్యూటర్ బ్రెయిన్-కంప్యూటర్ బ్రెయిన్‌కి తెలియదని నేను అనుకోను. మనం తిరిగి కలుసుకోక పోవచ్చు. కలుసుకున్నా మాట్లాడుకోనక్కర్లేదు కూడా. ఆ షరతుకి నేను ఒప్పుకొంటాను. కానీ ఒక్కసారి...." అంటూ లోపలి గదిలోకి వెళ్ళబోతూ గుమ్మందగ్గిర ఆగి, "లోపల అయిదునిమిషాలు నీ కోసం ఎదురు చూస్తాను. ఈ లోపులో కాగితంమీద అసలు జరిగిందేమిటో కూడా వ్రాస్తాను. అది తెలుసుకోక పోతే నీకు చాలా నష్టం. నువ్వీలోపులో వస్తే సరేసరి. లేక పోతే ఆ కాగితాన్ని నాతో పాటే శాశ్వతంగా తీసుకుపోతాను. సరేనా" అని లోపలికి నడిచింది. లోపల టేబిల్ డ్రాయరు లాగిన ధ్వని. ప్రియంవద కాగితం మీద వ్రాస్తూంది. గాంధీ బయట గది మధ్యలో నిలబడి ఆలోచిస్తున్నాడు.

ఏం వ్రాస్తూంది ఆకాగితంలో?

అది తనకే విధంగా వుపయోగపడ్తుంది?

తెలుసుకోవాలంటే లోపలికి వెళ్ళాలి.

లోపలికి వెళ్ళటం అంటే దేనికి వప్పుకోవటమో తెలుసు. వెళ్ళాలా....వద్దా? అన్న ఆలోచన ఒకవైపు-మరోవైపు ఇప్పుడిక అంతా అయిపోయాక తెలుసుకొని లాభం ఏంటి అన్న మీమాంస.

—ఇక్కడ గాంధీ ఇలా పరస్పర విరుద్ధ భావాల్తో కొట్టు మిట్టు లాడుతూ వుండగా అక్కడ సంపత్ కుమార్ ఇంటి డ్రాయింగ్ రూమ్‌లో కూర్చొన్న లక్ష్మి మరో రకమైన ఆలోచనతోవుంది. అతడింకో పదినిముషాలల్లో ఆఫీసునుంచి వస్తున్నాడన్న కబురు వచ్చింది. ఆమెకి మాటి మాటికి గాంధీ మాటలే గుర్తొస్తున్నాయి.... "నువ్వు ఉద్యోగం కోసం సంపత్ కుమార్ దగ్గిరకి వెళ్ళటం నాకిష్టంలేదు...." అని అతడన్న దానికి జవాబుగా నేను చాలా తొందరపడి మాట్లాడేను అనుకొంది ఆమె. "నీ పెర్సనల్ సెక్రటరీనికాదు కాబట్టి నన్ను శాసించే హక్కు నీకులేదు—" అని ఎంత దారుణంగా అనేసింది తను! అప్పుడు గాంధీ మొహం ఎలా మారిందో గుర్తొచ్చి నవ్వొచ్చింది. ఇక అక్కడ ఉండబుద్ధికాలేదు.

పది నిముషాల తర్వాత ఆఫీసునుంచి వచ్చిన సంపత్ కుమార్‌కి డ్రాయింగ్ రూమ్ ఖాళీగా కనబడింది.

గాంధీ గుమ్మం దగ్గిర నిలబడి "ఏమిటి వ్రాస్తున్నావ్" అనిఅడిగాడు. వ్రాయటం పూర్తిచేసి ఆకాగితాన్ని మడుస్తూ "అంత సులభంగా చెప్పను." అంది ప్రియంవద. "లక్ష్మి ఎక్కడికి వెళ్ళింది!"

లక్ష్మి ప్రసక్తి వచ్చే సరికి అతడి మొహం కఠినంగా మారింది, "ఉద్యోగం వెతుక్కోవటానికి" అన్నాడు కసిగా. ఆమె పెన్‌కాప్ పెడ్తూంటే, "ఏదీ ఆ

కౌగిలం ఇలా ఇవ్వు " అన్నాడు చేయిసాచి. అతడు అడుగు ముందుకు వేయగానే ఆమె అతడి పక్కనుంచి వెనగ్గా వెళ్ళి తలుపు గడియవేసింది. ఊహ తెలిసిన అమ్మాయి ఒంటరిగా అబ్బాయితో వున్నప్పుడు అతడికంటే ఎన్నిరెట్లు ఫాస్ట్‌గా పనిచేస్తుందో గాంధీకి తెలీదు. ఆమె అతడి వెనుకనుంచి మెడచుట్టూ చేతులువేసి, "నీ కోసం ఎంతగా ఎదురు చూసేనో తెలుసా?" అంది.

అతడు మాట్లాడలేదు. ఆమె అతడి భుజాలమీదికి చేతులు జార్చి ఎంతో అనుభవంతో నేర్చుకున్న కళ ప్రదర్శించి-తను కదలకుండానే అతడిని తనవైపుకు తిప్పుకొంది. ఆమె వెచ్చటి వూపిరి అతడి మెడకు సోకుతూంది, అతడు మాత్రం ఘనీభవించిన మంచు ముద్దలాగే వున్నాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నావ్"

"షేరు ధర అలా విపరీతంగా పెరిగిపోతున్నప్పుడు కూడా ఇదంతా స్టాక్ ఎక్స్చేంజి మోసం అన్న అనుమానం నాకెందుకు రాలేదు?" ఆలోచిస్తూ-ఆమె అతడి నుంచి చప్పన చేతులు తీసేసి అడుగు వెనక్కి వేసి, ఇదంతా తనని అవమానం చేయటానికి అతనాడుతున్న నాటకమేమోనని అతని మొహంలోకి పరీక్షగా చూసి, ఇటువంటిదేమీ లేదనీ, ఆతడు సిన్సియర్‌గానే వేరే ఆలోచనలో వున్నాడనీ గ్రహించి విస్తుపోయింది. ఇది అతడికి మొదటి అనుభవం అని ఆమెకి తెలుసు. ఆ మొదటి స్పర్శలో కూడా అతడు చలించకుండా "ఇంకా దేని" గురించో ఆలోచిస్తూ వున్నాడంటే....ఋషులు అడవుల్లోనే వుండరు, ఏకైక లక్ష్య సాధనలో మిగతావన్నీ మరిచే మనుష్యుల్లో కూడా వుంటారు-అన్న విషయం తెలిసింది. అతడికిష్టం లేకపోతే తోసెయ్యవచ్చు-తనని హేళన చెయ్యవచ్చు, అగౌరవపర్చవచ్చు, చెప్పవచ్చు లేదా ఇష్టముంటే కొద్దిసేపు బెట్టుచేయవచ్చు. కానీ ఇదేమిటి?

"నన్ను క్షమించు" అన్నాడు గాంధీ ఆమె ఆలోచనని తెంచుతూ. ఆమె అర్థం కానట్టు చూసింది. అతనన్నాడు. "నేను ఋష్యశృంగుడ్ని కాను. ఏకపత్నీ వ్రతుడిగా వుండాలన్న నియమం కూడా ఏదీలేదు కానీ ఏ పని చేసినా పరిపూర్ణంగా చెయ్యాలని నా వుద్దేశ్యం. ఏమాత్రం మూడ్ లేకుండా మనం కలుసుకునే ఈ కలయిక కనీసం నీకైనా సంతృప్తినిస్తుందని నేననుకోను. నామనసికక్కడలేదు. నన్ను క్షమించు...."

ఆమె అతడి మొహంలోకి సాలోచనగా చూసి, జాకెట్టులో దాచుకొన్న కాగితాన్ని తీసి అతడి చేతిలో పెడ్తూ "మళ్ళీ మనం కలుసుకోకపోవచ్చు, వెళ్ళొస్తాను గాంధీ" అంటూ తలుపు తీసి హాలు గుండా బైట నీకట్లో కలిసి పోయింది. ఆమె మనసులో ఏముందో. ఆమె ఏమనుకుందో, అతడికి తెలీదు.

కాగితాన్ని పట్టుకొని, ఆమె వెళ్ళినవైపే చూస్తూ గదిలోంచి బైటకొచ్చిన గాంధీ, బైట హాలులో చేతులు మూడుచుకొని బైప్ మిషన్ పక్కనే కుర్చీలో శిలా ప్రతిమలా కూర్చొని తమగదివైపే నిర్లిప్తంగా చూస్తూన్న స్త్రీమూర్తిని చూసి

స్థాణువయ్యాడు.

ఆమె లక్ష్మి.

చాలా సేపు వాళ్ళిద్దరూ అచేతనంగా అలానే వుండి పోయారు. గదిలో చీకటి అలాగేవుంది. ముందు కదిలింది గాంధీయే. "....ఏమైంది వుద్యోగం?" అని అడిగాడు. లక్ష్మి మాట్లాడలేదు. పరిస్థితిని కొంచం మామూలుగా మార్చటానికి ప్రయత్నిస్తూ "నీ ఒక్కదానికే ఇస్తానన్నాడా-నాకూ ఇస్తానన్నాడా" అన్నాడునవ్వి. ఆమెదానికి జవాబు చెప్పలేదు. అతడికి కొద్దిగా కోపం వచ్చింది. ఆమెతననో నేరస్తుడిలా చూడటం నచ్చలేదు. అయినా తన స్వవిషయాల్లో ఇతరులు జోక్యం కల్పించు కోవటంకూడా అతడికి పట్టించుకోకుండా "ఏం జరుగుతూంది లోపల?" అని అడిగింది. అతడు దెబ్బతని, "ఏం జరుగుతేనీకేం?" అన్నాడు.

"నా ప్రశ్నకి సమాధానం అదికాదు."

"అయితే విను-చాలా జరిగింది—"

"ఏంటి?"

"నీకూ సంపత్ కుమార్‌కీ మధ్య ఉద్యోగం కోసం ఏం జరిగిందో అదే"

ఆమె చెయ్యి ఎంత విసురుగా వచ్చిందంటే-అదిగానీ తాకివుంటే అతడి చెంప పగిలిపోయివుండేది. ఆమెచేతిని అలాగే పట్టుకొని నిలబడ్డాడు అతడు. ఆవేశంతో రొప్పుతూంది ఆమె. అతడుగానీ చెయ్యి వదిలేస్తే మొహంఅంతా గోళ్ళతో రక్కేసే నివంగిలావుంది. అతడికూడా తాను అవసరమైన దానికంటే దారుణంగా మాట్లాడాననిపించింది. అతడూ మామూలు మనిషే. కానీ విసుగు, కోపం, ద్వేషం లాటివి అతడిని ఎక్కువ కాలం ఆశ్రయించి వుండలేదు. తప్పుని గ్రహించి, వెంటనే సరిదిద్దుకోగలిగేశక్తి వుంది. అందుకే ఆ చెయ్యి అలా పట్టుకొనే "నేను నిర్ద్వంద్వ సంధి ప్రతిపాదిస్తే ఒప్పుకుంటావా" అని అడిగాడు. ఆమె మాట్లాడలేదు కానీ ఆవేశం తగ్గినట్టు అనిపించింది.

"....అన్ కండిషనల్‌గా" అన్నాడు. ఆమె చెయ్యి దించింది. ఇకతన మొహానికి ఏం పర్వాలేదని నమ్మకం కుదిరాక, అతడామెచెయ్యి వదలిపెడ్తూ, "అసలు దీని కంతటకీ కారణం నీరిపోర్టే" అంటూ డ్రాయరు సొరుగులోంచి ఒక కాగితాల కట్టతీసి, పెన్‌తో ఒక వాక్యం అండర్‌లైన్ చేసి ఆమె ముందుకు తోసేడు. ఆ కాగితాల్లో తన స్వదస్తూరీ చూసి, ఆమె విస్మయంతో చదవటం ప్రారంభించింది. సంపత్ కుమార్ మీద రిపోర్టు అది తను వ్రాసిందే.

"—అతడికి స్త్రీ లోలుడన్న ప్రచారం ఒకటుంది. మంచిఎత్తు, అందం, పదవి ఇచ్చే దర్జా వీటన్నిటివల్లా వచ్చే ఛరిస్మాని అమ్మాయిల మీద ఉపయోగించా రనే బలహీనమైన మనస్తత్వం అతడిది. అతడికి, స్త్రీ బలహీనతలేదనీ-స్త్రీయే అతడిపట్ల బలహీన మవుతుందనీ చెప్పటం కోసం ఈ పాయింటు నొక్కిచెప్పట మైనది. పైకి చాలాతేలిగ్గా, ఈజిలీ అప్రోచ్‌బుల్‌గా కనిపించినా పరిధిదాటి ఏవనీ

చెయ్యడు."

ఆపేరా చదివుతూ ఆమె మొహంలోనవ్వు కదలాడటం చూసి అతడు తేల్గిగా ఊపిరి పీల్చాడు ఆమె తలెత్తి "స్త్రీలపట్ల సీకింత తేలికైన అభిప్రాయం వున్నందుకు విచారిస్తున్నాను" అంది

"నేనూ అంతే" అన్నాడు.

"ఏమిటి" అంతామె ఆశ్చర్యంగా

"మొగవాళ్ళపట్ల సీకింత తేలికైన అభిప్రాయం వున్నందుకు నేనూ విచరిస్తున్నాను "

ఆమె తిరిగి పోరాటానికి ఉద్యుక్తమవుతూ వుండగా గుమ్మందగ్గిర అలికిడి అయింది

లాలా లోపలికి వస్తున్నాడ

అతడిని చూడగానే గాంధీ మొహం వాడిపోయింది ఇప్పటివరకూ తాత్కాలికంగా అతడు ఆ డబ్బు సంగతి మర్చిపోయాడు. లాలా రాకతో తన పొజిషన్ తిరిగి జ్ఞాపకం వచ్చింది "రండి లాలాజీ" అని ఆహ్వానించాడు

"ఈమధ్య రెండ్రోజులుగా వూళ్లోలేను" అన్నాడు లాలా "మీకుతెలిసే వుంటుంది టి.ఎఫ్ టి కంపెనీ దివాళా తీసిన సంగతి"

"తెలుసు" అన్నాడు గాంధీ "—ఎంతోస్తుంది షేరుకి"

"ఏమీ రాకపోవచ్చు అప్పులు తీర్చడానికి బొటా బొటిగా సరిపోవచ్చు దాని ఆస్తులు—"

"దారుణమైన మోసం."

"అవును దారుణమైన మోసం దీనివల్ల ఎవరు బాగుపడ్డారో కూడా అర్థం కావటం లేదు. పోని ప్రజల్ని మోసం చేయటానికి విపరీతంగా షేర్లు అమ్మారా అంటే అదీలేదు " అన్నాడు లాలా

"అలా అమ్మివుంటే కేసు పెట్టటానికైనా వీలు వుండేదేమో"

లాలా దానికి సమాధానం చెప్పలేదు చేతిలో ఫైలు బల్లమీద పెడ్తూ "ఇప్పుడు మనం చేద్దాం" అన్నాడు.

లాలాకి అర్థంకాక " అంటే" అన్నాడు

"అంటే ఏముంది లాలాజీ-షేర్లలో వ్యాపారం చెయ్యటానికి నా దగ్గిర పెట్టుబడి లేదు. ఇంకో రకంగా చెప్పాలంటే మీకు ఇక ఏవిధమైన బిజినెస్సూ ఇవ్వలేను"

"అలా అనకండి మీలాటి తెలివైనవాళ్ళు ఈ రంగంనుంచి తప్పుకుంటే ఎలా?"

"తప్పుకోవాలని నాకు లేదు కాని తప్పదుకదా"

"కనీసం ఒక లక్ష అన్నా ఇందులో వుంచండి, నేను రికమెండ్ చేసిన షేర్లు మిమ్మల్ని ఎన్నడూ మోసం చెయ్యవు"




"మీమీద నాకు ఆ నమ్మకం వుంది. కానీ నేను ఇప్పుడు లక్ష కాదు కదా- ఒక్క రూపాయి కూడా పెట్టుబడి పెట్టే స్థితిలో లేను"

"ఇంకొక్కసారి ఆలోచించండి."

"క్షమించండి లాలాజీ. నా పరిస్థితి మీకు తెలియనిది ఏముంది"

లాలా లేస్తూ "మరి ఆ డబ్బు అంతా ఏంచెయ్యను?" అని అడిగాడు.

"ఏం డబ్బు"

"టి.ఎఫ్.టి. షేర్లు అమ్మెయ్యగా వచ్చిన డబ్బు"

గాంధీ ఒక్కసారిగా కుర్చీలోంచి లేచి నిలబడి ఎగ్జయిట్‌మెంట్‌తో టి.ఎఫ్.టీ. షేర్లు అమ్మెయటం ఏమిటి?" అని అడిగాడు.

లక్ష్మి ఇద్దరివైపూ అర్థం కానట్టు చూస్తూంది.

"మూడు రోజుల క్రితం మీరు వుత్తరం పంపించారుకదా-వున్న షేర్లన్నీ అమ్మెయ్యమని" అన్నాడు లాలా ఫైలు విప్పుతూ.

"వ్వాట్" అని గాంధీ గొంతు జీర బోయేలా అరిచాడు. ఉద్వేగంతో వణుకుతూన్న వేళ్ళని అదుపులో పెట్టుకోవటంకోసం కుర్చీ కోడు పట్టుకొన్నాడు.

"అదేమిటి సాబ్ మీవుత్తరం—" అంటూ లాలా ఫైల్లోంచి కాగితంతీసి అందించాడు. "మీ వుత్తరంలో అర్జెంటు అన్నది చూసి ఆ సాయంత్రమే అన్ని షేర్లూ అమ్మేసేను. ఉన్నట్టుండి ఇలా ఎందుకు అమ్మెయ్యమన్నారా అని అప్పుడు ఆశ్చర్యపోయాను కూడా............అందులోనూ ధర విపరీతంగా పెరుగుతున్నప్పుడు....కానీ నిన్న ఢిల్లీలో పేపర్లో చూసేను. మీకేదో "హింట్" వచ్చిందేమో అందుకే అమ్మెయ్యమంటున్నారు అనుకొన్నాను. నిజంగా తెలివంటే మీది! వెంట్రుక వాసిలో "టోటల్ కొలాప్స్" నుంచి తపించుకొన్నారు కంగ్రాట్స్.... మిరీ బిజినెస్‌లోంచి తప్పుకోకండి బాబూ-కనీసం ఒక లక్షన్నా........"

అతడు చెప్తున్న మాటల్ని గాంధీ వినటంలేదు. అతని ఆలోచన్లు ఎక్కడో

వున్నాయి.

హోటల్లో హారిక మాటలు

"....తొందరపడి ఎవరికీ మాట ఇవ్వకూడదు అన్నారు అలాగే బిజినెస్‌లో ఎవర్నీ, చివరికి కట్టుకున్నదాన్నయినా సరే నమ్మకూడదు అన్నారు కానీ నన్ను నమ్మి తెల్లకాగితం మీద సంతకం పెట్టి ఇచ్చారు

అతడు చేతిలో కాగితంవైపు చూసుకున్నాడు

థాంక్యూ హారికా!... థ్యాంక్యూ!

లాలా అంటున్నాడు షేరు ఒకటికి ఇరవై అయిదు రూపాయల చొప్పున అమ్మాను సార్. కన్వర్టబుల్ డిబెంచర్లు రెండు లక్షలవీ మూడు లక్షలకి-మొత్తం ఎనిమిది లక్షలు...."

To,
K.L.Lala
Stock Broaker

IMMEDIATE

Dear Sir,

This is to instruct you to sell'way all the Shares & Debentures of T.I T ltd, today

Act immedietely

Yours faithfully

Samhit.

20/2
14.30

థ్యాంక్యూ హారికా! థ్యాంక్యూ!!

తండ్రి ఎవరితోనో రహస్యంగా మాట్లాడుతూ వున్నప్పుడు వినివుంటుంది. లేదా తండ్రి ప్లాన్ ఇంకో విధంగా తెలుసుకొని వుంటుంది... ఆఖరి క్షణంలో "షా" చెప్పే ఎత్తు!! ఎవరూ రక్షించలేని విధంగా తనని రక్షించిన ఆ అమ్మాయికి ఎలా కృతజ్ఞతలు చెప్పుకోగలడు?

"ఏయ్ గాంధీ-ఏమిటా ఆలోచన:"

అతడు తెప్పరిల్లి లక్ష్మివైపు చూసేడు....లాలా వెళ్ళిపోయాడా?"

"ఆ వెళ్ళిపోయాడు" అంది లక్ష్మి" ఇంతకీ ఏం జరిగింది?"

గాంధీ చెప్పలేదు. చేతిలో వున్న రెండో కాగితం విప్పాడు. ప్రియంవద వ్రాసింది అది.

"అల్లాగం బీడులో మైకా బీడు గురించి ఎర్రపెన్సిల్‌తో అండర్‌లైన్ చేసింది మా శ్రీవారు, ఈ మాత్రం సూచనచాలు అనుకుంటా........"

గాంధీ కనుబొమ్మలు ముడుచుకున్నాయి. ఏమాత్రం అనుమానం రాకుండా కోటలోపాగా వేసింది సుహ్వా హనుమంతరావ్!

అతడా కాగితాన్ని మడుస్తూ వుండగా అడుగుల చప్పుడు వినిపించింది. హనుమంతరావ్ హడావుడిగా లోపలికి వచ్చాడు.

"నమస్తే సార్! మంచిఇల్లు దొరికింది. కానీ మేం ఒక్కరమే వెళ్ళటం బావోదు. ఇంతకాలం మా చెల్లెల్ని మీతో వుంచుకొన్నారు. ఏదో ఉడతా భక్తిగా అడుగుతున్నాను. మీరూ మాతో వుండండి...."

గాంధీ పెదవులమీద చిరునవ్వు వెలిసింది....అప్పుడే రామ్మోహనరావుకి తమ డబ్బు పోగొట్టుకోలేదని తెలిసిందన్న మాట. అందుకే తిరిగి ఇతడిని పంపించాడు. ఇతడు డైరెక్టుగా, మీతోనే వుంటామూ అంటే బావోదని, ప్లేటు మార్చి, తనతో తన ఇంట్లో వుండమంటున్నాడు.

గాంధీ నవ్వుతూ "మీ ఆహ్వానానికి థాంక్స్....కానీ అదృష్టవశాత్తూ నాకు వ్యాపారంలో నష్టంరాలేదు. ఈ ఇంట్లోనే వుందాం-మళ్ళీ ఇంకో కొత్త ఇల్లుదేనికి" అన్నాడు.

హనుమంతరావు ఆశ్చర్యం నటిస్తూ "నిజమా-అబ్బా! ఎంత మంచి వార్త చెప్పాడు. అలాగే అలాగే" అన్నాడు అతడు-నటిస్తున్న విషయం మొహంలో తెలిసిపోతూనేవుంది. గాంధీ నవ్వుతూనే వున్నాడు.

రామ్మోహనరావ్ పెట్టిన కంపెనీపేరేమిటీ?

'టిట్ ఫర్‌టాట్' కదూ!

(ఇంకావుంది)

# రేఖా చిత్రం

జె.వి. సుబ్బలక్ష్మి

మెడలో నల్లపూసల గొలుసుతో పాపట్లో కుంకుమతో అరుంధతిలా ఆఫీసులో అడుగు పెట్టిన అనూరాధను చూడగానే ఆఫీసు స్టాఫంతా బిత్తర పోయారు. ఏమిటీ మార్పు ఒక్కసారిగా అనుకున్నారు. పోయిన సారి నేను ఆఫీసుకు చివరిసారిగా వచ్చినప్పుడు తల ఓరగా పెట్టి మెడ వాల్చి కళ్ళు పక్కకు తిప్పి ఓర చూపులు చూచిన వాళ్ళంతా ఈ రోజు తలెత్తి ధైర్యంగా పాపం చేయని వాళ్ళు గుళ్ళో దేవతను చూచినట్లుగా చూస్తున్నారు. అంతవరకూ వాళ్ళ చూపులు ముళ్ళయి గుచ్చుకుని బాధపెట్టేవి అనూరాధను. ఈ రోజు ఆ చూపులే చల్లగా వెన్నెలలా తగులుతున్నాయి. ఆత్మీయుల చూపుల్లా ఆహ్లాదాన్ని కలిగిస్తున్నాయి. అనూరాధ వెళ్ళి తన సీట్లో కూర్చోగానే పక్క సీట్లో విమల తన కుర్చీని అనూరాధకు దగ్గరగా లాక్కుంది.

"ఏమిటి అనూ? నిజంగా.. నమ్మవేకుండా వున్నాను స్మీ" అంది చిన్నగా అనూరాధకు మాత్రమే విన్పించేటట్లుగా.

"ఏముంది. పెళ్ళి చేసుకున్నాను" అంది అనూరాధ సింపుల్‌గా.

"అదే ఇంత త్వరగా ఎవరికీ చెప్పకుండానే" అంది విమల.

"తల్లీ మీకందరికీ చెబుతూ ముహూర్తాలు పెట్టించి శుభలేఖలు అచ్చు వేయిస్తూ కూచుంటే కుదిరిన సంబంధం కాస్త వెనక్కు వెళ్ళేది. అంతా చాలా సడన్‌గా జరిగిపోయింది. మెడలో నల్లపూసలు, పాపట్లో కుంకుమ లేకుంటే నేను కూడా జరిగిందంతా కలనే అనుకునేదాన్ని"

"నీ పెళ్ళికథంతా ఓ పెద్ద మిస్టరీలా వుంది. దయచేసి త్వరగా చెప్పవే చంపక"

తల్లీ చెప్పాలంటే ఓ పేద్ద నవలవుతుంది. సాయంకాలం యింటికిరా. నీకు వివాహపర్వం అంతా వినిపిస్తాను. విని తరిద్దువుగానీ."

"సరే అలాగే కానీ. అంతకన్నా ఈ జన్మకు కావలసిన భాగ్య మింకేముంటుంది. నేను వెళ్ళి పార్టీ అరేంజి చేయిస్తాను. నువ్వు కనీసం మీ ఆయన పూరా పేరయినా చెప్పు. కొలీగ్సుకి చెప్పవద్దూ?"

"పేరు శచీంద్రనాథ్ ముఖర్జీ. ఊరు..."

"కలకత్తా" అని పూర్తి చేసింది విమల.

"నీకేలా తెలిసిందీ"

"ఏముంది. ముఖర్జీలు కలకత్తావాళ్ళే గానీ ఇక నేవెళ్ళి పార్టీ అరేంజి చేయిస్తాను. ఇన్నాళ్ళకు పెళ్ళి చేసుకున్నావు. మీనాసి తనం చూపక ఓ యాభై నీవి కావనుకో"

"అలాగే కానీ. నీ పుత్సాహం ఎందుక్కాదనాలి. యాభై నావికావు. మా ఆయనవి సరేనా" అంది అనురాధ నవ్వుతూ.

"అమ్మ దొంగా ఇప్పట్నుంచే మీ ఆయన డబ్బుమీద అధికారం వచ్చేసినట్లు మాట్లాడేస్తున్నావే. సర్లే కానీ అలాగే మీ ఆయన వుద్యోగం జీతం కూడా చెప్పవే తల్లీ నీ ప్రాణ స్నేహితురాల్నని చెప్పు కుంటుంటా ను గా. నా పరువు తియ్యకు"

"ఉద్యోగం అక్కడే ఓ కంపెనీలో, జనరల్ మానేజర్, జీతం నెలకు మూడు వేలు. చాలా"

"చాలే తల్లీ. ఇప్పటికి చాలు. నీ పెళ్ళయిందంటే నాకెంత సంతోషంగా వుందో చెప్పలేను." అంటూ అక్కణ్ణుంచి జారుకుంది విమల.

ఆఫీసరుతో సహా అందరూ పార్టీ అందుకుని అనురాధను అభినందించారు.

"ఈ పార్టీ చాలదమ్మా. ఈ సారి మీ ఆయనతో వచ్చి మంచి పార్టీ యివ్వాలి. గ్రాండ్‌గా డిన్నర్ యివ్వాలి సారి" అని ఆఫీసరుగారు అభిమానంగా ఆజ్ఞాపించారు.

"అలాగేనండీ" అంది సిగ్గు పడుతూ అనూరాధ.

ం ం ం

"చెప్పా పెట్టకుండా యీ పెళ్ళి చేసుకోవడమేమిటి" అంది జానకమ్మ "పెద్ద ముండను, తల్లి ముండను నేను బతికే వున్నానుగదా. ఆ రిజిష్టరు పెళ్ళో ఏదో నా కళ్ళముందే చేసుకుంటే ఏం బోయింది. ఏదో చేసుకున్నావే అనకో కనీసం అల్లుడినైనా వెంట పెట్టుకు రాక పోలివి. అడిగిన వాళ్ళు మా అమ్మాయి పెళ్ళి చేసుకుందీ అంటే అల్లుడుగారెప్పు డొస్తారు అని అడుగుతున్నారు. ఎంతయినా ఉన్న ఊరూ వున్న ప్రజాన్నూ"

"ఆయనకు సెలవు దొరకదమ్మా. పెద్ద వుద్యోగమాయె. వాళ్ళ ఆఫీసకు ఢిల్లీలో వుంటాడు. ఆయనకు రాని సెలవు తెప్పించుకోవాలి. పెళ్ళిరోజే ఒక్క గంటకన్న ఎక్కువ టైము దొరకలేదా యనకు"

"కాక కాక పిల్ల పెళ్ళయిందంటే అమ్మాయినీ అల్లుణ్ణీ నాలుగు రోజులు అట్టి పెట్టుకునే అదృష్టం నాకు లేదు. ఏక్షణాన మీ ఆయన వచ్చి నా భార్యను నా వెంట పంపండి' అంటాడో కలకత్తా అంత దూరం నువ్వెళ్ళి పోతే నేనొక్క దాన్ని యీవూళ్ళో . ."

"ఊరుకోమ్మా? నిన్ను ఒంటరిగా వదిలి ఎందు కెళతాను. ఆయన సంగతి నీకు తెలియదు. తల్లి లేని ఆయన నిన్ను తల్లిలా చూచు కుంటారు. నా మాట నమ్ము. నీ మనవళ్ళనూ మనవరాళ్ళనూ నువ్వే ఆడించు కోవచ్చు. సరేనా"

"నా తల్లే-నీ కడుపు చల్లగా ఎంత చల్లటి మాట చెప్పావే. నీ మాట చాలు

నాకు పది వేలు-కొత్త కాపురం కాస్త సర్దుకున్నదాకా వుండి తిరిగి వచ్చేస్తా. ఈ వూళ్లో నాకేం తక్కువ. కాలూ చెయ్యీ అందినన్నాళ్ళూ చేసుకుంటాను. ఆ తర్వాత ఎలాగూ నీ దగ్గరికి రాక పోతానా."

అప్పుడే అప్పగింతలు పెడుతున్న తల్లిని చూచి నవ్వుకుంది అనూరాధ. పిచ్చి అమ్మ. కూతురి పెళ్ళంటే యింత ఆనందంతోపాటు ఎంత దిగులో అను కుంది.

"ఏమే కొత్త పెళ్ళికూతురా! ఏమి టంత దీర్ఘాలోచనలో వున్నావ్. పర ధ్యాన మెక్కువైందే" అంటూ ప్రవేశిం చింది విమల.

"నేనా! నువ్వే-ఆనాడు వస్తానన్న దానివి యిప్పుడా రావడం ఐదురోజుల తర్వాత. చూడుము వివాహ పర్వంబు వినుటలో నాలసించినందున నీకు సం పూర్ణ ఫలంబు దక్కకుండుగాక."

"తల్లీ! ఆ ఫలమేదో పూర్తిగా నీకే దక్కనీ, నాకు ఫలమూ వద్దు, పండూ వద్దు. పురాణ శ్రవణానికి ముందే ఫల శ్రుతి విన్పించిన నీ తెలివిని ఎలా అభి నందించాలో తెలీకుండా వుంది. ఇహ నీ ప్రేమాయణం పెళ్ళాయణం అంతా చెప్పు."

అనూరాధ లోపలికి వెళ్ళి స్వీటూ హాటూ తెచ్చింది.

"ఇదుగో యిది తీసుకో-అమ్మ చేసింది" అంది.

విమల స్వీటూ హాటూ తిన్నాక యిద్దరూ కాఫీ తాగారు.

"పద అలా తోటలోకి వెళ్దాం" అంది అనూరాధ.

ఇద్దరూ కుర్చీలు తీసుకెళ్ళి తోటలో వేసుకున్నారు.

నేను హైస్కూల్లో చదివేప్పుడు నాకో స్నేహితురాలుండేది. పేరు రాధిక. ప్రాణ స్నేహం మాది. పోటీలు వేసుకొని చదివే వాళ్ళం. అది ఎస్సెల్సీ ప్యాసు కాగానే పెళ్ళి చేసుకుంది. దాని మొగుడో పెద్ద బిజినెస్ మాగ్నెట్. కలకత్తాలోవున్నాడు. ఇన్నాళ్ళకు నేను గుర్తుకు వచ్చానట. అర్జంటుగా రమ్మని వుత్తరం రాసింది. వెళ్ళాను. దాని మొగుడికి స్నేహితుడే యీ శశీంద్ర. పరిచయమయ్యాడు. మా పరిచయం కొద్ది రోజుల్లోనే...."

"ప్రేమగా మారింది. పెళ్ళి చేసు కున్నావ్, బాగుంది, ఎలాగైతేనేం ఓ యింటి దానివయ్యావు. మీ ఆయన యెప్పుడు వస్తాడే యిక్కడికి?"

"ఏమో! ఓ ఆర్నెల్లయినా పడు తుందిట."

"ఎక్కడి జడ పదార్థమే అనూ. కొత్తగా పెళ్ళయిన వాడు, ఆర్నెల్లెలా వుంటాడు నిన్నువదిలి"

"ఈ జడ పదార్థాన్ని చేసుకున్న వాడు జడ పదార్థంగాక మరేమవుతాడు." అంది అనూరాధ నవ్వుతూ, ఎవరేమన్నా పులుక్కుండా పలక్కుండా వుండే అనూ రాధకు ఆఫీసులో అంతా జడ పదార్థం అని పేరుపెట్టుకున్నారు.

"పోనీలే వర్ణించనయినా వర్ణించు, విని తరిస్తాను," అంది విమల.

"నల్లని వాడు పద్మనయనంబుల వాడు కృపారసంబుపై జల్లె...."

"జల్లెడా లేదు తప్పేటాలేదు. పనికి

మాలిన వర్ణనా నువ్వూను, ఓ ఫోటో వుంటే యిలా యివ్వు-నేనే వర్ణించు కుంటాను."

అనూరాధ లోపలికి వెళ్ళి ఫ్రేంలో తన పక్కనవున్న అతని ఫోటోను తెచ్చి చూపింది.

"ఎలా వున్నారు."

"మూడు మూర్తులా నీకు తగ్గటు వున్నాడు. ఈడూ జోడూ చక్కగా కుదిరింది. నిజం చెప్పాలంటే నీ కన్నా కూడా మీ ఆయనే అందంగా వున్నాడు, కాదంటావా?"

చిన్నగా నవ్వి వూరుకుంది అనూరాధ.

"మీ అమ్మ ఏమంది అల్లుణ్ణి చూసి"

"అమ్మ కూడా అల్లుణ్ణి చూడ లేదింకా. ఫోటో చూసింది."

"మరి నువ్వు వుద్యోగంలో వుంటావా మానేస్తావా"

"మా ఆయన నన్ను తీసికెళ్ళేదాకా చేస్తాను. ఆ తర్వాత ఎలాగూ మానేస్తా"

"లక్కీ ఫెలోవి" అంది విమల మనస్ఫూర్తిగా, "ఇంక వెళ్తానే యింటి దగ్గర పిల్లలు ఎదురు చూస్తుంటారు."

కమలను గేటుదాకా సాగనంపి ఫోటో చేతోపట్టుకుని వచ్చింది అనూరాధ.

"మీ ఫోటో చూస్తుంటేనే నన్ను నేను మర్చిపోతుంటాను. మీరే స్వయంగా నా దగ్గరికి వస్తే....అమ్మ అల్లుణ్ణి చూడాలని ఆతృత పడుతోంది" అనుకుంది ఫోటోను చూచి భారంగా నిశ్వసిస్తూ.

ం ం ం

"అమ్మా! మీ అల్లుడి దగ్గర్నుంచి వుత్తరం వచ్చిందే" అనూరాధ.

"ఏం రాశాడో చదువు" అంది జానకమ్మ కండ్లద్దాలు సవరించు కుంటూ ముందున్న చాట పక్కన పెట్టి,

"రమ్మని రాశారు. రేపట్నుంచే పదిహేను రోజులు సెలవు పెట్టి వెళ్తున్నాను, నిన్ను గూడా తీసికెళ్దామను కున్నాను గానీ అక్కణ్ణుంచి ఆయన ప్రోగ్రాం ఏమిటో తెలియదు. అనవసరంగా నీకు హైరానా ఎందుకని...."

"నువ్వు పోయిరా మరి నాదేముంది, వచ్చేప్పుడు యిద్దరూ రండి. చిన్నగా వీలు చూచుకుని ఒక్కసారి వచ్చి పొమ్మను."

"అవునమ్మా చెప్పాలి. ఆ తర్వాత ఆయన ఫారిన్ వెళ్తారేమో" అంది అనూరాధ.

పదిహేను రోజులుంటానన్న అనురాధ వారం రోజులు కాగానే తిరిగి వచ్చింది. వస్తూ వస్తూ కొత్త చీరలు, బొమ్మలు యింకా చాలా వస్తువులు తెచ్చింది.

స్నానం చేసి చీర మార్చుకుని వచ్చి తెచ్చిన వస్తువులన్నీ బీరువాల్లో సర్దింది.

ఈసారి గూడా అల్లుడు రాలేదేమిటా అనుకుంది జానకమ్మ.

వంటింట్లోకి వెళ్ళి పీట వాల్చుకుని కూర్చుని "ఆయన అర్జెంటుగా కంపెనీ పని మీద అమెరికా వెళ్ళాల్సి వచ్చింది. అందుకే నేను వచ్చేశాను, కాఫీ యివ్వు" అంది అనూరాధ.

వెళ్ళయ్యాక అనురాధ ఖరీదైన చీరలు కడ్తోంది. మనిషి చాలా వుత్సాహంగా కన్పిస్తోంది. నాలుగు నెల్లకొసారి కలకత్తా వెళ్ళి వస్తోంది. సెలవు దొరక్క శశీంద్ర యింతవరకూ ఆంధ్రా రాలేదు. ఈసారి ఫారిన్ వెళ్ళడం వల్ల ఇంకో

రెండేండ్లు దాకా రాడు అని చెప్పింది అనూరాధ.

ఫారిన్ వెళ్ళాక శచీంద్ర దగ్గర్నుంచి ఉత్తరాలు తరచు రావటంలేదు. అనూరాధ వుద్యోగం మానలేదు. తల్లి అడిగితే "ఆయనకు పని ఎక్కువగా వుంటుందమ్మా అంతే. దూరదేశాన వున్నారాయె. అయినా తడవ తడవకూ రాయడానికేముంటుంది" అంటుంది అనూరాధ. అస్తమానూ శచీంద్ర ఫోటో దగ్గర పెట్టుకుని ఆలోచనల్లోకి జారిపోయిన కూతుర్ని చూసి నిట్టూర్చేది తల్లి. చిలకా గోరింకల్లా వుండాల్సిన రోజుల్లో యీ ఫారెన్లు ఏమిటోనని, అక్కడికి వెళ్ళి వచ్చాక శచీంద్ర జీతం పెరుగుతుందట. మూడు వేలకన్నా ఎక్కువ జీతం మనిషి కెందుకు. హాయిగా వుద్యోగం మానేసి యిదికూడా అక్కడికి వెళ్ళగూడదూ అనుకుంది జానకమ్మ, అప్పుడప్పుడూ విమల వచ్చి వెడుతూ వుంది. విమల దగ్గర తన గోడు వెళ్ళ బోసుకుంది జానకమ్మ.

"పర్వాలేదు పిన్నిగారూ, ఈ కాలంలో ఫారిన్ వెళ్ళకుంటే గొప్ప లేదు. మీ అల్లుడు ఫారిన్ రిటర్న్డ్ అంటే మీకు మాత్రం గొప్ప కాదూ, రెండేళ్ళేగా ఎంతలో తిరిగివస్తాయి" అని ఓదార్చింది విమల.

ం ం ం

ఓ సంవత్సరన్నర గడిచింది. ఈ సంవత్సరన్నరకూ శచీంద్ర దగ్గరుంచి మూడుత్తరాలు వచ్చాయి మొదటి ఆరు నెలల్లో, ఆతర్వాత వుత్తరాలే లేవు. సంవత్సరన్నర గడిచిన తర్వాత ఓరోజు అనూరాధ దిగులుగా యింటికి వచ్చింది. బాగ్ అవతల పడేసి మంచం మీద వాలిపోయింది. అనూరాధ మనసంతా అల్లకల్లోలంగా వుంది. కన్నీరు దిండును తడిపేస్తోంది.

కూతురు ఎంతకూ గదిలోంచి రాకపోయేసరికి జానకమ్మ వచ్చింది. "ఏమిటే తల్లీ అలావున్నావు, ఒంట్లో బాగులేదా" అంది ఆదుర్దాగా కూతుర్ని భుజాలు పట్టుకుని తనవేపు తిప్పుకుంటూ కన్నీళ్ళు చూడగానే ఆమె మాతృ హృదయం ద్రవించింది.

"ఏమైందే? ఎందుకా కన్నీళ్ళు? అల్లుడి దగ్గర్నుంచి వుత్తరం రాలేదనేగా! వస్తుందిలే" అంది అనునయంగా.

"ఉత్తరం వచ్చిందమ్మా" అంది అనురాధ నిర్లిప్తంగా.

"వచ్చిందా! మరయితే యింక ఏడుపెందుకూ, ఇంత దిగులు పడేదానివి అతణ్ణి విడిచి వుండట మెందుకు, వెంటనే వచ్చేస్తున్నానని జాబు వ్రాయి" అంది జానకమ్మ.

"అమ్మా యిదేం కలకత్తా కాదు. వున్న పళంగా రైలెక్కి వెళ్ళిపోడానికి అమెరికా"

"అయితే విమానమెక్కి పోలేవూ. అంతేగా"

"అది కాదమ్మా, ఇక్కణ్ణుంచి ఎవరైనా విదేశాలకు వెళ్ళాలంటే ప్రభుత్వం అనుమతికావాలి"

"అదేమిటే నీమొగుడి దగ్గరికి నువ్వు పోడానికి ప్రభుత్వం అనుమతి ఎందుకూ" అంది జానకమ్మ ఆశ్చర్యంగా.

"ఇప్పుడింక ఆయన అనుమతే లేదులేమ్మా" అంది అనూరాధ. జానకమ్మ




అదిరి పడింది.

"అదేమిటే? ఏమైంది? ఏముంది ఆ జాబులో. అల్లుడుగారు క్షేమమేగా" అంది.

"ఆఁ! క్షేమమే! ఆయన...ఆయన... వేరే పెళ్ళి చేసుకున్నారమ్మా" అంది అనూరాధ వెక్కుతూ.

"ఏమిటే! నిజంగానే! ఆరి భగ గ్గంతుడా" జానకమ్మ ఉన్నచోటనే కూలి గ్గడింది. పిల్ల కాపురం సవ్యంగా వుండాలనుకుంటే యిదేం ఘోరం మధ్యలోనే. అందుకే చెప్తూనే వున్నా పెళ్ళి దగ్గరుండవే పిల్లా అని, మగవాడిబుద్ధి ఎప్పుడెలా మారుతుందో. కలకత్తాలో వున్నన్నాళ్ళూ బుద్ధిగానే వుండె. ఓ వన్నెల విసినకర్ర ఒళ్ళోనూ పడక పాయె. నువ్వు దగ్గరుంటే యీ దుర్బుద్ధి పుట్టునా"

"ఉద్యోగం...."

"వెధవ్వుద్యోగం. ఏడు వందల రూపాయల ఉద్యోగం ఒహ లెఖ్ఖా-మీ ఆయన....మీ ఆయన మూడు వేలు సంపాదిస్తుండగా. తిని కూర్చోలేక యిదేం దుర్బుద్ధే. తాళి కట్టించుకున్నావు గానీ ఒక్కనాడైనా దగ్గరున్నావా" అంది జానకమ్మ ఆవేదనగా. పెళ్ళి అయ్యీ కాకుండానే కూతురి కాపురం కూలిపోయిందనే సరికి ఆమె బాధను ఓర్చుకోలేక పోయింది. తల్లి బాధను చూడలేక అనూరాధ తోటలోకి పారిపోయింది శశీంద్ర ఫోటోతో సహా.

పిన్నిగారూ అంటూ విమల రాగానే జానకమ్మ భోరున ఏడుస్తూ ఆమెను వాటేసుకుంది. "అనూరాధ జీవితం అడవిగాచిన వెన్నెలైందే తల్లీ. దాని బతుకు బండలైందే అమ్మా" అంటూ.

"ఏమైంది పిన్నిగారూ. సరిగ్గా చెప్పండి" అంది కంగారుగా విమల.

"అయ్యేదేముంది. దాని మొగుడు

అమెరికాలో ఎవతో యింగిలీషుముండను కట్టుకున్నాడ్ట. నవ్వు నాకక్కర్లేదుఫో అని పుత్తరం రాశాడు. తల్లిగా నేను దానికి వెళ్ళి చెయ్యి లేకపోయాను. కనీసం కళ్ళ ఎదురుగా వాళ్ళిద్దరూ చిలకాగోరింకల్లా ఉరుగుతూ వుంటే చూద్దామనుకున్నా. ఈ ముసిల్దానికంత మాత్రమదృష్టం కూడా లేదేమోనమ్మా. ఆ ముండ ఎవరోపీణ్ణి తగులుకుంది నాఖర్మ."

"ఇంతకూ అనూరాధఏదీ"

"ఆ తోటలోకి పోయిందేమో వెళ్ళు తల్లీ. వెళ్ళి దాన్ని కొంచెం ఓదార్చు" అంది జానకమ్మ.

విమల వెళ్ళే సరికి అనూరాధ తదేకంగా శచీంద్ర ఫోటోను చూస్తోంది. విమల వెనకనుంచి ఆ ఫోటోను లాగి విసిరి కొట్టింది. అద్దం పగలి పోయింది. అనూరాధ వెనక్కి తిరిగికోవంగా 'విమలా' అని అరిచింది. కొంత సేపటికి తేరుకొని "ఎంతపనిచేశావె విమలా" అంది.

"నీ హృదయం బద్దలు కొట్టిన వాడి ఫోటో బద్దలు కొట్టాను. తప్పా. అసలు మనిషే కన్పించివుంటే బుర్ర బద్దలు కొడుదును" అంది విమల ఆవేశంగా.

"అంత మాటననే విమలా. ఆయన నా దైవం. నాకు కొత్త జీవితం ప్రసాదించారు"

"ఏమిటి మెళ్ళో నల్ల పూసలు పాపట్లో యింతకుంకుమానా. ఇదేనా కొత్త జీవితం? ఒక్క నాడైనా మీ ఇద్దరూ కలిసి సంతోషంగా వున్నారా? పైగా ఆ మూర్ఖుణ్ణి వెనకేసు కొస్తున్నావా" అంది విమల.

"నీకు తెలియదు. నువ్వూరుకో, నా ఖర్మ యిలావుంటే ఆయనేం చేస్తారు. అమ్మన్నట్లు మూర్ఖురాల్ని నేనే ఆయనకు దూరంగావుంటే నా మీద ప్రేమ ఎలా వుంటుంది" అంది అనూరాధ.

కొంత సేపు కూర్చుని వెళ్ళిపోయింది విమల.

ం ం ం

ఆరాత్రి అనూరాధ గదిలో దూరి తలుపు గడియ పెట్టింది. నిద్ర మాత్రల సీసా తెచ్చి అందులో మాత్రలు ఎంచింది. తల్లి కోసం డాక్టరు రాసిచ్చినవి అవి. పన్నెండు వున్నాయి.

"శచీంద్రా. ఐ లవ్ యూ వెరి మచ్. నా జీవితాన్ని ఓ మలుపు తిప్పావు. నీనుంచి నేను కోరింది యీ నల్ల పూసలు కుంకుమ మాత్రమే. ఇంతకు మించి నా జీవితానికి మరేమీ దొరకదని నాకు తెలుసు. ఈ భాగ్యాన్ని పొందినందుకు నేను చాలా అదృష్టవంతురాల్ని. ఎందరో కన్యలు ఈ మాత్రానికి కూడా నోచుకోక దిక్కులేని చావు చస్తున్నారు. వాళ్ళకంటే నేనే నయం. లోకందృష్టిలో వివాహితను. నాభర్త ఫారిన్‌లో మరో అమ్మాయిని పెండ్లాడాడు. బాధ భరించ లేక నేను ఆత్మహత్య చేసుకున్నాను. ఓహ్! లోకం నుండి బోలెడంత సాను భూతి. నా మరణాన్ని ఎవ్వరూ విమ ర్శించరు. పెండ్లి కాకుండావుంటే బతికున్న పిల్లను తమ మాటల్తో చంపుతుందీ లోకం. ఆ మాటలు భరించలేక చనిపోతే ఆ పిల్లకు ప్రాణం పోసి మరీ హింసిస్తుంది. వెళ్ళికాని పిల్లలు చనిపోతే

భగ్న ప్రేమికులు, మోసపోయిన వాళ్ళు అని బిరుదులు తగిలించి గేలిచేస్తారు. చనిపోయినా వెనక చెడ్డ పేరును మిగుల్చుకో కూడదు. అందుకే యీ పెళ్ళి," అని శసీంద్ర ఫోటోను చేతులోకి తీసికొని అగ్గిపుల్ల వెలిగించి అంటించింది. కాలిపోతున్న ఆ ఫోటో వంక చూస్తూ అనుకుంది,

"శసీంద్రగా పిలువబడుతున్న ఓ అజ్ఞాతవ్యక్తీ! నన్ను క్షమించు. నాభర్తగా నటించినందుకు ని ఫోటోకు నా కృతజ్ఞతలు. నీ ఫోటోను కాల్చానని బాధపడకు-నా ఆయుస్సు కూడా పోసుకని పిల్ల పాపలతో చల్లగావుండు. నా పెండ్లి నాటకానికి కలకత్తాలో ఓ స్టూడియోలో దొంగిలించా నీ ఫోటోను. నీకు శసీంద్ర నాధ్ ముఖర్జీగా పేరుపెట్టాను. నీ పేరు మీదుగా మిసెస్ అనూరాధ ముఖర్జీ నయినాను. కన్న తల్లికి కూడా తెలీనీయకుండా నాటక మాడాను. ఈ నాటకం అయిపోయింది. నా పాత్ర నిష్క్రమిస్తున్నది, ఇక ఈ ఫోటో యిక్కడ ఉంటే లేనిపోని అనుమానాలకు ఆస్కారమవుతుంది. అందుకే ఫోటోని కాల్చి సహగమనం చేస్తున్నాను.

"ఏ కారణంగానైనా ఆడపిల్లకో వయసొచ్చాక పెళ్ళికాకుంటే కాలేదని పొడిచే ఈ సంఘం ఆమె కోసం ఏం చేస్తోంది. చదువుండి, ఆరోగ్యం వుండి, రూపం గుణం కలిగిన యీ అనూరాధకు పెండ్లి కాలేదంటే కారణమేమిటి? గొంతెమ్మ కోరికలు కోరే పెండ్లి కొడుకుల దర్పం కాదా. వింతంతువైన తల్లి ఏ సహాయమూ లేక సరైన ప్రయత్నాల చెయ్యక పోపడం కాదా, తండ్రి వున్నన్నాళ్ళు యింటి చుట్టూ చేరి ఆయన పోగానే ముఖాలు చాటు చేసిన బంధువుల అభిమానం కాదా. స్నేహితులమంటూ నీ ఎదుట సానుభూతి పలికి వెనక ఏ సహాయమూ చెయ్యని సహాధ్యాయుల నాగరికత కాదా. ఎవ్వరికీ తాము చేసే సహాయం ఏమీ లేకున్నా పెండ్లి కాలేదు అని అది అమ్మాయి అనర్హతగా వెక్కిరించే లోకుల సంస్కారం కాదా. నాకో తోడు కావాలని నేనూ కలలు గన్నాను. వయసు మళ్ళిన తల్లిని ఏమీ అనలేక ఇతరులకు అసలు సంబంధంలేదు కాబట్టి వాళ్ళనూ విమర్శించలేక నాలో నేను కుమిలి పోలేదూ. పెళ్ళికాని పిల్ల జీవితం తెల్లకాగితంపై పెన్సిలుతో వేసిన రేఖాచిత్రం లాంటిది. ఆ బొమ్మకు చక్కని రంగులు వేస్తే చిత్రం అవుతుంది, లేకుంటే అది యెంత అందమైనదైనా పదిమందీ దాన్ని మెచ్చరు. ఈ రేఖాచిత్రం అందంగా కన్పించినా యిది రంగులు వెలిసి పోయినది.

రేఖాచిత్రం రంగులు వెలిసి పోయింది. అనూరాధ జీవితం సమాప్తమైంది.

మరునాటి ఉదయం అనూరాధ మరణం విన్న అమ్మలక్కలు బోలెడు సానుభూతి కురిపించారు. "ఆ మొగుడు అమెరికాలో ఎవర్తో ఒక ఇంగ్లీషుదాన్ని కట్టుకన్నాడట. పాపం అభిమానం గల పిల్ల ఎలా బతుకుతుంది. కన్నెచావు చావకుండా పసుపు కుంకుమలతో పోయింది పుణ్యాత్మురాలు..

# తలపుల తలుపులు

పెమ్మరాజు సంధ్యారాణి

**రూమ్‌కి** తాళం వేసి రోడ్డు మీదకి రాగానే రాజేంద్ర కళ్ళు అప్రయత్నంగా ఎదురింటి కిటికీవేపు మళ్ళాయి.

ఆమె అక్కడే నిల్చొనుంది!

ఈ కొత్త రూమ్‌లోకి వచ్చిన వారం రోజుల్నుంచీ తను గమనిస్తూనే వున్నాడు. సరిగ్గా తను ఆఫీస్‌కి బయల్దేరే టయిమ్‌కి ఆమె వచ్చి అక్కడ నిలబడుతుంది....!

ఆమెను చూసి చిన్నగా నవ్వేడు.

ఆమె నవ్వింది.

చటుక్కున అతనికి తను రోడ్డుమీద నిలబడున్నాడనే విషయం స్ఫురణకి వచ్చింది. దాంతో బలవంతాన మనసుని అదుపులో పెట్టుకుంటూ ముందుకు నడవ సాగాడు. అతని ఆలోచనలు మాత్రం ఆమె వేపే పరుగెడుతున్నాయి....

తనా రూమ్‌లోకి వచ్చిన సాయంత్రం గేటు దగ్గర నిలబడ్డాడు పరిసరాల్ని గమనిస్తూ.

ఎదురింట్లో ఒకతను బయటికొచ్చేడు.

వెనకే అతని భార్య అయ్యుంటుంది.

అతనెంత నలుపో, ఆమె అంత తెలుపు.

కాకి ముక్కుకి దొండపండు!

అతని మీద ఈర్ష్య, ఆమెమీద జాలి ఒకేసారి కలిగాయి తనకి. అలాగే వాళ్ళని చూస్తూ నిలబడ్డాడు.

అతను—

కొద్ది అడుగులు వెనగ్గా ఆమె—వెళ్తున్నారు.

వాళ్ళనే చూస్తూ తను....!

చటుక్కున ఆమె వెనక్కి తిరిగి చూసింది—వెళుతూనే!

తను రెడ్ హాండెడ్‌గా ఆమెకు దొరికిపోయాడనిపించింది తక్కున లోపలికి వచ్చేశాడు అయినా ఆమె గురించి ఆలోచించడం మాత్రం మాన్లేదు.

బహుశా పరిస్థితుల ప్రభావం వల్ల అతన్ని చేసుకొని వుంటుంది. అందుకే అతనితో జీవితానికి రాజీ పడలేక పోతోంది....

ఈ ఆలోచన ఆమె మీద జాలి, ఆమె భర్త మీద కోపం కలిగించడంతో పాటు తనకి ఆనందాన్ని కూడా కల్గించ సాగింది.

తననామె ఆకర్షించినట్టే, ఆమెని తనూ ఆకర్షించాడు. అందుకే అలా వెనక్కి చూసింది! ఆ క్షణంలోనే తనకామె మనసు అర్థమై పోయింది. అప్పట్నుంచీ ఆమె రాజేంద్ర మనసులో తిష్ఠ వేసుక్కూర్చుంది. అందుకనే అటుగా వచ్చేప్పుడు, పోయేప్పుడు అతని కళ్ళు అప్రయత్నంగా అటు చూస్తాయి.

రోజు రోజుకీ ఆమెకీ, తనకీ మధ్య దూరం తరుగుతున్నట్లనిపించింది రాజేంద్రకి.

మొదటి రోజు వెనక్కి తిరిగి చూసింది.

రెండో రోజు కిటికీ దగ్గర నిలబడుతున్నదల్లా తనని చూస్తూనే పక్కకి తప్పుకుంది.

మూడో రోజు మనిషి పక్కకి తప్పుకోకుండా చూపుల్ని మాత్రం పక్కకి మరల్చింది....





గోపి

నాల్గోరోజు తననే చూస్తూ నిలబడుంది. తనే కొద్దిగా కంగారు పడ్డాడు....

అయిదోరోజు తనకీ ధైర్యం వచ్చేసింది. చూపులు కలిశాయి....

ఇవాళ నవ్వులూ విసిరాయి....

ఇంక ఆలస్యమ్ అమృతమ్ విషమ్ అనిపించింది రాజేంద్రకి.

సాయంత్రం ఆఫీస్‌నించీ పెందరాడే ఇంటికి వచ్చేయాలి. అప్పటికి ఆమె భర్త రాడు కాబట్టి ఆమెతో మాట్లాడే అవకాశం దొరుకుతుంది....

ఈ నిశ్చయానికి రాగానే అతని పెదవుల మీద నవ్వు విరిసింది....మనసుకి సిగ్గేసింది. తియ్యటి ఆలోచన్లు మదిలో రొద చేస్తూంటే అతనికి తెలీకుండానే అడుగులు ముందుకు పడుతున్నాయి....

బస్టాప్‌కి చేరుకోగానే అతని ఆలోచన్లు చెదురు మదురు అయ్యాయి.

తోపుడి-త్రొక్కిసలాట-ఈ రోజు బస్సు ప్రయాణం అతనికి నరకంగా అనిపించేలా...

ఆఫీస్‌కి చేరుకున్న తర్వాత కూడా అతన్ని ఆలోచన్లు విడిచిపెట్టలేదు....బలవంతాన గడపసాగాడు క్రైమ్‌సి-పని చేస్తున్నట్లు

నటిస్తూ....

మూడు గంటలకల్లా పర్మిషన్ తీసుకుని బయటికి వచ్చాడు.

బస్సుకోసం ఎదురు చూడాలనిపించ లేదు. ఆటోలో బయల్దేరాడు....

ఆటో ఆగగానే శబ్దానికి ఆమె బయటికి వచ్చింది. పిలుస్తున్నట్లుగా చెయ్యూపింది.

తననే అనుకుని తలుపు కట్టి పోయాడు రాజేంద్ర.

కానీ ఇంతలో ఆటో వెళ్ళిపోవడంతో అవతల నిలబడున్న పన్నెండేటి కుర్రాడు కనిపించాడు.

ఆమె మళ్ళీ రమ్మన్నట్లు చెయ్యూపింది.

ఆ కుర్రాడబు పరుగెత్తాడు.

నీరసంగా కదిలాడు రాజేంద్ర.

రూమ్‌కి తాళంతీసి లోపలికి అడుగు పెట్టగానే "అంకుల్...." అంటూ పరుగెత్తుకొచ్చాడు ఇందాకటి కుర్రాడు.

"మీకు ఆ ఆంటీ ఈ కాగితాన్ని ఇమ్మన్నారు ..." అంటూ చేతిలో ఆ కాగితాన్ని కుక్కేసి ఎంత వేగంగా వచ్చాడో, అంత వేగంగానూ వెళ్ళిపోయాడు.

వణుకుతున్న చేతుల్తో ఆ కాగితాన్ని విప్పేడు రాజేంద్ర.

"మా ఆయన వూళ్ళోలేరు....మీరు చీకటి పడిన తర్వాత రండి ఎదురు చూస్తూ వుంటాను ..."

అతనికి ఇది కలా నిజమా? అనేంత అనుమానం వచ్చింది. మళ్ళీ మళ్ళీ ఆ వుత్తరాన్ని చదివేశు.

వెదకబోయిన తీగ కాలికి తగిలింది....

ఆనందంతో అతని మనసు గంతులు వేయసాగింది.

ఆ వుత్తరంతో పాటు మంచం మీద వాలిపోయాడు.

ఉత్తరం....

రంగుల కలలు

ఎన్ని సార్లు ఉత్తరాన్ని చదివినా, ఎన్ని కలలు గన్నా టైమ్ గడవడం లేదు

శుభ్రంగా స్నానం చేశాడు

నీటగా డ్రస్ చేసుకున్నాడు.

ఇంకా పొద్దు గూకలేదు ....

నెమ్మదిగా నడుస్తున్న టైమ్‌ని తిట్టుకుంటూ వరండాలో కుర్చీ వేసుకుని కూర్చున్నాడు.

మళ్ళీ ఆమె వాకిట్లోకి కూడా రాలేదు. బహుశా తనలాగనే ఆలోచనల్లో సతమతమై పోతోందేమో అనిపించిందతనికి.

సెకండ్లు....

నిముషాలు...

గడుస్తున్నాయి బరువుగా.

చీకట్లు కమ్ముతున్నాయి

రాజేంద్ర మొహం మాత్రం ఆనందంతో వెలిగిపోతోంది... ఆలోచనల అలలు మాత్రం అతన్ని ఇబ్బంది పెట్టేస్తూనే వున్నాయి..

"పట్టుకోండి.. పట్టుకోండి," అరుపుల్తో ఉలిక్కిపడి బయటికి వచ్చాడు రాజేంద్ర.

ముందొకతను పరుగెత్తుకొస్తున్నాడు.

అతన్ని పట్టుకోవడానికి వెనక చాలా మంది.

"పట్టుకోండి... పట్టుకోండి .దొంగ" అరుస్తున్నారు.

పరిస్థితి అర్థమైంది రాజేంద్రకి.

చటుక్కున గోడమీదికి వురికి అప్పుడే అక్కడికి చేరుకున్న అతన్ని గట్టిగా పట్టేసుకున్నాడు...

ఇంతలో జనం చుట్టు ముట్టేశారు

దొంగ చేతులు మారాడు.

ఎవరిష్టం వచ్చినట్లు వాళ్ళు కొట్టసాగారు.

"ఎవరి వస్తువుల కోసమో ఆశపడి తే కష్టపడి పనిచేసుకోరు కదూ...?"

"ఇటువంటి దొంగ బతుకు బతికేకన్నా చావడం నయం...."

ఎవరిష్టం వచ్చినట్లు వాళ్లు తిట్టసాగారు.

రాజేంద్రకి అక్కడ నిలబడా లనిపించ లేదు. రూమ్‌లోకి వచ్చేశాడు.

పోలీస్ స్టేషన్లో అప్పజెప్పడానికి కాబోలు దొంగని బలవంతాన లాక్కెంటూపోతున్నారు...



(సచిత్ర మాసపత్రిక)

## యాజమాన్యం, తదితర వివరాలు

ఫారం 4 (8-వ నిబంధన ప్రకారం)

| | |
|---|---|
| ప్రచురణ స్థలం | హైదరాబాదు |
| ఎంతకాలానికొకసారి | నెలకొకసారి |
| ముద్రాపకుని పేరు | పి. రామకృష్ణ |
| జాతి | భారతీయుడు |
| విలాసం | 1-8-4/1/1 చిక్కడపల్లి<br>హైదరాబాదు-500 020 |
| ప్రకాశకురాలి పేరు | శ్రీమతి వి. లీలావతి |
| జాతి | భారతీయురాలు |
| విలాసం | 3-5-1039/1 నారాయణగూడ<br>హైదరాబాదు-500 029 |
| సంపాదకురాలి పేరు | శ్రీమతి వి. లీలావతి |
| జాతి | భారతీయురాలు |
| విలాసం | 3-5-1039/1, నారాయణగూడ<br>హైదరాబాదు-500 029 |
| పత్రిక యజమానురాలు | శ్రీమతి వి. లీలావతి |

పై విషయాలు నాకు తెలిసినంతవరకు వాస్తవమైనవని తెలియజేస్తున్నాను

1-3-1982, హైదరాబాదు (సం) వి. లీలావతి

జనం, గోల క్రమంగా తగ్గింది.

రాజేంద్ర మనసులో కొత్త అలజడి రేగింది.

"దొంగ... దొంగ..." అతని చెవుల్లో మారుమ్రోగుతోంది.

అతనికీ, వనజకీ తేడా ఏమిటి?

ఈ ఆలోచన ఛెళ్ళున చెంపమీద చరిచినట్టనిపించిందతనికి.

తనూ కొద్దిసేపట్లో ఎదురింట్లో దొంగతనానికి బయల్దేర బోతున్నాడు. తమ విషయన్ని ఎవరైనా పసిగట్టేరంటే...?

తనూ ఇలాగే నలుగురిముందూ అవమానాన్ని భరించాల్సి వుంటుంది. తనందుకు సిద్ధంగా లేడు..

చటుక్కున కుర్చీలోంచి లేచాడు.

గబగబా రూమ్‌కి తాళం వేసి రోడ్ మీదికి వచ్చాడు.

ఎదురింటి గుమ్మంలో ఆమె నిలబడుంది.

అటువేపు చూడాలన్నా భయమనిపించింది రాజేంద్రకి. చరచరా ముందుకి వెళ్ళి పోయాడు—రోడ్లమీద కాసేపలా తిరిగివద్దామని!



# అక్షింతలు

శ్రీరమణ

బాల భానుని లేత కిరణాలు అరుణా రుణంగా కాఫీ కప్పుమీద పడి, వింత కాంతులు వెదజల్లుతున్నాయి. ప్రకృతి శోభనీ, కాఫీనీ కలిపి ఆస్వాదిస్తున్న సమయంలో వామనరావు ఆదుర్దాగా వచ్చాడు. అతని ముఖంలో ఆత్రుత, ఆందోళన-ఏదో పోగొట్టుకున్న వాడిలా కన్పించాడు.

"ఏమిటేమిటని" అతని ఆదుర్దా గమనించి అడిగాను.

"హృదయాల మీది పెంకులు పగిలి పోతున్నాయి-బైట వినబడుతున్నాయి-ఇట్లారండి రోడ్డుమీదికి." అన్నాడు వామనరావు కొంచెం గంభీరంగా-

"మళ్ళీ ఇంటివాడితోగాని, ఇంటావిడతోగాని పేచీ వచ్చిందా?" అని అడిగాను పెంకులు పగిలిపోతున్నాయి అనే ఫ్రేజ్ వినగానే-

"అబ్బే! అదేంకాదు—"

"మరి?"

"మనం కూడా అర్జంటుగా సొంత దస్తూరితో, సొంత గొంతుకతో మన పొయిట్రి వేయించాలి-తప్పదు" అన్నాడు వామనరావు దృఢంగా.

అసలు నేను వూహించినదానికీ, వామనరావు చెప్పిన దానికీ ఏమాత్రం పొంతన లేకపోవడంతో ఓ క్షణంసేపు ఆలోచనా రహితంగా వుండిపోయాను.

"దానికి చాలా అవుతుంది. మనం 'అచ్చు'కో గలమంటావా" అన్నాను నైరాశ్యపు వాయిస్‌తో

"ఏం పర్వాలేదు గాని ఇంతకీ ఫారెన్ లో నీకెవరైనా స్నేహితులున్నారా?" నా కళ్లలోకి ఆశగా చూస్తూ అడిగాడు కవి-వామనరావు.

"వున్నారు. కాని వున్న యిద్దర్లో ఒకడు సైంటిస్టు. రెండోవాడు సైకియాట్రిస్టు-బొత్తిగా టేస్ట్ లేనివాళ్లు" అన్నాను తప్పించుకునే వైఖరిలో.

"వాళ్లు మనకేం చెయ్యక్కర్లేదు బ్రదర్ డబ్బు మనమే పెడతాం-ప్రింటింగూ గట్రా అక్కడ చేయిస్తే చాలు-అదీ కష్టమనుకుంటే కవర్ పేజీ వరకూ అయినా" వామనరావులో ఇందాకటి

పుత్సాహం తగ్గినట్టు కన్పించింది. నా జవాబు కోసం ఆశగా ఎదురు చూస్తున్న కవిని ఎలా సముదాయించాలో నాకు తోచడంలేదు. కానేపు ఆలోచించి "చూడండి-ఇప్పుడు మనం ఎన్నిచేసినా-ఎలా చేసినా - ప్రపంచసాహిత్యంలో యిది తొట్టతొలి ప్రయత్నం అనే కీర్తి బస్సుని ఎలాగూ మిస్ అయాం-కనుక మీకీ మంకు పట్టు తగదు" అని నిష్కర్షగా చెప్పాను.

"మరైతే ఇంకా ఎట్లా చేస్తే తెలుగువాళ్లంతా దంగై పోతారో చెప్పండి. పోనీ అలాగే చేద్దాం" వామనరావు ఆశగా అడిగాడు.

"సొంత దస్తూరి, సొంత గొంతుతో బాటు కవిగారు వాడిన పైపు కూడా యిస్తే " అన్నాను.

"బానే వుంటుంది. లోగడ ఎవరూ యిలాంటి ప్రయోగం చేసినట్టు లేదు. కాని మనకి పైపు అలవాటులేదే " కొంచెం బాధగానూ, గిల్టీగానూ అన్నాడు వామనరావు.

"అదేముంది లెండి అలవాటు చేసుకోవచ్చు-పెద్ద శ్రమేంకాదు-వెరీ యీజీ" అని హామీ యిచ్చాను.

"అంటే - ఇప్పుడు మనం వెయ్యి కాపీలు వేస్తే, వెయ్యి పైపులు కావాలన్న మాట"

"అంతేకదా-అయినా దాందేముంది లెండి- శబరిలాగా ప్రతిపైపూ ఓసారి ఎంగిలిచేస్తే చాలు-బ్రాండ్ న్యూ యిస్తే మీ అభిమానులకు సంతృప్తి వుండకపోవచ్చు ."

నా మాటలకి వామనరావు కొంచెం సిగ్గుపడ్డట్టున్నాడు. ఓక్షణం మౌనం వహించాడు. ఈ క్షణంలోనే వామనరావుని క్లుప్తంగా మీకు పరిచయం చేస్తాను. తర్వాత మళ్ళీ టైం దొరక్కపోవచ్చు.

వామనరావు పొడుగ్గానే వుంటాడు. తొలి రోజుల్లో పార్ట్ టైం పొయెట్. క్రమేపీ ఫుల్ టైమర్‌గా మారిపోయాడు. ఇంట్లోగాని, బయటగాని, కవిత్వంలోగాని కమిట్‌మెంట్స్ ఏమీ లేవు. శ్రమపడి రాస్తాడు. శ్రమపెట్టి విన్పిస్తాడు. కవి అనేవాడు పొరుగువాడి బాధల్ని, సుఖాల్ని, అనుభవాల్ని, అనుభూతుల్ని తనవిగా చేసుకుని, వాటిని కవనంలో చొప్పించాలనే మతం అతనిది. ఆ మతంలో చేరినప్పటి నుంచి "నేను" అనడానికి బదులు "మనం" అంటుంటాడు. వామనరావు కవిత్వపు అందచందాలు, లోతులు, వెడల్పులు నాకు అంతగా తెలియవు. ప్రతి పంక్తిలోనూ చివరి రెండు మూడు అక్షరాలు ఒకలాగే ధ్వనిస్తాయి. ఆ "ధ్వని" అప్పుడప్పుడు వినడానికి బాగుంటుంది. అంతకు మించి నాకేమీ తెలియదు

వామనరావు సిగ్గునుంచి తేరుకుని "ఇంకా ఏమైనా కొత్త ఐడియా ?" అన్నాడు

"ఏం లేదండీ-పాఠకులకి మీ జ్ఞాపకార్థం ఏదో వొకటి యివ్వడం ముఖ్యం. కాపీకో కలం యివ్వచ్చు. గొప్ప గొప్ప ఆలోచనలను ప్రజలకు అందిస్తున్న మీ మెదడు మీది కెశాలు రెండేసి చొప్పున యిచ్చినా ?"

నా మాటకి బట్టతల ఒక్కసారి




నిమురుకున్నాడు గర్వంగా వామనరావు.

"ఇంతకు ముందు ఎవరూ యీ ప్రయోగం చెయ్యలేదుకదా!"

"ఉహు" అని తలవూపాను. ప్రయోగం కాదు నిజానికి యిది సాహసం. అయితే ఆ ముక్క ఆయనతో అనలేదు.

"జనం రిసీవ్ చేసుకుంటారంటారా?"

"పుస్తకంతో వుచితంగా యిస్తుంటే, తీసుకోక తప్పేదేముంది వాళ్ళకి "మీ ఫాన్స్ చాలా సంతోషిస్తారు కూడా" అన్నాను ఆలోచనని బలపరుస్తూ—

వామనరావు మనసు కుదుటపడ్డట్టుంది. విలాసంగా నవ్వి లాల్చి జేబులోకి చెయ్యి పోనిచ్చాడు-నాకు భయం అందుకుంది. కవులు జేబులో చెయ్యి పెడితే సర్వసాధారణంగా కరెన్సీ మడత రాదు. కవిత్వపు మడతే వస్తుంది-నేను ఆయన వాలకం గ్రహించి "ఆఫీసు టైం అవుతోంది" అని సణిగాను-

వామనరావు నావంక చూసి కళ్ళలోనే నవ్వారు. ఆ నవ్వులో విలనత్వం తొంగి చూసింది. "నిన్ను చస్తే వదలను" అని శపథం చేస్తున్నట్టుంది ఆ చూపు.

"చూశారా? కవిత్వమే వూపిరిగా జీవించే మనలాంటి వాళ్ళకి ఏం చేద్దామన్నా, ఏం రాద్దామన్నా కవిత్వమే వస్తుంది. ఎందుకు చెప్పొచ్చానంటే పొద్దున మా యింట్లో గుడ్డల పద్దు రాశాను-వినండి అంటూ చీటీ మడత విప్పాడు. నాగుండె గుభేలుమంది-

" గళ్ళలుంగీ ఒకటి
సిల్కు లాల్చిలేదు-ఈ పంకులు
రిపీట్ చేశాడు.

చోళీలు చొక్కాలు
ఆరేసి ఆరేసి-ఇక్కడ మనం
శ్లేష గ్రహించవలె.

పంచెలా-అవి-ఐదు
చీరెలేమో సెవెను-నావంక చూశాడు.
అభిప్రాయంకోసం
అయి వుండవచ్చు.

చెడ్డీలు, బాడీలు
చెరి మూడు మూడు.

పద్దులేవైనా అంతే-మరి మన కొంపలో మా ఇంటావిడ కూరల జాబితా యిచ్చింది చూడండి - ఇంకో మడత విప్పాడు వామనరావు. ప్రాణం వుగ్గ

పట్టుకు కూచున్నాను. సావాసదోషంగా ఆవిడకి పొయిట్రీ అబ్బిందన్నమాట!

వంకాయలు
బెంకాయలు
తోటకూర
కొత్తిమీర
ధరసుబట్టి
పనసపొట్టు
మర్చిపోకు
కర్వేపాకు
దగా దగా
రేటు దగా
సరుకు దగా
రాళ్లు దగా
తస్మాత్! జాగ్రత్త సుమా?

తన్మయుడై చరణాలను పునశ్చరణ చేస్తూ చదివి విన్పించాడు వామనరావు. మడత భద్రంగా జేబులో పెట్టుకుంటూ, కళ్లు వత్తుకున్నాడు వామనరావు. నాకు తొందరగా అయిపోయిందన్న సంతోషం తప్ప ఏ ఫీలింగూ కలగలేదు. కవి నిష్క్రమించాడు. ఆరోజుకి గండం గట్టెక్కింది. వెడతూ వెడుతూ నాకు మరోసారి జ్ఞప్తి చేస్తూ—"ఏమైనా సరే కొత్తఐడియా-మన పొయిట్రీ శాశ్వతంగా వుండేలా ఆలోచించు బ్రదర్" అన్నాడు.

నాలుగురోజుల తర్వాత ఇంకో పెద్ద మనిషిని వెంటపెట్టుకుని వచ్చాడు వామనరావు. నూతనోత్సాహంతో అతని ముఖం వెలిగిపోతోంది.

"నాల్రోజుల్లో మన పని ప్రారంభం అవుతోంది బ్రదర్" అన్నాడు వస్తూనే.

"ఇండియాలోనే వేస్తున్నారా?" అన్నాను.

"లేదు. ఆలోచనే మారింది. మన పొయిట్రీని రాళ్ళమీద చెక్కించడానికి నిర్ణయం జరిగింది. వీరు క్వారీ కంట్రాక్టర్‌గారు" అంటూ పక్కనవున్న పెద్ద మనిషిని పరిచయం చేశాడు.

"బండలమీద చెక్కిస్తే బానే వుంటుంది గానీ, పాఠకులకి దాచుకోడానికి కష్టం అవుతుందేమో" అన్నాను సందేహంగా.

"పాఠకులకి విడి ప్రతుల సమస్య లేదు మన వూరి కొండమీద చెక్కిం చేస్తున్నాను-ఈ మట్టి, ఈ అడివి, ఈ కొండ, ఈ నీరు ఈ గాలి సమస్తం ప్రజలవి. మన కవిత్వమూ అంతే. ప్రజకి అంకితం చేస్తున్నాను. మన అక్షరం శిలాక్షరం అవుతుంది. మన గొంతు కొండల్లో ప్రతిధ్వనిస్తుంది" వామనరావు గంభీరంగా అన్నాడు.

"మీ ఆలోచనకి జోహార్లు. అయితే గుడ్డల పద్దులు, కూరల లిస్టులూ మరీ వ్యక్తిగతంగా వున్నవి యిలా చెక్కిస్తే బావుండదేమో" అన్నాను.

క్వారీ కంట్రాక్టర్ నన్ను గుడ్లురిమి చూశాడు - బిజినెస్‌కి అడ్డువస్తున్నానని. వామనరావు తీవ్రంగా నావంక చూసి "మన కవిత్వం మీరు విన్నది కొద్ది. నేను రాసిందంతా ప్రజలకోసమే రాశాను-నేను ఏం చేసినా ప్రజలకోసమే చేశాను నన్ను శంకిస్తే మార్క్సుని శంకించినట్టే! ఆ సరస్వతీ దేవి మీద ప్రమాణంచేసి చెబుతున్నా-నేను కమిటెడ్ రైటర్ని" అంటూ వామనరావు విసవిసా వెళ్లిపోయాడు. కంట్రాక్టర్ అతన్ని అనుసరించాడు.





ఇందు "నొచ్చు". పాత్రలు

గుమాస్తా
చిరుతపులి
కుంపటి
గ్రాడ్యుయేట్ టోపీ
పందికొక్కు
మొసలి

... ...

తెల్లారక పోతే బావుణ్ణు!

గుమస్తా తెల్లారగట్ల నాలుగ్గం' ల నించీ ఇది నలభయ్యోసారి అనుకోవటం చచ్చినట్టు తెల్లారుతుందని తెలిసి గూడా అలా గొణుక్కుంటూనే వున్నాడు.

తనికెళ్ళ భరణి

# పొయ్యిలో పిల్లి



# కన్సొలేషన్ బహుమతి పొందిన కథ

గోడ గడియారం నిముషాల కప్పల్ని టక్... టకా మింగేస్తోంది! ఛ ళ్ళున తెల్లారింది.

గుమస్తా గుండె ఒక్క క్షణం ఆగి మళ్ళీ కొట్టుకోవటం ప్రారంభించింది వాళ్ళంతా జ్వరం వొచ్చేసినట్టు వొచ్చేస్తుంది! చిరతపులి అవును ఇవాళ ఆఖరి రోజు-ఇవాళ తెల్లారేసరికి మూడు వందలూ వడ్డీతో సహా కట్టకపోతే చిరతపులి కర్ కరా కర్ కర కరా నమలి పారేస్తుంది!

దుప్పటి మొహంమీదకి లక్కుని వొణికి పోతున్నాడు గుమస్తా పెళ్ళాం లేచింది పెద్ద కడవుతో పసుపు కొమ్ముని కళ్ళకద్దుకుంది. గబగబా వాకిలి వూడ్చి వేస్నీళ్ళు చల్లి. స్టౌ వెలిగించి కాఫీనీళ్ళు పడేసింది

పక్కన పొయ్యిలో పిల్లి!

అది వారంరోజులుగా అక్కడే తిష్ట వేసింది. కుంపటి లేచింది (ఈవిడ గుమస్తాగారి కూతురు) రాత్రంతా తల కింద నలిగిపోయిన ప్రేమ నవలని ఎవరూ చూడకుండా సొరుగులోకి తోసేసి బొగ్గు ముక్కని బుగ్గనెట్టుకుని పెరట్లోకి వెళ్ళింది.

గ్రాడ్యుయేట్ టోపీ (గుమస్తాగారి పుత్రుడు) బొంత కింద కలలు నేస్తున్నాడు ఉద్యోగం.. మొదటి జీతం మందుపార్టీ. స్కూటర్ వెనక్కాల అమ్మాయి...అమ్మాయి...మెడ మీద నల్లి కుట్టింది.

కలల పట్టు కుచ్చులన్నీ.... అలా ... అలా గాల్లో తేలిపోయాయ్.... మళ్ళీ రాత్రి కళ్ళల్లో గానీ తేలవ్!....

గుమస్తా మెల్లిగా లేచాడు....

మొహం చెక్కతో చేసినట్టుంది.... కళ్ళు గాజుగోళాల్లా వుంటాయ్. కళ్ళ వెనక్కాల గ్యాలన్లకొద్దీ కన్నీరు!.... పెదాల మీద నవ్వు తెంపేసుకుని కొన్నేళ్ళయింది. అందుకే ఎప్పుడైనా నవ్వుదామని ప్రయత్నించినా నవ్వు రాదు .. వచ్చినా అది నవ్వు కాదు! వొచ్చేస్తుంది ఇంకో గంటలో అవును వొచ్చేస్తుంది చి ర త పు . లి!.

"కాఫీ!" అంది .. భార్య ఖారంగా.

గుమస్తాకి "అమృతం" అన్నట్టు వినిపించి చెయ్యిజాపాడు ఇత్తడి గ్లాసులో గోధుమరంగు కాఫీ దాన్నిండా నల్లని పంచదార పసుప్పచ్చ రేషన్ కార్డు రెండు కిలోమీటర్ల పొడుగు క్యూ తన నెత్తురు కళ్ళు మూసుకో!

అంతా అంధకారం ఎంత బావుందో ఏమీ తెలీటేదు వెచ్చటి కాఫీ గొంతులోకి పోతోంటే భలే బావుంది .

గుమస్తా తన్మయత్వంలో వున్నాడు ..

ఏవీ వినపట్టంలేదు .. ఏమీ కనవట్టం లేదు.

బాత్ రూమ్‌లో బూతుపాట! పైకి వినపడకుండా గుండెల్లో గట్టిగా పాడేసుకుంటో కళ్ళు మూసుకుని నీళ్ళోస్కుంటోంది కుంపటి కమ్మటి కలలు .. ముద్దులు. కావలింతలు, సెక్సూ అన్నీ

సబ్బునురగతో కలసి మోరిలోకి పోతు
న్నాయ్ ....

ఎంత చక్కటి వొళ్ళు తనది ఎంత పెద్ద కళ్ళు తనవి. ఎంత మంది చూస్తుంటారు తన్ను. కానీ ఒక్క వెధవా పెళ్ళి చేసుకోడేం. ప్రతీవాడు ముట్టుకుంటాననేవాడేగానీ కట్టుకుంటాననేవాడేడీ! ... తన అందం తన వయసు .... అంతా ఇలా కరిగి .. కరిగి పోవల్సిందేనా

గ్రాట్సుయేట్ టోపీ లేచాడు ... ఒవలించి బైటకొచ్చి ఎండలో కూర్చున్నడు వేళ్ళని వెచ్చటి ఇసకలో పొనిపి ఆలోచిస్తున్నాడు వాడి మొహం అచ్చం. నలిగిపోయిన ఎంప్లాయిమెంటు కార్డులాగుంది.

వాడినవ్వు అచ్చం వెర్రాడి నవ్వులా వుంది!

ఇంటిల్లాలు స్నానంజేసి పూజ్జేసుకుంటోంది.... (వొంట ఎలాగా చెయ్యేద్దు గనక).

అక్కడ ఎంత మంది దేవుళ్ళు

చాలా వెరైటీ దేవుళ్ళు

దైవాంశ గలవాళ్ళమనుకునేవాళ్ళు...

అందరి మొహాలమీదా ఎర్రగా కుంకం

డేంజర్ డేంజర్ని, సూచిస్తోన్నట్టు.

గుమస్తా గుండెల్లో ముక్కోటి (లేటెస్ట్ స్టాటిస్టిక్స్ ప్రకారం ఎంతమందో వాడికి తెలిదు) దేవతలకీ....శతకోటి నమస్కారాలు పారేస్తున్నాడు-

బాబూ చిరతపులిని రాకండా చెయ్యండి!

ఏదేవుడూ రెస్పాన్సివ్వలేదు!

ఏదో జంతువొస్తున్న శబ్దం!...గుర్.. కర్ కర్ అంటో .. గుమస్తాగుండె గిలగిలా గిల్‌గిలా కొట్టుకుంటోంది!

వొచ్చేసింది చీటా .... చీటా వొచ్చేసింది .. తనని తినేస్తుంది ! .. బాబోయ్ రక్షించండి!

గజేంద్ర మోక్షంలో ఏనుక్కన్నా గొప్పగా గట్టిగా బాధగా . కసిగా అరిచాడు

అల వైకుంఠ పురంబులో ఏ మూల సౌధంబో తెలీక ఆ కేక వెతుక్కుంటోంది .

అంతా నిశ్శబ్దం వూపిరి పీల్చని మౌనం!

వొచ్చింది! చిరత పులి కాదు! పందికొక్కు

"ఏవయ్యా ఇంటద్దె కట్టి ఎన్ని రోజులయిందిరా " (దానికి వ్యాకరణంరాదు)

పందికొక్కు అరుస్తోంది!

గుమస్తా నరాల్లో రక్తం స్థంభించింది!

కడుపులో పిండం గిర . గిరా. .. తిరుగుతోంది!

కుంపటి జడేసుకుంటోంది

టోపీ... గడ్డం గోక్కుంటున్నాడు

కడుపు తల్లి - తరుక్కుపోయేలా ఏడుస్తోంది .

పందికొక్కు అరుస్తోనేవుంది

"సాయంత్రం లోపల అద్దెకట్టే సరే లేదా .. (కలుగు) ఖాళీ చెయ్యండి" అని పెంకులు ఎగిరేలా అరిచాడు...

ఇంటికప్పు మీదున్న రెండుపెంకులూ

తాలి కింద పడ్డాయి....

కుంపటికేసి వోరగా .... టోపీకేసి కోరగా చూసి—

రయ్! న వెళ్ళిపోయింది పంది కొక్కు....

పొయ్యిలో పిల్లి .... మూత్తుడుచు కుంది!

గుమస్తా హాపీగా ఫీలయ్యాడు.... అ మ్మ య్య!....ఎ ం త రి లీ ఫ్.... సాయంత్రానికొద్దా....చూద్దాం....

కుంపటికేసి చూశాడు గుమస్తా!

కన్నెగంపలో కుంపటి....

'ఏమిసేతుర్రాలింగా....ఏమీసేతూ...'

రేడియో....గోలెడ్తోంది పాపం!....

"అమ్మా కాలేజీకి టైమయ్యిందే" కుంపటి కేక.

"అంతారండి వొడ్డించేస్తాను" (అల వాటు ప్రకారం అనేసి నాలిరుక్కొక్కుంది ఇల్లాలు).

"ఏం వొడ్డించనూ .... పా పి ష్టి దాన్ని .... కట్టుకున్న మొగుడికీ కన్న పిల్లలకీ కడుపునిండా ఇంత తిండి కూ డా పెట్టుకోలేక పోతున్నాను ...." కొంగు అంచులు కన్నీళ్ల కారుస్తున్నాయి. ఒక్కసారి కుయ జూసిండి కొంపని.

అంతా పాడుబడ్డ గుడిలావుంది.... గిన్నెలనిండా దుమ్ము. గూట్లో పూజా పునస్కారంలేని దేవుడి విగ్రహంలా పూరగాయ జాడీ!....

పొయ్యిలో మెరుస్తున్న కళ్ళతో పిల్లి!

"సరే నేను కాలేజీ కెళ్తున్నా...." కుంపటి బయల్దేరింది. నిజానికి కుంపటికి ఆకలి వేయట్లేదు....ఎందుకంటే బైటకు రాగానే ఒక్కసారి కళ్ళు మూసుకుంటుంది....

కలల్లో....పూలపడవల్లో.... ప్రియుడి వాళ్ళో

## రచయిత పరిచయం



అలవాట్లు : 'గులాబీ అత్తరు'వంటి కథలు చదవటం, 'కొయ్యగుర్రం' వంటి పొయిట్రీ చదవటం, 'బాపు' బొమ్మల్ని (అమ్మాయిలు (పుంజే)) చూట్టం, నాటకాలు (స్టేజిమీదే) ఆట్టం.

దురలవాట్లు : తెలుగు సినిమాలు 'ఎక్కువగా' చూట్టం, అన్నిపనులూ ఆఖరిక్షణంలోనే చైటం, భారతదేశం 'ప్రజాస్వామ్యం' అని నమ్మడం, ఆ విషయాన్ని సాహిత్యంలో 'కుమ్మడం'.

అంకితం : రాయని భాస్కరులకి....

**-తనికెళ్ళ భరణి**

# చేతివృత్తులవారికి చేయూత

ఆంధ్రప్రదేశ్‌లో తయారయ్యే బిద్రీ వస్తువులు, నిర్మల్ పెయింట్లు, కొండపల్లి బొమ్మలు, కలంకారి, క్రొచెట్ లేసులు, ఇత్తడి వస్తువులు, అత్తరులు, రాళ్ళు పొదిగిన గాజులు వంటి చేతి వృత్తులకు ఒక ప్రత్యేక స్థానమున్నది

ఈ చేతి వృత్తులపై ఆధారపడి సుమారు 65,000 మంది జీవిస్తున్నారు రాష్ట్రంలో చేతి వృత్తులను ప్రోత్సహించేందుకోసం రూ. 2 కోట్ల పెట్టుబడితో చేతి వృత్తుల అభివృద్ధి సంస్థను ఏర్పాటు చేశారు చేతి వృత్తులు అభివృద్ధి పరిచేందుకు శిక్షణ, పరిశోధన, డిజైనింగు, మార్కెట్ సౌకర్యాలు వంటి అవసరాలు తీర్చేందుకు ఈ సంస్థ దోహదకారిగా ఉన్నది

రాష్ట్రంలో చేతి వృత్తులపై ఆధారపడి జీవించేవారి ప్రయోజనం కోసం బృహత్తర కార్యక్రమాలు రూపొందిస్తున్నారు ప్రతి పంచాయతి సమితిలోనూ చేతి వృత్తుల సముదాయాన్ని ఏర్పాటు చేస్తారు వీరి శిక్షణ, వస్తువుల తయారీ అవసరాలను ఈసముదాయాలు తీరుస్తాయి వీటితో పాటు, గ్రామీణ చేతి వృత్తుల వారికి నివాసంగాను, కార్యస్థానాలుగాను ఉండే భవనాలను ఎంపిక చేసిన గ్రామాలలో నిర్మిస్తారు. తగిన యంత్ర సౌకర్యాలతో సాముహిక సౌకర్య కేంద్రాలు ఏర్పరిచి, వీరికి ఆధునిక పరికరాలు సమకూరుస్తారు

చేతి వృత్తులవారికోసం ప్రత్యేకంగా ప్రతి జిల్లాకు కనీసం ఒక చిన్న పారిశ్రామిక వాడను ఏర్పాటు చేస్తారు

* పీచుతో వస్తువులు తయారు చేయడంలో సుమారు 800 మందికి శిక్షణ ఇస్తారు. తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, శ్రీకాకుళం జిల్లాలలో 21 సహకార సంఘాలు ఇందుకోసం ఏర్పాటు చేస్తారు. రాష్ట్రంలో పీచుతో రూ. 470 లక్షల విలువ చేసే వస్తువులు తయారవుతాయని అంచనా.

* రాష్ట్రంలో ప్రస్తుతం మొత్తం రూ. 5582 లక్షల పెట్టుబడితో 37,301 చేతివృత్తుల యూనిట్లు 71,298 మంది వ్యక్తులకు ఉపాధి కల్పిస్తున్నాయి.

* గత రెండు దశాబ్దాలుగా ఖాదీ గ్రామీణ పరిశ్రమల మండలి 60,000 మందికి పైగా గ్రామీణ చేతివృత్తులవారికి సహాయం అందజేసింది. గ్రామాల దత్తత పథకం క్రింద ఈ సంస్థ 149 గ్రామాలను దత్తత తీసుకుని, బ్యాంకులకు ఇచ్చిన మొత్తంతో సహా రూ. 34 లక్షల మొత్తాన్ని 316 మంది చేతివృత్తులవారికి సహాయం అందజేసింది.

* నబ్బులు, పేము, తాళ్లు, పీచు మొదలైన వాటితో వస్తువులను తయారు చేయడం ద్వారా 300 యూనిట్లలో 2,400 మందికి ఉపాధి కల్పించాలని తలపెట్టారు.

* చేతి వృత్తులు, గ్రామీణ పరిశ్రమలు అభివృద్ధి పరిచేందుకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చేయూత నిస్తున్నది.

సమాచార, పౌరసంబంధశాఖ డైరెక్టరుచే ప్రకటితము, హైదరాబాదు

డి. ఐ. పి. ఆర్. 5

వెన్నెల తింటో... తేనె తాగుతో
మెల్లిగా వూగుతో వెళ్ళింది కాలేజికి.

(పాపం! జాకెట్టు వెనకాల చిరుగుందనీ దానికి కొన్ని వందల కళ్ళు అతుక్కున్నాయనీ తెలీని పిచ్చిపిల్ల)

గుమస్తాకి దడ కొంచెం తగ్గింది!

అమ్మయ్య ఓరతపురి ఇవాళ రాలేదు.

బహుశా రేపొస్తుందేమో ..రేపుగదా..

ఇంకా ఒఖ్ఖరోజు టైముంది

టింగ్.. టింగ్ ఫలానా వారి సమయం.

"వొస్తానే ఆఫీసుకి వెళయింది"

వీపుమీద ఫైళ్ళు కట్టుకున్నాడు ఎర్రటి ఫైళ్ళు. అర్జెంట్ ఫైళ్ళు. ఫైళ్ళనిండా ఆలస్యం వాసన. ఫైళ్ళ మధ్య ఎంతమందో రక్తెగయినగుమస్తాల గుండెలు...గుండు సూదుల్లా గుచ్చుపట్టి.

మెల్లిగా కదిలాడు గుమస్తా.

ఎదురుగుండా ఖాళీ అరచేత్తో నల్ల టోపీ!

"ఏవిట్రా"

"ఏదో లీవ్ వేకెన్సీ వుందిట... బస్సుకి డబ్బులు" జేబులోంచి రెండు బిళ్ళలు తీసి నల్లటోపి చేతిలో పెట్టాడు.

(ఆ డబ్బుతో బస్సెక్కనివ్వరు. ఎం చేతంటే మళ్ళీ ఇవ్వాడే రేట్లుపెంచిగారు)

బైట పడ్డాడు గుమస్తా.

ఒక నరకంలోంచి మరో నరకానికి ప్రయాణం - పగిలిన కళ్ళద్దాంలోంచి పరిగెత్తుతున్న ప్రపంచాన్ని పరికిస్తున్నాడు. ఏం హడావిడీ!... కొంపలు మునిగిపోతునట్టు, తగలడిపోతున్నట్టు... ఃదండి తోసుకుపదండి ముందుకు... దాంపో.. . దాంపో. పై... పైకి రేకు ఏనుగుల్లాంటి బస్సులనిండా వెలగవళ్ళ తలకాయల్లో జనం.. గవిడి గేదెల్లాంటి మోటారు సైకిళ్లు. . జనప్రవాహం... ఎలా పుట్టుకొస్తున్నారబ్బా. ఇంతమంది జనం!

దరిద్రులకి పిల్లలెక్కువ గావాల్ను నాకు మల్లే. . కడుపునిండా తిండెల్లాగా తినలేక పోతున్నాం... కనీసం కరువు దీరా పిల్లల్నైనా కందాం...

స్టాప్ కుటుంబ నియంత్రణ బోర్డు.

మంత్రిగారి సందేశం. మినిష్టర్లు కనొచ్చు. ఎందుకంటే మళ్ళీ సంతానం లేకపోతే ఆ సీటు వేరేవాడు కొట్టేస్తే అమ్మో! ... మంత్రులారా అంతా ఏకంగా కనుడు.. నడుస్తున్నాడు గుమస్తా.

కడుపులో సెగలు. ఎలకలు.. .

ఇంట్లో పొయ్యిలో.. పిల్లి

ఆహా! ఏం పరిమళం మళయాళీ హోటల్లోంచి మలబారీ ఊదొత్తుల పరిమళం కలిసిన మళయాళీ పాట.. ఆహా! ఏం పరిమళిస్తోంది పాట కాఫీ తాగుతేనో ..'o డబ్బు వేస్ట్. . (లేవుగా) పర్లే .టైమవుతోంది.. పరిగెత్తరా.. . బాబూ. ..

మణి అయ్యర్ కిళ్ళీ బడ్డీలో వేలాడదీయబడ్డ 'ఆనంద వికటన్' పుస్తకాల వెనక్కాల అడ్డబొట్టుతో అడ్డపంచెతో 'వణక్కం సామీ' అంటోన్న మణి అయ్యర్ మనవడు... ఏ మి భా షా భి మానమో వాళ్ళకి.

ఒక్క చవక రకం సిగరెట్ కొనుక్కున్నాడు గుమస్తా.. .అంటించుకో

# శుభ్రమైన తాజా శ్వాస...
# ఆరోగ్యంవిందే గట్టి పళ్ళు



## కోల్గేట్
### డెంటల్ క్రీమ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుంటే, కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో అతుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని శక్తిగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది



ఫలితం ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ

**కోల్గేట్‌లోని తాజా మింట్ రుచివలన బ్రష్ చేసుకుంటున్నప్పుడు ఎంతో హాయి.**

## నోటి దుర్వాసనను ఆపండి... కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో దంతక్షయాన్ని ఎదుర్కోండి!




DE.G 74 TL

డానికి అటూ ఇటూ చూస్తే .. నోట కప్పకరుచుకుని స్తంభానికి తలకిందులుగా వేలాడుతున్న పాములాటి కొబ్బరి తాడు- సిగరెట్ తల తగలడింది! ...

గుఫ్. .! గుఫ్! ఖగపతి అమృతము తేగా..బుగ భుగభుగమని పొంగి. ఆహా! సిగరెట్ కాల్చటంలోని మజా ఇన్నాళ్ళకి బోధ పడిందోయ్ గిరీశం ఊఁ.. .ప్రైమ్ అవుతోంది! .

"వెధవది అయిన లేటు ఎల్లాగా అయింది....కనీసం సిగరెట్టన్నా తృప్తిగా కాల్చుకుని పోతేనేం!"

ఓహ్! . రంగు రంగుల అమ్మాయిలు....నెమళ్ళంటి అమ్మాయిలు.. కుందేళ్ళంటి అమ్మాయిలు జింకలంటి అమ్మాయిలు వాటి వెనక్కాల .... నక్కలు... కుక్కలు తోడేళ్ళు..భ భ దొంగవెధవలు..వెకిలిచూపులూ పీళ్ళూను. ... కానీ ఆ అమ్మాయి ఎంత ముద్దొస్తోంది!... తప్పు... తప్పు!. ఈవయస్సులో నా కూతుర్ని ఎవడైనా ఇల్లా చూస్తే . అహ! వాడు చూసినా. . నా కూతురు చూస్తుందా

అదేం పద్యం? త్రిపురాంతక దేవుడి దేనా!

చూసిన చూడ డుత్తముడు
చూసిన చూచును మధ్యముండు
తా చూసిన చూడకున్నను చూచు
కనిష్టుడ .

బ్యూటిఫుల్ .. ప్రాంచద్భూవణ బాహుమూల రుచితో . ఏం రుచి ఈ తెలుగు పద్యాల్లో. ..పద్యంతో కలిపి పొగ పీలుస్తూ క్షణికానందాన్ని అనుభవిస్తున్నాడు గుమస్తా. ..

అదిగో! దూరంగా....క్షరానీ హోటల్‌లో .. టీకప్పు వెనక్కాల చూపుల్ని గుమస్తాకేసి గురిచూసి చిరతపులి! . మూతి ముడుచుకుంది!

ఒళ్ళు విరుచుకుంది . .మె...ల్లి...గ అడుగులో అడుగు

రపా! . .పట్టేసింది గుమస్తాని..

గిజగిజ . గిలగిల !

సిగరెట్టుపొగ ఊపిరితిత్తుల్లో గడ్డ కట్టేసింది .

కళ్ళనిండా నెత్తురుతో కూడిన భయం చిమ్మింది.

నాలిక తెగిపోయి జారిపోయి ఎక్కడో కడుపులోయలో ఎక్కడో పడిపోయింది .

చిరతపులి కళ్ళు దివిటీల్లా వెలుగతున్నాయ్!

గుమస్తా జుట్టు చిరతపులినోట్లో

"ఇంటికొస్తే ఇంట్లో వుండవ్... ఆఫీసుకొస్తే ఆఫీసులో వుండవ్ . నాకే ధోకా ఇద్దామనుకున్నావ్..

తే . ధ్బబుతే! మాట్లాడవేమిటి?"

కొడవలి లాంటి కొశ్చన్ మార్కు!

గుమస్తా పొట్టలో నాలిక మెల్లిగ పాక్కుంటూ వొచ్చి నోట్లో ఆగింది...

"సాయంత్రం... ఇస్తా"

"ఓసారి పొద్దున్నంటావ్.. ఓసారి సాయంత్రంఅంటావ్తమాషాగావుందా?"

"ఒట్టు సాయంత్రం తప్పకుండా..."

గుమస్తా చేతులు చిరతపులి కాళ్ళకింద!.

సాయంత్రానికి నీ పెళ్ళాంవి.. ... అయినాసరే నా డబ్బు నాకివ్వాలి.. "

ఎంతమాట ...ఎంతమాటన్నాడు ...

తన రక్తం పొంగదే? తనలో






అస్సలు రియాక్షన్‌లేదే..

కోపంకూడాలేదు . ఒక్కటేవుంది. నరనరాల్లో

కన్నీళ్ళు ..శాఫ్ ఏడుపు. .

అర్థమయిందా?

తలూపేసాడు ఎద్దులాగ గమస్తా!

ఒక్కసారి గట్టిగా అరిచి దర్జాగా పొదల్లోకి వెళ్ళిపోయింది చిరుతపులి.

ఒక చిన్న నిట్టూర్పు కొంచెం మన శ్శాంతి అప్పలాడికీ అప్పలాడికీ మధ్య....

ఆఫీసుకి పరుగెత్తాడు గుమస్తా!

అయిదు నిమిషాలు తక్కువ పన్నెండయింది ..ఆఫీస్! మొగస్టాఫంతా కాంటీన్‌లో పేకాడుకుంటున్నారు.

రిజిస్టర్! ...లోపలికెళ్ళిపోయింది . .

మడుగు మధ్య పెద్ద టేబుల్‌మీద మొసలి నోట్లో పైపుతో....

"ఏవిటింత లేటు?" పళ్ళమధ్య ఇరుక్కున్న పచ్చి మాంసంముక్కల్ని టూత్‌పిక్‌తో షోగ్గా తీసుకుంటూ అడిగింది మొసలి.

పరమ పాతకథ చెప్పాడు గుమస్తా.

మొసలి పెదగా ఆవలించి. . కొన్ని బూతులు తిట్టి కొత్త ఫైళ్ళకట్ట అందించి .. "గెటౌట్" అంది నిద్రకుపక్రమిస్తూ .

గుమస్తా తన సీటు దగ్గరికొచ్చాడు.

గబగబా బుర్ర పగలగొట్టుకున్నాడు.. మెదడు తీసి ఫైళ్ళ నిండా పూయడం ప్రారంభించాడు. ఏదీ తోచట్లేదు.... ఎలాగ-సాయంత్రానికి డబ్బెలాగ... సాయంత్రం అవ్వకపోతే బావుణ్ను.. సాయంత్రం అవ్వకపోతే బావుణ్ను..

సాయంత్రం అయింది!

గబగబా బైటపడ్డాడు...రెండ్రూపాయ

లప్పుచేశాడు.

"ఎలకల మందెంత?"

"ఇంత!"

"ఇవ్వండి"

జాగ్రత్తగా..అమృతాన్ని కొన్నట్టు.. జేబులో పెట్టుకున్నాడు. ఇంటికొచ్చాడు.

"ఏమే! కాఫీ కలుపు"

"పంచదార లేదు"

"పక్కింటివాళ్ళ దగ్గిర బదులు చేస్తే"

"ఇప్పటికే వాళ్ళకి బోల్డు ఇవ్వాలి"

"రేపిచ్చేద్దాం"

"రేపా? ఏం బోనసొస్తోందా"

"రేపట్నుంచీ మన పొజిషనే మారి పోతుంది"

"ఆ....ఆనందం అప్పు...,ఆనం దం .. కాఫీ

"ఇదిగో ఆ చేత్తోటే బియ్యంగూడా అడుగు"

సాయంత్రం అయిపోయింది

చిరతపులి రాలేదు!

రాదా! ..రాత్రొస్తుందేమో....రాదేమో రాదేమో ఇంక .

ఎలకల మందుని అన్నంలో కలిపే సాడు గుమస్తా.

అంతే. . అంతే అందరూ....కడుపు నిండా తిన్నారు—

అంతా పడుకున్నారు.

గుమస్తాకి నిద్రట్టల్లేదు.... ఎందుకు వెధవ బతుకు...

కానీ...అదేదో తనొక్కడే అంటే బావుండేది—

కట్టుకున్న పెళ్ళానికి...కన్నబిడ్డలకి.. విషం పెట్టాడు తను . ఛీ.ఛీ..

ఎక్కడ పుట్టానో ఎక్కడ పెరిగానో . ఇలా ఇక్కడ అప్పులమధ్య విషం మింగి.. అసలు తను పెళ్లెందుకు చేసుకున్నట్టు...పోనీ పెళ్ళి పర్లేదు..పిల్లలెందుకూ

పెళ్ళాన్ని చూస్తే జాలేస్తోంది....రేపు తీసుకురాబోయే బోనస్‌కోసం అప్పుడే కలల్లో ఏవేం కొనాలో లిస్టు రాస్తోంది.

తన కూతురు పెళ్ళి ఇంక భయం లేదు

కొడుక్కి ఉద్యోగం నో ప్రోబ్లమ్..

వొణుకు .. వొణుకు..దడ..భయం...

కళ్ళవెంట నీళ్లు..నరాలు మెలికలు తిరిగిపోతున్నాయ్..బుర్ర పేలిపోతోంది. వొళ్లు చల్లబడిపోతోంది...ఊపిరి ఆడట్లేదు..గుండె మెల్లగా కొట్టుకోడం ...ఆ శబ్దం .వినిపించటంలేదు,....గుమస్తా... నిద్ర..పోయాడు. పొయ్యిలో పిల్లి!!

ం ం ం

తెల్లారింది

తలుపు శబ్దం!.. తలుపవతల....తలుపవతల....

గుమస్తా లేచాడు...

చిరతపులి!

"నాన్నా పొయ్యిలో పిల్లి (మాత్రం) చచ్చింది!"

......

స్మశాన ప్రపంచంలో ఈ శవాలు మహా మామూలుగా నడుస్తూనేవున్నాయి - కొత్త పిల్లి పాత పొయ్యిలో మళ్ళీ ఆవులిస్తూనే వుంది!! ✻

మినీ కథ

# సుబ్బారావు-కుక్కపిల్ల

ఆఫీసరుగారి గదిలోకి భయం భయంగా అడుగుపెట్టిన సుబ్బారావు "పిలిచారా!" అన్నాడు భయంగానే. "ఆఁ. రావోయ్! రాకూర్చో" ఆఫీసరుగారి మర్యాదకు ఆశ్చర్యపోయాడు సుబ్బారావు. ఆ రోజు అరగంట ఆలస్యంగా వచ్చినందుకు పిలిపించాడేమోనని భయం భయంగా వస్తే, చిరునవ్వుతో ఆహ్వానిస్తున్న ఆఫీసరుగారిని చూచేసరికి అది కలయో వైష్ణవ మాయయో అనిపించిందతనికి.

"ఏమోయ్ సుబ్బారావ్! నీకు కుక్కపిల్లలంటే ఇష్టమేనా?" సుబ్బారావుకి ఏం సమాధానం చెప్పాలో తోచలేదు. ఆఫీసరుగారు ఏ వుద్దేశ్యంతో అడుగుతున్నారో! ఇష్టమేనంటే ఒక తప్పు, కాదంటే ఒక తప్పు. ఏం చెప్పాలో తోచేలోగానే ఆఫీసరుగారు మళ్ళీ అందుకున్నారు. "ఏం లేదోయ్! మా కుక్క ఆరు పిల్లల్ని పెట్టింది. అవన్నీ నాకనవసరం. అందుకని మన స్టాఫ్‌కి వాటిని ఇవ్వదలిచాను. ఇష్టమైతే నీక్కూడా ఇద్దామని అంతే"

సుబ్బారావు గుండెల్లో పిడుగు పడినట్టయింది. ఉన్న పిల్లలతోనే వేగలేక ఛస్తుంటే ఇదొకటి కూడానా! పోనీ ఇష్టంలేదని చెప్పేస్తే ఫ్యూచర్ ఏమయిపోతుందో! కళ్ళముందు ఒక్కసారి తన కుటుంబ పరిస్థితి కదలాడినా, ఆఫీసరుగారిని చూసేసరికి మొహమాట పడిపోయాడు సుబ్బారావు. ఆరోజే అతనింట్లో మరోపిల్ల చోటుచేసుకుంది.

సుబ్బారావు కుక్కపిల్లతో యమయాతన పడిపోతున్నాడు. చూడ్డానికి అందంగానేవుంది—కానీ బుద్ధులే బజారుపాలయ్యాయి. అడ్డమైనవీ తినివచ్చి అన్నింటిలోనూ మూతి పెడుతుంటే చూస్తూ వూరుకోలేక ఏమీ చెయ్యలేకపోతున్నాడు. కుక్కను చూస్తాను తీసుకరమ్మని ఆఫీసరుగారు ఏక్షణాన అంటారోనని ఇష్టంలేకపోయినా దానిని తన పిల్లలకంటే మిన్నగా చూసుకుంటున్నాడు. అయినా దాన్ని పెంచడం అతనికి చేతకాలేదు. అసలే చాదస్తుడు. అందులోనూ మధ్యతరగతి కుటుంబీకుడు. అతని దగ్గర మాంసం ముక్కలెలా దొరుకుతాయి. కుక్కపిల్ల రోజురోజుకీ చిక్కిపోసాగింది. దాని నీరసం చూస్తుంటే సుబ్బారావుకీ నీరసం వచ్చేసింది.

సుబ్బారావు ఊహించినట్లే ఉన్నట్టుండి ఒకరోజు ఆఫీసరుగారు కుక్కపిల్లను చూడాలి తీసుకురమ్మన్నారు. సుబ్బారావు గొంతులో పచ్చివెలక్కాయ పడినట్లయింది. బక్కచిక్కిపోయిన కుక్కపిల్లను చూసి ఆఫీసరుగారేమంటారోననే బెంగతో బాధపడిపోయాడు. సుబ్బారావు భార్య అతని పరిస్థితికి జాలిపడి ధైర్యం చెప్పింది.

బలిజేపల్లి




హఠాత్తుగా ఆఫీసరుగారు ఊరువెళ్ళవలసి రావడంతో ఆ రోజుకి సుబ్బారావు గండం గట్టెక్కింది, వారం రోజుల తర్వాత ఆఫీసరుగారు మళ్ళీ కుక్క ప్రస్తావన తెచ్చారు. ఈ సారి సుబ్బారావు గొంతులో పచ్చివెలక్కాయ బదులు పంచదార పాకం పడింది. భార్య చెప్పిన సలహా అతనికి ఏనుగంత బలాన్నిచ్చింది. ఈ దెబ్బతో కుక్కకీ, తనకీ రుణం తీరిపోతుందనుకున్నాడు. సంతోషంతో యీల వేసుకుంటూ కుక్కపిల్లతో ఆఫీసరుగారింటికి వెళ్ళాడు.

"ఏమిటోయ్ సుబ్బారావ్! తెనాలి రామలింగడి పిల్లిపిల్లలా తయారుచేశావ్ కుక్కపిల్లని!"

"లేదుసార్! మొన్నటిదాకా బాగా బలంగానే వుండేది. మొన్నటిరోజు మీ దగ్గరకి తీసుకు వస్తానని చెప్తే చెంగుచెంగున గంతులు కూడా వేసింది సార్! కానీ ఆ తర్వాత మీరు లేకపోవడంవల్ల తీసుకు రావడం మానేస్తే బెంగతో ఇలా అయిపోయిందిసార్! మీరంటే దీనికెంత విశ్వాసమో చూడండి సార్!" అన్నాడు సుబ్బారావు తనలో తాను సంబరపడిపోతూ.

"అలాగటోయ్! నీ మాటలు అర్థం చేసుకునేలా పెంచావన్నమాట. నాకు తెలుసు సుబ్బారావ్ నువ్వంతటి సమర్థుడవని! వెధవది ఇన్ని కుక్కల్ని పెంచాను కానీ ఒక్క దానికీ అర్థంచేసుకునే ట్రయినింగు ఇవ్వలేకపోయాను. అందుకే ఇది నా దగ్గరకంటే నీ దగ్గరే బాగావుంటుంది. తీసుకుపో" తనంటే అంతటి విశ్వాసమున్న కుక్కపిల్లని తనకే వదిలేసి వెళ్ళమంటారనుకున్న ఆఫీసరుగారి మాటలు వినేసరికి అవాక్కయిపోయాడు పాపం! సుబ్బారావు. ★

# "శ్రమయేవ జయతే"

నిజాయితీ, కఠోర పరిశ్రమ, స్థిర సంకల్పం ద్వారా అధికోత్పత్తి సాధన - రిపబ్లిక్ దినోత్సవాన మన విజ్ఞప్తి.

జాతికి శంఖారావం వినిపించింది. క్రమశిక్షణ, కఠోర పరిశ్రమకు పునరంకితమయ్యే తరుణం వచ్చింది. న్యాయసమ్మతమైన సమసమాజాన్ని ఏర్పాటు చేసేందుకు ఏకైక మార్గాన్ని సూచిస్తూ ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ మనల్ని చైతన్యవంతుల్ని చేసే సందేశం ఇచ్చారు.

కఠోర పరిశ్రమ, సత్యాన్వేషణకు దీక్షతో పాటుపడడం ద్వారానే గౌరవం, ప్రగతి, సౌభాగ్యాలను సాధించగలం అన్నదే ఆమె సందేశం. ఉత్పత్తి పెరుగుదల, సంక్షేమ పథకాల విస్తరణ ద్వారా బలహీన వర్గాల సమగ్రాభివృద్ధి సాధించగలమనే విషయాన్ని ప్రధాని నూతన కార్యక్రమం స్పష్టీకరిస్తున్నది.

మన రాష్ట్రంలో ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్యగారి నాయకత్వంలో షెడ్యూల్డు కులాలు, తెగలు, వెనుకబడిన తరగతులు, మహిళలు, బాలలు వంటి బలహీన వర్గాల ప్రజలకు మన అభివృద్ధి ఫలితాలు అందజేసేవిధంగా వివిధ పథకాలు ముమ్మరంగా అమలు జరుగుతున్నాయి.

- సాంఘిక సంక్షేమ పథకాలకు బడ్జెట్ కేటాయింపు 1977-78 నుండి ఇటీవరకు రు 2 57 కోట్ల నుండి రు. 78.12 కోట్లకు (నాలుగురెట్లు) పెరిగింది.
- 14 లక్షల కుటుంబాలకు ఇళ్ల స్థలాలు సమకూర్చారు ప్రస్తుత సంవత్సరంలో మరో 1.05 లక్షల కుటుంబాలకు ఇళ్ల స్థలాలు సమకూరుస్తారు.
- షెడ్యూల్డు కులాల వారికోసం ఒక ప్రత్యేకత అనుబంధ ప్రణాళిక అమలు జరుగుతున్నది. ఈ అనుబంధ ప్రణాళిక క్రింద ఖర్చుచేసేందుకు 1980-81లో రు 42.80 కోట్లు, 1981-82లో రు 50 కోట్లు కేటాయించారు. 1982-83 సంవత్సరంలో రు 89.37 కోట్లు కేటాయించాలని తలపెట్టారు.
- షెడ్యూల్డు కులాలు ఆర్థిక సహాయ సంస్థ ప్రస్తుత సంవత్సరంలో 1 19 లక్షల మంది దారిద్ర్యరేఖను దాటేందుకు వీలుగా వివిధ పథకాలు చేపట్టింది.
- మెట్రిక్ అనంతర చదువుల కోసం స్కాలర్‌షిప్పులు పొందే షెడ్యూల్డు కులాల విద్యార్థుల సంఖ్య 977-78లో వున్న 27 533 నుండి 19 0-81లో 54,100కు పెరిగింది.
- ఎక్కువ మంది విద్యార్థులు స్కాలర్‌షిప్పులు పొందేందుకు వీలుగా వారి తల్లిదండ్రుల ఆదాయ పరిమితిని రు. 6,000 నుండి రు 2,000లకు పెంచారు. వసతి గృహాలలో విద్యార్థుల భోజన ఖర్చులకిచ్చే మొత్తాన్ని నెలకు రు. 95లకు పెంచారు.

* సాంఘిక సంక్షేమ కార్యక్రమాలలో ఇతర ముఖ్యాంశాలు:- కులాంతర వివాహాలను ప్రోత్సహించడం, పేదలకు ఉచిత న్యాయసహాయం, హరిజనులపై జరిగే అత్యాచారాలు విచారించేందుకు సంచార న్యాయస్థానాలు ఏర్పాటు చేయడం వంటివి.
* విద్యుదుత్పాదన స్థాపిత ఉత్పాదకశక్తి 2,800 మెగావాట్లకు పెరిగింది.
* ఆంధ్రప్రదేశ్‌లో నెలకొన్న పారిశ్రామిక శాంతి; అనుకూల వాతావరణం; నీరు, విద్యుచ్ఛక్తి సరఫరా, ప్రభుత్వం ఇస్తున్న ఉదార ప్రోత్సాహం నూతన పారిశ్రామిక వేత్తలను ఆకర్షిస్తున్నాయి.
* రు 6,000 కోట్ల పెట్టుబడి వినియోగించి పరిశ్రమలు ఏర్పాటుచేస్తున్నారు.
* బలహీన వర్గాల కోసం చేపట్టిన 2, 0,000 గృహాల నిర్మాణం వివిధ స్థాయిలలో ఉన్నది. గుడిసెల నిర్మాణానికి సహాయం రు 400 నుండి రు 1000కి పెంచారు.
* పోలవరం బ్యారేజీ, శ్రీశైలం కుడికాల్వ, జూరాల ప్రాజెక్టు నిర్మాణం చేపట్టారు నాగార్జునసాగర్ కాల్వల ఆధునికీకరణ ముమ్మరంగా కొనసాగుతున్నది.
* గ్రామాల్లో మంచినీటి సరఫరా పథకాల అమలుకు అధిక ప్రాధాన్యం ఇస్తున్నారు.
* యువజనులు, స్థానిక సంస్థల సహకారంతో సమాజిక అటవీ పథకాన్ని ముమ్మరంగా అమలు చేస్తున్నారు. పరిశ్రమల కోసం నష్టపరచిన వాటి స్థానంలో తిరిగి చెట్లు నాటేందుకు పారిశ్రామిక అటవీనిధిని ఏర్పాటుచేశారు.
* కుటుంబ నియంత్రణ కార్యక్రమాలు దీక్షతో అమలు జరుపుతున్నారు. 19 1 ఏప్రిల్ నుండి డిసెంబరు వరకు, 183075 కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు జరగాలని లక్ష్యం కాగా 1,-3,527 ఆపరేషన్లు చేశారు
* 198 -83లో వార్షిక ప్రణాళిక పెట్టుబడి రు 600 కోట్ల రికార్డుస్థాయి చేరుకుంది.
* 1980-81లో దుర్భిక్షం, వరదలు వంటి అవాంతరాలను అధిగమించి 100 లక్షల టన్నుల ఆహారధాన్యాలు పండించారు.

ఆంధ్రప్రదేశ్‌లో హరిజనులు, ఇతర బలహీనవర్గాల పరిస్థితి ఇదివరకటికంటే చాలా మెరుగుగా ఉంది. వారికి ఉజ్వల భవిష్యత్తు ఉన్నది

మనం 19 1 సంవత్సరాన్ని ఉత్పాదక సంవత్సరంగా ప్రకటించుకున్నాం. రాష్ట్ర ఆర్థిక వ్యవస్థ చురుకుగా పురోగమిస్తున్నది. శ్రీమతి ఇందిరాగాంధీ చూపిన బాటలో మన రాష్ట్రం ముందుకు సాగుతూ, శ్రీ టి. అంజయ్యగారి నాయకత్వంలో ప్రజలు, ముఖ్యంగా బలహీన వర్గాల వారి సంక్షేమం కోసం నూతన 20 అంశాలతో సహా మరిన్ని అభివృద్ధి కార్యక్రమాలు అమలు చేయబోతున్నది.

---

డైరెక్టరు, సమాచార, పౌరసంబంధశాఖ, హైదరాబాదు,
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

# కామేశ్వర్రావు మేష్టారు

మానేపల్లి సత్యనారాయణ



కామేశ్వర్రావు మేస్టారు బుట్టతల గోక్కుంటూ పేపర్లు దిద్దుతున్నారు. 'వెధవలు-చదువు మీద శ్రద్ధ ఏదీ నూటెంట్లుకి? ఒక్కడికి అక్షరం ముక్క రాదు గదా-ఏబీసీడీలు కాదు ఆ ఆలు రాని వెధవలంతా వచ్చేస్తున్నారు పదో తరగతిలోకి-అలా వెళ్ళిపోతున్నారు ఇంటర్ మీడియేట్ లోకి-ఆపైకి కూడా-స్పెల్లింగ్ తప్పు లేకుండా తనపేరు రాసుకోవడం రాని వాళ్లు ........ డిగ్రీ హోల్డర్లయి పోతున్నారు,' కోపం వచ్చేసింది కామేశ్వర్రావు మేస్టారికి, అసలు యింగ్లీషు చదువు ఎత్తేస్తే బావుణ్ణు-యీ మాటలు ఆయన రోజూ అనుకునేవే. వెనకటికి ఆయన డిఫెన్స్‌లో పనిచేస్తున్న రోజుల్లో ఒకాయన అనేవాడు "జాబ్ శాటిస్‌ఫాక్షన్ అనేది లేకపోతే ఉద్యోగం చెయ్యడం కష్టం అని,

ఉపాధ్యాయ వృత్తి అనబడే మేష్టు జ్జోగంలో జాబ్ శాటిస్‌ఫాక్షన్ ఆయన కేమీ కనబడ్డం లేదు.

ఆ రోజులు జ్ఞాపకం వచ్చాయి.

'అందులోనన్నా వున్నాను. కాను ఈ పాటికి ఏదో రాంక్‌లో వుందును, బోలెడు జీతం వచ్చును. సరే అప్పట్లో అది బాగులేదు. బాగులేదంటూ విడవక పోలేదు. జంతువులన్నా నయమే, ఒకోసాం ఎదురు తిరుగుతాయి-ఏ స్వేచ్ఛ లేదు-దిక్కుమాలిన ఉద్యోగంలో. మె నెలలో మాంచి ఎండలో కాకి యూనిఫారమూ-ఫుల్ బూట్సూ, నెత్తిన టోపీ పెట్టుకుని గంటల తరబడి డ్యూటీ అంటే మజాకానా? కాస్త బుఱ్ఱ తప్పితేచాలు ఆఫీసరు రుద్రుడయిపోయి తిట్టి పోసేసేవాడు. అక్కడితో సరా? డిసిప్లినరీ యాక్షన్ కూడానూ ఒకసారి మార్చింగ్ చేస్తున్నప్పుడు తాను నవ్వాడని పెరేడ్ గ్రౌండ్ చుట్టూ డజన్‌సార్లు పరిగెత్తమన్నాడు. గేటెలా మొహమూ వాడూనూ, మరి నవ్వురాదూ? నవ్వినా తప్పేనా?' యిప్పుడు వాళ్ళు మండి కుర్రాళ్ళని తిడుతూ వుంటే పడీ పడీ నవ్వుతూ వుంటారొకోసారి.

కామేశ్వర్రావు గారికి నవ్వొచ్చింది. హాయిగా నవ్వుకున్నారు, బట్టతల గోక్కుంటూనూ.

వెధవ పేపర్లు దిద్ది ప్రాణం విసుగెత్తి పోతోంది. ఒకోసారి ఆ రాతలకి నవ్వలేక ప్రాణం పోతోంది.

"యిదేం దిక్కుమాలిన యిల్లండీ-నిన్న మీరు పెట్టిన కాంపోజిషన్ పుస్తకాలకి చెదలు పట్టేశాయి. యిల్లుమార్చండీ అంటే వింటారా?" అని కోపంగా పుస్తకాలకట్ట దులిపింది లక్ష్మి-మేష్టారి భార్య. ఆవిడ ఆ పుస్తకాల కట్టని దులిపినట్టే అప్పుడప్పుడు మొగుణ్ణి దులిపేస్తూ వుంటుంది అప్పుడప్పుడు.

నిజమే ఈ కొంపలో చెదలే వున్నాయా? చీమలేవున్నాయా? పంది కొక్కులే వున్నాయా? నల్లులేవున్నాయా, పిల్లులేవున్నాయా? యింత పెద్ద యిల్లు ఎనభయి రూపాయలకి దొరికిందంటే మాటలా? నూటయాభై రూపాయలిచ్చినా యివ్వరూ యివ్వరు.

అన్నానికి చీమలు పట్టేస్తాయి. చీమలు పట్టిన (లేక పడిన) అన్నమూ, మజ్జిగా తింటే కంటికి చాలా మంచిదట! తలకు నూనె రాసుకుని పడుకుంటే తలకి పట్టేస్తాయి చీమలు - మెడలకుండా కాస్సేపలా పడుకుంటే మనుష్నే తినేస్తాయి కూడానూ.

గడ్డం గీసుకుంటూ వుండగా బిలబిలమంటూ ప్రైవేటు పిల్లలు వచ్చారు. ఓ పక్క గడ్డం గీసుకుంటూనే వాళ్ళకు తలా ఒకపనీ అప్పగించాడు; "ఒరే నువ్వు నోటింగ్ పద్యం చదువు, నువ్వు ఫలాని పాఠం చివరి గ్రామరు ఎక్సర్సయిజు చెయ్యి, నువ్వు స్పెల్లింగులు కంఠంతా బట్టు ...అన్నట్టు నువ్వీనెల జీతం తెచ్చావుకావింకానూ, ఒరే నువ్వు, నెయ్యి తేచ్చిపెట్టమన్నాను తెచ్చావూ-డబ్బులకేనా బాబూ-పోనీ నెల జీతం బదులు నీసాడు నెయ్యి తెచ్చి-ఒరే నువ్వు పరుగెత్తికెళ్ళి స్నానానికి వేణ్ణీళ్ళు పెట్టమన్నానని అమ్మగార్తో చెప్పు-లేక పోతే నువ్వే....

# స్వప్నం ఓ హిప్నటిజం!

స్వప్నాలు—
విచిత్ర లాస్య విన్యాసాల
వసంత వనకన్యలు.
విరిగి ముక్కలై విలపించే
విరహాతప్త శిథిల హృదయాలయాలు.
చేరి ఒక్కటయ్యే
చెదిరిన మబ్బుల ముక్కలు.
స్వప్నాలు—
కన్నీటి కడలి తరంగాలు-
కనిపించని భావనాంతరంగాలు.
మరువలేని అనుభవాల
మధుర కవనాలు.
మయి-మరపించే అనుభూతుల
మలయ పవనాలు.
స్వప్నాలు—
నవ వధువిచ్చిన తొలి ముద్దులు.
వేకువ విచ్చిన చలి పొద్దులు.
వెన్నాడతాయి కొన్ని
వెంట తిప్పుకుంటాయి కొన్ని.

స్వప్నాలు—
కొందర్ని భయపెడతాయి.
కొందర్ని భ్రమపెడతాయి.
కొందర్ని లాలిస్తాయి.
కొందర్ని పాలిస్తాయి.
కొందర్ని శాశిస్తాయి.
కొందరికి "శ్వాస" నిస్తాయి.
కాలం అది-కనిపించనిది.
"కాల" పాశం అది-వద్దన్నా "నీడై" వెంటాడేది.
కళ్ళు మూసుకున్నప్పుడే-
కనిపించే దృశ్యం అది-మూగ సినిమా అది
రాత్రంతా జగత్తుకు ఊపిరై,
ఉదయాన్నే ఉరి పోసుకుంటుంది "స్వప్నం"!
అందుకే—
స్వప్నం-ఓ
హిప్నటిజం!

—కస్తూరి వేణుగోపాల్—

"స్నానం చేసొచ్చి నాండిబెయిల్లు పారంచెబుతాను....రేపు మాత్రం అందరూ కాంపోజిట్ లెక్కలు తెచ్చుకోండి. ఆలకించారా అందరూనూ? ఆలకించావురా వారే పేట కరణం? నువ్వేరా ఒరే కోటిగా?...."

గడ్డం గబగబ బరికేశారు కా.మే.

'డిఫెన్స్‌లో వున్నప్పుడు గడ్డం పెరిగినట్టు కనబడిందా తోలు వల్చేసేరన్న మాటే. మిలటరీవా మజాకావా?

ఆ వుద్యోగంలో జాబ్ శాటిస్ ఫాక్షన్, ఐరన్ డిసిప్లిన్-ఈ దిక్కుమాలి మేస్టరు ఉద్యోగంలో తగలబడ్డం వచ్చింది ఇంతానూ-తెల్లారి లేచింది మొదలు రాత్రి నిద్రపోయేదాకా గుండెకాయ తెగిపోయేలా అరవడం అంటే మాటలుకాదు'

"మీకేమండీ ఇంగ్లిషు మేస్టర్లూ-క్లాసు టీచర్లూనూ - మా మొహం ఎవడు చూస్తాడూ" అంటారు తెలుగు మేస్టారు ఆచార్లుగారు.

"ఊరుకోండి బాబూ మా హిందీ ఆపాటి చూడ్రు" అన్నారు ముసలి హిందీ

మేస్టారు. పాపం ఆయన్ని గుంటలు తెగ ఆట పట్టించేస్తారు. ఏడిపించుకు తినేస్తారు. మొదటి బెంచీలో కూర్చునే పుస్తకం అడ్డు పెట్టుకుని కుక్కలా అరిచేవాడొకడూ పందిలా అరిచే వాడొకడూనూ. ఒక డ్రాయింగు మేస్టారికయితే "పూరీ కూర" అని పేరు పెట్టారు. మరో మేస్టారి పేరు "దిమిలి పొడుగు మనిషి"

పోతారు మస్సు గొట్టుకుని.

కామేశ్వర్రావు మేస్టారు స్నానం చేసి ఇంగ్లీషు నాండిటెయిల్డు పాఠం ప్రారంభించారు. తన ప్రైవేటు దుకాణంలో కుర్రాళ్ళని ఒక్కొక్కళ్ళనీ లాక్కుపోతున్నాడు కొత్తగా వచ్చిన లెక్కల మేస్టరు తాతారావు. ఆ కుర్ర మేస్టరుకి ఎందుకో అంత డబ్బువిచ్చి. తనయినా ఈ ప్రైవేట్ల రంధి మానుకుందామనుకున్నాడు. గాని అప్పులో-అవి తీరడం ఎలాగా?

మర్చంట్ నేవీలో పనిచేస్తూ లెక్కలేనంత డబ్బు పంపిస్తూ వుండే తమ్ముడు అర్థాంతరంగా మాయమయ్యాడు. పది వేలు డిపాజిట్ కట్టి లీగల్ హెయిర్ (న్యాయసమ్మతమైన వారసుడు) సర్టిఫికెట్ తెస్తే - రెండు వాయిదాల్లో లక్ష రూపాయల నష్ట పరిహారం యిస్తారు నావీవారు. ఆ తమ్ముడికి పెళ్ళి కాలేదు గనక తల్లే వారసురాలు (తండ్రి ఏనాడో చచ్చిపోయాడు తాగుడలవాటై పోయి) తల్లి పేరుమీదుగా పదివేలు కట్టడానికి - మరొక వెయ్యి తదితర ఖర్చులు పెట్టడానికీ అన్నదమ్ములు ముందుకు రాలేదు. కామేశ్వరరావు కంటే

ఎక్కువ జీతాలే తెచ్చుకుంటున్నా-మావల్లకాదంటే, మావల్లకాదని సన్నాయి నొక్కులు నొక్కేరు. నానా బాధలూ పడి-హవ్వ-చెప్పుకుంటే సిగ్గు. పెళ్ళాం పుస్తెల్తో సహా అమ్మేసి-పదివేలూ కామేశ్వర్రావే కట్టేడు (అప్పటికి బంగారం తులం ఆరొందలే) ఇంతలో ముసలి తల్లికి జబ్బు-జబ్బంటే జబ్బుకాదు-సరిగ్గా సంవత్సరం పైగా తీసుకుంది. పత్రాలు తయారయే సరికి సంతకం పెట్టడానికేనా మిగుల్తుందో లేదో ననుకున్నారు. తీరా సొమ్ము వాటాలు వేసి పంచుకుందుకి అన్నదమ్ములూ (అప్పజెల్లెళ్ళు తక్కువ తిన్నారా?) తయారు....

అసలు, నిజం చెప్పాలంటే ఆస్తి వున్నవాడికి అన్నదమ్ములే ఆగర్భ శత్రువులు, ఈ ముక్క భారతం చదివినప్పుడు తెలీలేదు-అనుభవంలో తెలిసింది కామేశ్వర్రావు గారికి....

చివరికి మిగిలిందేమిటి? పదివేల రూపాయల అప్పులూ, బట్టతలానూ.... ఇది చాలక ఇల్లు బట్టిన అప్పజెల్లెలూన.

కామేశ్వర్రావు గారికి అట్టే వయసు కూడా లేదు. నలభయి నాలుగో, నలభయ్యయిదో వుంటాయి. ఒడ్డు పొడుగూ మనిషి మాంఛి దిట్టంగా వుంటాడు. ఇప్పుడేం చూశారూ? డిఫెన్స్‌లో పనిచేసే టప్పుడుండేవాడూ ఓహో! ఇంకా బలంగా వుండేవాడు. అందులో సగం శరీరం లేదిప్పుడు. అయినా ఏడ్చి పోతున్నారు కొందరు వెధవలు.

"చూశారూ నిన్ననే తెచ్చారు రెండు కేజీల మంచినూనె-బోలెడు డబ్బుపోసి-నూనె జాడీకాస్తా తిరగదోయిాళ్ళాయి పంది కొక్కులు-మార్చండే బాబూ యీ ఇల్లూ అందా చేపిమ్రమ" అన్నది విసుక్కుంటూ లక్ష్మి. ఆవిడకి అట్టే వయసుండదు. అయినా చాలా మంది లక్ష్మి అనడం మానేసి లక్ష్మమగారు అంటారు. మొన్ననో బొమ్మగారు నూతిదగ్గరికి వచ్చి 'లక్ష్మ మక్కయ్యగారు' అనడం మొదలు పెట్టింది. బుద్ధిజ్ఞానం లేక పోతేసరి-వయస్సు పెరిగినకొద్ది చిన్న వాళ్ళం కావాలన్న ఆలోచన ఆడవాళ్ళకి మరీ లావు-అక్కయ్య గారన్నా అంటుంది, అమ్మమ్మగారన్నా అంటుంది.

'యిల్లు మార్చెయ్యాలి - నిజమే— మార్చెయ్య వలిసిందే-కానెలాగ? ఈ యింట్లో ముందుభాగాన్న పెద్ద వరండా వుంది. దానికి కటకటాలు కూడా వున్నాయి. (అవి కామేశ్వర్రావు గారికి బందిఖానాలా కనిపిస్తూ వుంటుంది) పైగివేళ్ళు చెప్పుకుందికి బాగుంది. ఒక పెద్దగదీ మరో చిన్నగదీ కాక-వేరే వంటకొట్టుంది. పెరట్లో నుయ్యుంది. తులసికోటుంది. స్నానానికి దానికే (?) మరుగుంది. పాత కాలపు యిల్లయిన మాట నిజమే, అప్పుడప్పుడు పెంకులు రాలుతున్న మాట నిజమే, వానాకాలంలో పైనుంచి కురవడమే కాక కాస్త పెద్ద వానయితే నీరు యింట్లోకే వచ్చేసే మాట కూడా నిజమే కానేం జేస్తాం-కాలక్షేపం చెయ్యక తప్పదు.

ఆ మధ్యనొకసారి బాబిగాడిచొక్కా కొరికేశాయి ఎలకలు. కొత్తచొక్కా. జేబులో కొబ్బరుండలు దాచుకుని వంకిని తగిలించాడు. ఆ చొక్కా కిందపడి

పోయింది. ఎలకలుంచుతాయా? అయినా వాడికేం తెగులూ? పన్నెండేళ్లొచ్చాయి కదా-ఎనిమిదో తరగత వెలగ బెడుతున్నాడః గదా-కొబ్బరుండలు, అందులో ఒకటి కొరికి మరీనూ_జేబులో వేసుకోవడం ఏమి? లక్ష్మి వాణ్ణి పట్టుకొని నాలుగుతికేసింది. ఆ మర్నాడు సుసీత రిబ్బన్లు....ఆమర్నాడు తనదే, సవరం, కూరగాయలు తెచ్చుకునే నైలాను నంచీ ...యిప్పుడెవర్ని వుతుకుంది లక్ష్మి? వుతకినా ఏమిఫలము రామరామా, విశ్వదాభి రామరామా——

ఇంచుమించు ప్రతీ ఆదివారం ఇల్లు శుభ్రంచెయ్యడం, మంచాలు దులపడం ఒక కార్యక్రమం అన్నీయిన్నీ నల్లులూనా? వెనకటికి ఎవరో జమీందారు గారు_నల్లుల్ని చంపనిచ్చేవాడు కాదట. సుష్టుగా భోజనంచేసి పడక కుర్చీమీద వాలి కునుకు తీసేవాడట. కుప్పలకొద్దీ నల్లులు కుర్చీతాలూకా అన్ని మూలల్నించీ వచ్చి ఆయన శరీరంనిండా పట్టేసేవట. అలా ఒక. అరగంట అయిపోయాక వెళ్ళిపోయేవట. అవి వెళ్ళగానే ఆయనకి మెలుకువొచ్చేసేదట. (ఇలా నల్లులమీదా పిల్లులమీదా, పాములమీదా కప్పలమీదా అపారమైన దయకురిపించే జమీందార్లు యితర ధనికులూ, ఆరుగాలమూ కష్టించే రైతుల్ని, పాలేర్లనీ పెట్టే కష్టాలన్నీయిన్నీకావనీ, జలగలకంటే హీనంగా వాళ్ళ రక్తమాంసాలు పీల్చడానికి ఏవిధంగానూ జంకరని కామేశ్వర్రావుగారికి తెలీదు. అంచేత తను చిన్నప్పుడు విన్న ఈకథ చెబుతూ వుంటాడు తరచుగా పెళ్లాంతో.

క్యోతి

# వాడిన పూలు

భూమ్యాకర్షణని దాటిపోయానని
అత్యంత గొప్పవాణ్ణని
గర్వం నాకు-
నా కనుబొమ్మల పాలపిట్టలు
రెక్కల్ని విశాలంగా విసిరి
నా నేత్రపాల ఖండాల్ని
నొసటి ఆకాశానికి
ఎగరేసుకు పోవాలని
యవ్వన రసప్రాయాల్ని
మధుర సంగీత భావాల్ని
ఈ స్తటిక్ రిధాల్ని
విశాలాకాశంలో
స్వర్ణాక్షరాల్తో చెక్కాలంటే ఎలా
చూపుల కళ్ళకి పడ్డ చిల్లుల్ని
ఆనకట్ట తెగిన గుండె చెరువుని
శతాబ్దాలుగా విస్మరించి
ఇంకా ఎగరాలంటే ఎలా?

—బి. చంద్ర—

"మంచిదేకదా-మీరూ వెంచండి పోసీ నల్లుల్ని" అని కసురుతుంది లక్ష్మి. పడుకుంటే ఒకోసారి తల వెంట్రుకల్లోకి కూడా దూరిపోతున్నాయి నల్లులు. పిల్లులూ అలాగే కాల్చుకు తింటాయి. తెల్లవార్లూ ఎలకలవేటా, చంటి పిల్లలు ఏడిచినట్లు అరుపులూనూ.

దుప్పట్లు, తలగడాలూ ఎండన వెయ్యడం, కిరసనాయిలు డబ్బా, పప్పుడబ్బాలు వగైరాలు బాగా శుభ్రంచేసి నీరు ఓడిపోయేదాకా ఆరబెట్టడం ఒక పక్క సాగుతూ వుండగా మరోపక్క మంచాలు దులపడం సాగుతూ వుంటుంది.

మంచాన్ని దులుపుతూ లక్ష్మి మొగుణ్ణి కూడా దులిపేస్తూ వుంటుంది "ఎప్పుడయినా చిన్న మెత్తు బంగారం కొన్నారా? వరలక్ష్మి వ్రతం చేయించుకుంటాను ఒక్క అణా ఎత్తు బంగారం కాసు చేయించమంటే వినిపించుకోరు. మీరెప్పుడూ కష్టాల గురించీ అప్పుల గురించీ మాట్లాడతారు. అప్పులో అప్పు అదే తీరక పోతుందా? మీకంటె తక్కువ జీతం వచ్చే ఆ గుమాస్తా సుందర్రావు పెళ్లాన్ని చూశారుకారు-మొన్ననే చెవులకి కొత్త రకం దుద్దులు చేయించుకుంది. ఎలాంటెలాంటి చీరను కడుతుందో!-ఏమయినా మేస్టర్ల కంటే గుమాస్తాలే నయం-" ఇగీలక్ష్మి వరస.

ఒక్కపక్క గంజిలేక మాడుతున్నా సరే జనాలకి బంగారం మీదా కొత్త బటల మీదా వుండే మోజు గురించి కామేశ్వరరావు గారు చాలా సేపు ఆలోచించారు. "అప్పులమీద అప్పులు చేసి అయినాసరే పిసరంతయినా బంగారం కొనడానికో, కొత్త బట్టలు కొనుక్కోవడానికో ఎగబడతారు. అప్పు ఎలా తీరుతుందో అన్న చింత వుండదు.. బంగారం మళ్ళీ అప్పు తెచ్చుకోవడానికీ పనికొస్తుంది. మరి కొత్తబట్టలు...?" ఆలోచన ఎంతకీ తెగదు ఆవలింతలో ఎటో పోతుంది.

కామేశ్వర్రావు మేస్టారు నిద్రలో కుంభకర్ణుడికంటే పైచెయ్యే-

ఆ నిద్ర డిఫెన్స్ సర్వీసులో పని చేస్తున్న రోజుల్లో అలవాటయి పోయింది.

రెండు రోజులు-అనగా దాదాపు యాభై గంటలు కంటిమీద కునుకు లేకుండా వుండిపోగలడు. వీలు దొరకాలే గాని రోజుల తరబడి కటికనేలమీదే గానీ, కంకరాళ్ళ గుట్టమీదేగానీ వొళ్ళు తెలియకుండా నిద్రపోగలడు.

అటువంటికి-

కొత్తగా చేరాయి చిన్నచిన్న చుంచెలకలు-మేసారి కాలి బొటనవేలు కొరికేసిపోయాయి, అర్ధరాత్రివూటలేచి కూచున్నాడు.

ప్రాణం జివ్వుమని లాగేసినట్టయింది. అంత మునిషీ గిలగిల లాడిపోయాడు.

అతనికో క్రోధం వచ్చేసింది చుంచెలక మీద. కనిపిస్తే చంపేసిపోను. ఎందుకు కనబడవూ - ఎదురు గుండానే గంతులు వేస్తూ పారిపోతుంటాయి. కళ్ళ ఎదురుగానే నానా అల్లరీ చేస్తూ, పరిక్షల్లో పబ్లిగ్గా (లేక పబ్లిక్ పరీక్షల్లో) కాపీ చేస్తూ సువ్వెం చెయ్యగలవు అన్నట్టు పోజు పెట్టే స్టూడెంట్లలాగ. తనకి చాతగాలేదు గాని ఆ స్టూడెంట్లవల్ల మేస్టర్లు కొందరు బాగు పడుతున్నారు కాంట్రాక్టు పద్ధలని కాపీలు రాయించి.

ఇంతకీ చుంచెలక..?

బుర్రంతా చిరాగ్గా వుంది. నరాలన్నీ కోపంగా వున్నాయి. మనసంతా బాధగా వుంది. చుట్టూ చీకటిగా వుంది. చాలా చాలా నిశ్శబ్దంగా వుంది.

నిస్సహాయత -వెధవ చాతకానితనం-మెతకదనం-మొహమాటం-కాదు చాతకానితనమే. అవునవును. తానిలా వుండబట్టే తనసందరూ వాజమ్మని చేస్తారు.

యింట్లో చుంచెలకలు, నల్లులు, పిల్లులు, చెదపురుగులు బొద్దింకలు-సీమలు-

అన్నదమ్ములు--సరే—సరే—వాళ్ళనేనాడో లెక్క వేసుకున్నాడు అప్పజెల్లెళ్ళు-

చిన్నప్పుడు ఛండశాసనుడైన తండ్రి, ఆయనకికాస్త పక్షపాత బుద్ధా లేకపోతే తనకంటే మొన్న చచ్చిపోయిన తమ్ముడిమీదే ఎక్కువిష్టం-

తరవాత అల్లా డిఫెన్స్ ఉద్యోగంలో వున్నప్పుడు ఆఫీసర్లు-తోడి సబార్డినేట్స్-

యిప్పుడీ మేస్టరు గిరీలో సీమ్మిరపకాయల్లాంటి క్షుద్రవెధవలు కొందరు మాకాని వాళ్లంటారు-బాగా తెలివి తేటలు ప్రదర్శిస్తూ వేలెడంత ఉన్నవాళ్లే ఎప్పటికయినా చిక్కు-పెద్ద శరీరం కల మొద్దులు పరమ సాత్వికంగా వుంటారు-

ఇతర మేస్టర్లు—ముఖ్యంగా తన ప్రెపేట్లకి దెబ్బ కొడుతున్న ఆ సంగీత రావు-

కేటికి వందేసి గ్రాములు తక్కువ తూచే కోటాదుకాణం (లేక చౌకడిపో) వాడు, అన్నీ మొదటి రకం రేట్లువేసి అధమాధమ రకం అంటగట్టే కిరాణా కొట్టువాడు (లేక ఖాతా కొట్టువాడు) ప్రైవేటు డబ్బులు ఎక్కొట్టే కొందరు కలవారి పిల్లలు.

అంతా దగా దగా
అసలీ మనుషులే అంత
ఈలోకమే అంత
మెతగ్గా వుంటే మొత్తేస్తారు,
మోసేస్తారు మోసేస్తారు.
మరంచేత మెతగ్గా వుండకూడదు
వాజమ్మలా వుండ కూడదు,

సీతల్లో జే జె మ్మ తో చెప్పకో
అన్నట్టుండాలి.

వెన్నలా వుండకూడదు, వెధవలా
వుండకూడదు.

వజ్రంలా వుండాలి
వాడిగా వేడిగా వుండాలి.

కాలి బొటనవేలు జివ్వున లాగుతోంది
కోపం వచ్చేసింది కామేశ్వర్రావు
మేస్టారికి,

చుంచెలక మొదలు చౌక డిపోదాకా, కుర్రాళ్ల మొదలు కిరాణాకొట్టు వాడిదాకా అందరి మీదా, అందరి మీదా కోపం వచ్చేసింది

ఎర్రగా, వేడిగా కోపం కణతల్లోంచి కళ్ళలోకి నిండింది. కామేశ్వర్రావు మేస్టారికి కోపంతో ఊష్ణం వచ్చేసి నట్టయింది.

అందర్నీ ఓ పట్టుపట్టిచూడాలి. ఆం ఫట్-బట్టబుర్ర గోక్కుంటూ వెధవ నం గిరి మరి పనికిరాదు.

○ ○ ○

ఉదయం నూతి గట్టమీద స్నానం చేస్తూ కుడిపాదం మడమ మాత్రమే నేలకానించి బొటనవేలు పైకెత్తి దాని మీద చల్లని నీళ్ళు పోసుకుంటున్న మొగుణ్ణి వంటింటి కిటికీలోంచి చూసింది లక్ష్మి,

బొటనవేలు వాచి వుంది.

"ఏమిటయ్యింది మీ బొటనవేలుకి? మిమ్మల్నే...." అని గావుకేక పెట్టినట్టుగా అరిచింది-కిటికి ఊచలకి తలఆన్చి బయటికి చూస్తూ.

కామేశ్వర్రావు మేస్టారికాకేక విని పించలేదు. బొటనవేలు మీద అలా చల్లని నీరు పోసుకుంటుంటే ఎంత సైకుగా సుఖంగా వుందీ....? ✽

స్కెచ్

# "నవ్వొస్తే(నే) నవ్వండి"

"సంతోషం సగం బలం" అన్న పెద్దలే, "నవ్వు నాలుగు విధాల చేటన్న" మరో స్టేట్‌మెంట్ కూడా ఇచ్చేసారు, రాజకీయార్థుల్లాగా. దీన్లో దేన్ని నమ్ముకుని ప్రొసీడ్ కావాలన్నది తేలక బుర్ర బద్దలు కొట్టుకునే మాట అటుంచినా, సంతోషానికీ, నవ్వుకీ తేడా లేదన్చెప్పి మరో డౌటింగ్ థామస్ లిటిగేషన్ తెస్తాడు. ఉందా, ఉంటే గట్రా ఏమిటది, ఎన్ని రకములు, అవటా ప్రశ్నలన్నీ మనం ఇంటర్వ్యూలు చేసి నవ్వుడు ఉడికి కేండిడేట్ల దుమ్ము దులపడం మంచిదిగానీ, మన వేలితో మన కన్నే పొడుచుకోవటం అంత శ్రేయస్కరం కాదు గనుక, దాన్ని ప్రస్తుతానికి పోస్ట్ పోన్ చేద్దాం.

"ప్రపంచంలో నవ్వు కరువై పోయిందోచ్" అని ఎవరైనా అంటే కరక్టేనేమోగానీ "నవ్వుకుందుకు మేటర్ కరువైందోచ్" (హాచ్) అని ఎవరైనా అంటే మటుకు, మిగతా వాటితో సహా అలా అన్న వాణ్ని కూడా కట్టగలిపి నవ్వుకోవచ్చు "కాదేదీ నవ్వు కనర్హం" అంటే "కాదోయీ నవ్వు దర్హం" అన్నమాట.

"సచ్చినాక నవ్వలేవురా" అబ్బాయీ అంచేత "నవ్వుతూ బతకాలిరా" అన్నాడో మహాకవి. ఇంచేత బతికున్నన్ని రోజుల్లో మన వాటా మనం నవ్వేసుకోవడం ఈజీ క్వాల్టు ఛాన్సొచ్చినప్పుడు మినిస్టరై పోవడం. ఐతే, మన నవ్వు మనం నవ్వుకోవడమన్నది ఉత్తసెల్ఫిషన్నది మరో మాట. నీ ఏడుపు నువ్వేడువు కానీ, నీ నవ్వుని మాత్రం నలుగురికీ పంచు—అని ఓ ప్రావెర్బుంది.

నవ్వు నాలుగు రకాలు. ఒకటి చక్కని నవ్వు, రెండోది వంకర నవ్వు, తరువాత గంభీరమైన నవ్వు, మిగిలింది గబ్బర్ సింగ్ నవ్వు.

సినిమాలో హీరోని కన్నాక హీరోయిన్ ప్రసవించేది చక్కని నవ్వన్న మాట. కానీ హీరోయిన్ని చూసి విలన్ నవ్వేది వంకర నవ్వవుతుంది ఇకపోతే ఎన్నికల్లో గెలిచిన నాయకులు, సన్మాన సభలో వినాయకులూ నవ్వేది గంభీరమైన నవ్వు, వాళ్ళు నేచురల్‌గా వంకర నవ్వో, అసహజంగా చక్కని నవ్వో ఒలికిస్తే సీన్ పాడయిపోతుంది. "అలాగే" అన్నట్టుగానో, "మీ అభిమానమునకు నా కృతఙ్ఞతలు" అన్నట్టుగానో సీరియస్‌గా నవ్వేస్తారు చూడండి, అది గంభీరమైన నవ్వు. ఇకపోతే, తనమీద విమర్శ రాసిన పత్రిక ఎడిటర్ కనిపించగానే రచయిత/త్రి నవ్విందనుకోండి. అది నిజం నవ్వు కాదన్న మాట. నిజానికి అది నవ్వాల్సిన సీను కాదు గదా. అంటే ఏడవాల్సిన సీనని కాదు. ఏదీ చేయకూడదన్న మాట. కానీ నవ్వింది. అంటే అప్పైన ఆ ఎడిటర్నిక నవ్వకుండా చేస్తుందన్న మాట. ఇలాంటి దాన్నే గబ్బర్ సింగ్ నవ్వంటారండీ.

నవ్వితే నవరత్నాలంటారు-అదేమి

వినయ్

టంటే, ఒకసారి ఒకూళ్ళో ఓ రత్నాల వ్యాపారి ఉండేవాడు, అతను నవ్వితే రత్నాలు దొర్లించినట్టు, అంటే రాళ్ళు (రత్నాలూ రాళ్ళేనండోయ్ దొర్లించినట్టు, కమ్మగా వుండే దన్నమాట. ఆ వ్యాపారి ఇంటెదురు అద్దాల మేడలో, గాజు బొమ్మలాంటి ఓ అందాల జవరాలి వుండేది. ఓసారి ఆమె అందానికి హోరున ఆశ్చర్యపోయిన రత్నాల వ్యాపారి భోరున నవ్వేశాడు. ఆ ఫలంగా ఆమేడ, మేడలోని అవిడా—ముక్కలై, మూర్ఛిల్లటం జరిగింది. సీరియల్ గానూ, సీరియస్ గానూ, దాంతో ఆవూరి రాజుగారు ఆ రత్నాల వ్యాపారిని కోప్పడేసి, "ఇక ముందు నువ్వు నవ్వితే నవరత్నాలు ఫైన్" అని మూడో నవ్వు నవ్వారు. జవరాలిని మొదటి నవ్వు నవ్వింది. కానీ రత్నాల వ్యాపారి నాలుగో నవ్వు చేతకాక, వల వల, జల జల మన్నాడు. ఇదీసంగతి.

నవ్వులో రకాల్లాగే, నవ్వడంలోనూ రకాలున్నాయి. అందులో ఒకటి ఉదాహరణకు మీ ఆఫీసులో మీ ఎదురుగా, మీ హెడ్ క్లర్క్ మీద ఆఫీసర్ గారు తిట్టేశారనుకోండి. అప్పుడు ఏం చేయాలి? నవ్వకపోతే అంత పెద్దాయన చిన్న బుచ్చుకుంటాడు. నవ్వితే మన మీద ఈ పెద్దాయన తరువాత మన సంగజెపుతాడు. అప్పుడు "పోండిసార్, మీరు మరీ" అని నవ్వినట్టుగా చేయాలి. పోనీ మీ బాసురుకు మీ మీదే కోకేస్తే, అప్పుడు—గాలిగా నవ్వాలి. ఏవిట్టుకా నవ్వు. అందుకే ఇలాంటి నవ్వుని గొడుగు నవ్వనొచ్చు.

"నవ్విన నాపచేనే పండుతుంది అంటే" అంటే ఏమిటంటే, విజయవాడ, విశాఖపట్టణం మునిసిపలెన్నికల్లో ప్రతి పక్షాలు గెలవడమన్నమాట.

అంచేత, అందర్నిచూసి, అన్నిచోట్లా నవ్వకూడదు. బస్టాపులో ఓ పిడుగులాంటి పిల్లనిచూసి నవ్వారనుకోండి, మీ లెంపమీద పిడుగులు పడిపోగలవు. అసలూ నవ్వుకు సమయమూ, సందర్భమూ చాలాముఖ్యం. ఎందుకంటే—

వన్స్ పానే టైమ్, రాంపూర్ కా లఖ్కరాజ్ అని ఒకాయనుండేవాడు. పధ్నాలుగేళ్ళ తరువాత వాళ్ళ బ్రదర్ మళ్ళీ సింగాసనం మీద ఎక్కబోతున్న మూమెంట్లో కామెంట్లేకుండా గొల్లుమన్నాడు. "హారాం, తండ్రి కాదన్న సీట్లో మళ్ళీ కూచుంటున్నానని నన్నుచూసే నవ్వాడు" అనుకున్నాడు రాంబాబు. "ఓహో, కొద్దిరోజులు పరాయివాడి పంచలో ఉండి మళ్ళీ టింగురంగా, నాసామి రామా అంటూ వచ్చానని నన్ను చూసి నవ్వాడు" అనుకుంది సీత మాలిని, ఇలా ఎవరికి తోచినట్టు వాళ్ళు, అతు నెన్నికల మూమెంట్లో వోటర్ల అభిప్రాయం గురించి నాయకుల్లాగా అనుకున్నారు. ఇంతకూ వాడు నవ్విందెందుకంటే, పధ్నాలుగేళ్ళు వాడికి నిద్రా లేదు. అలాంటిదిలాంటి సెన్సునీ మూమెంట్లో చెప్పాపెట్టకుండా ఆవులింతొచ్చేసరికి, నవ్వొచ్చింది. కానీ ఆ నవ్వుకి రిఫరెన్సులూ, కాంటెక్స్టులూ లేవు. కనుక అది అపార్థాల పాలయింది.

ఇలాగే ఏవర్లోవున్న సుయోధనుడనే వాణ్ని చూసి నవ్విన ద్రౌపదిఅనే పంచమహా పతివ్రత కథ ఒకటి పంచమ వేదంలోవుంది. ఆ సుయోధనుడు, అలా పర సతిచే పొగొట్టబడిన పరపతి గల వాడై, ఆవిడ మీద ఎంక్వైరీ కమిషన్లూ గట్రా ఏమీ లేకుండానే ఆమె పరువు తీయబోయి నందుకు మధ్యంతర ఎన్నికల్లాంటి మహా భారత యుద్ధం వచ్చి, మన వాళ్ళచేత ఇన్ని సినిమాలు తీయిస్తూంది.

నీతి : నువ్వైనా, మరొకరైనా నవ్వుల పాలగునట్లు నవ్వరాదు. 

ఇంజనీరింగ్ చదువుతున్న ఫ్రెండ్స్ నాకు అనేక మంది ఉన్నారు. కాని అనూ గాఢ పరిచయం కావడంతో నేను జీవి

డం బహు అరుదు, బహుశా ఇప్పటికి కూడా, ఒకొక్క కాలేజీలో ముగ్గురు నలుగురు కంటే ఉండరనుకొంటా.




తంలో మొదటి సారిగా ఆ కోర్స్ చదివే అమ్మాయిని కలుసుకున్నట్టయింది. ఆ రోజుల్లో ఆడవాళ్ళు ఇంజనీరింగ్ చదవ

ప్రభుత్వం వారి ట్రాన్స్‌ఫర్ ఆర్డర్ చేతికందిన రెండు నెల్లకి వెతగ్గా వెతగ్గా దొరికిన ఇల్లు బీచి ఒడ్డున ఉండటం

అప్పట్లో మా నాన్నగారికి చాలా సంతోష దాయకమైంది. రెండు సంవత్సరాల తేడాతో ఒకే డిగ్రీ చదువుతున్న చెల్లెళ్ళకు లోకల్ కాలేజీలో సీట్లు దొరికేటప్పటికి, మేమా ఇంట్లో దిగేటప్పటికి సముద్రం మీద తన నవ్వులు నిండుగా చిలకరిస్తున్న చంద్రుడు ఓ క్కి నగ మై పోయాడు.

ఆఫీస్ లేకపోయినా ఆదివారం ఉదయమే ఫ్రెష్‌గా తయారయిపోయి జగదాంబలో మళయాళం పిక్చర్‌కా, జ్యోతిలో ఈ రోజే రిలీజవుతున్న తెలుగు దానికా అనే డైలమాలోంచి బయట పడకుండానే నడుస్తూ గేటు దాటుతున్న నాకు

"హలో మీరు వసంతా వాళ్ళ బ్రదర్ కదూ! నా పేరు అనూరాధ. ఇక్కడే బి. ఇ. సెకండియర్ చదువుతున్నా" అంటూ తన్ను తాను పరిచయం చేసుకొందో నడిచే బాపూ బొమ్మ.

"మ....మైనేమ్.. రాఘవరావ్, ప్లీజ్ టుమీట్‌యు. వర్కింగ్ ఇన్. ..పబ్లిక్ రిలేషన్స్ ఆఫీస్" కంగారుగా మాటల్ని కొన్నిటిని వదిలేసి, కొన్నిటి స్థానాలు మర్చి ఎల్లాగో ముగించాను, లోపల ఆమె చదువు గురించి అనుమానం తలెత్తింది. బి ఇ. అన్నట్టు వినబడిందే? బీ, ఇ. వా? బి. ఏ. వా? సరిగా అడిగితే? ఛ! ఇప్పుడేగా చెప్పింది వెంటనే అడిగితే సరిగా విన్నందుకు ఎలా చుస్తుందో?

"అదేంటండీ అలా నేలకేసి చూస్తూ ఉండిపోయారు నాతో మాట్లాడ్డం ఇష్టం లేదా మీకు"

"అబ్బే అదేం లేదండీ, ఇంతకీ ఏ కాలేజీలో చదువుతున్నారు మీరు?" మనసులో జరిగిన మధనం దృష్టిలో పెట్టుకొని ఆవిడ చదువుతున్నదేమిటో తెలివిగా తెలుసుకోడానికి అడిగానని సంతోషించడం పూర్తి కాలేదింకా.

"బావుందండీ మీ ప్రశ్న! మీరు నే చెప్పింది సరిగా వినలేదన్న మాట, ఈ వూళ్ళో ఇంజనీరింగ్ కాలేజీలు ఎన్ని ఉన్నాయేం?"

దొరికి పోయిన దొంగ ముఖం పెట్టబోయి అంతలో తమాయించుకొని "అదే దే కాలేజీయా నైట్ కాలేజీయా అని"

రోడ్డు మీద నడుస్తూ చూసుకోక గోతిలో కాలేసి పడబోయి నిలద్రొక్కుకుని "అబ్బే గొయ్యో కాదోనని అనుమానం వచ్చి" అన్నవాడికేసి చూసినట్లు జాలిగా చూసింది.

అంతలోనే ముఖంలో ఫీలింగ్ మార్చి "నల్లెండి పట్టపగలు వెళ్తుంటేనే కావలసి నన్ని కామెంట్లు 'ఆడదానికి దీని కెందుకురా ఇంజనీరింగ్. అందులోనూ మెకానికల్. మెషీన్స్‌తో వర్క్ చేయడమంటే కుట్లూ అల్లికలు నేర్చుకోవడం అనుకుంటున్నట్లుంది అమ్మడు. నాల్రోజులు పోనీ దెబ్బకి భయపడి పారిపోతుంది' అంటూ మాటలు, 'నీ అందాల చేతులు కందేను పాపం ఎందుకు ఈ

నిర్వచనాలు : చలి:-మూడు కాళ్ళ ముదుసలి

బెడద' అంటూ పాటలూనూ."

నాకు ఏమనడానికి తోచక "మరే! మరే!" అంటూ అటూ ఇటూ చూస్తూన్నా.

ఇంతల్లో "పాపం మార్నింగ్ షోకి బయలుదేరారులావుంది వెళ్ళండి వెళ్ళండి లేటయిపోతూంది" అంటూ మా ఇంట్లోకివెళుతూ "అన్నట్లు నా పేరైనా సరిగ్గా విన్నారా" అని అడిగి నేను చెప్పడానికి నోరు తెరవ బోతుంటే "అనూరాధ" అంటూ తనే చెప్పేసి హడావిడిగా లోపలికి వెళ్ళిపోయింది.

తను ధైర్యంగా నిల్చుని ప్రశ్నలు వేసేసి నన్ను కంగారు పెట్టేయడంతో నేను చుట్టూ పరిసరాల కేసి, నేలకేసి ఎక్కువగానూ, ఆమెకేసి తక్కువగానూ చూడడంతో మొదటిరోజు ఆమె రూపాన్ని విపులంగా చూడలేదు. కొన్ని చూసిన మొదటిసారి మాత్రమే కాకుండా ఆమెని కలిసిన ప్రతీసారి ఆమె ముఖంలోకి చూసినప్పుడల్లా నన్ను కలవర పెట్టేవి ఆమె కళ్ళు. అవి చూసేచూపు ఎదుటి మనిషి మాత్రమే కాకుండా వారి మెదడు లోని భావాలను కూడా చదవగలదా అనిపించేట్లుండేది.

స్వతహాగా నాది కొంచెం పిరికి స్వభావం. తప్పుని సరైతే తప్ప ఏపని నుంచైనా తప్పించుకోవాలనే ప్రయత్నించేవాణ్ణి. నా స్నేహితుల ద్వారా మెతక వాడిగా ముద్రవేయబడ్డా కూడా. కానీ అనూరాధ ఎందుకో నాకు కావాలని దగ్గరయింది అనిపిస్తూంటుంది గతంలోకి వెళ్ళి ఆలోచిస్తున్నప్పుడల్లా. తను ఎప్పుడూ చలాకీగా ఉండేది. తెలివి తేటలు, అందం నాసొంతం అనే అహం చిందులాడుతున్నట్టుంటుంది – భౌతికంగానేకాదు మానసికంగా కూడా అనూరాధ విలక్షణమైన భావాల కలయిక. "నాకున్న పరిధుల్లోనే లోకాన్ని ఎదిరించి బ్రతకాలనుంటుంది! ఈలోకం తనకు తానై నాకేమీ ఇవ్వక్కర్లే. నేనే నాక్కావలసింది ఈ లోకంనుంచి పిండి తీసుకోగలను. చాలామంది చెయ్యలేమనుకొనే పనిచేస్తే నాకెందుకో గొప్ప సంతోషంగా ఉంటుంది. అందుకే నా ఫ్రెండ్సందరూ ఇంటర్‌లో ఆర్ట్సులోకి, కొందరు బోటనీ, జువాలజీల్లోకి వెళితే నేను మాథ్స్ తీసుకొన్నా. ఇంజనీరింగ్ చదవడం కూడా నా ఎదిరించే తత్వానికి ప్రతీక" అంటుండేది.

చదువులోనూ, స్వభావంలోనూ మాత్రమే కాదు మాటల్లోకూడా మహా చురుకు,

ఓసారి బస్సులో వెళ్తుండగా తను లేడిస్ సీట్లో కూర్చొంది. ఆమె పక్క సీటు ఖాళీ· ఆమె స్వభావం తెలిసిన నేను ఆమెకు ప్రక్కనే కొద్ది దూరంగా ఉన్న సీట్లో కూర్చొన్నా. ఇంతట్లో బస్సు ఆగడంతో స్టాపులోని కొంత జనం ఎక్కారు. వెనక కొన్ని సీట్లు ఇంకా ఖాళీగా ఉన్నాయి. ఒక ఇరవై రెండేళ్ళ యువకుడు ఆమె ప్రక్కనే కూర్చున్నాడో లేదో "ఎక్స్‌క్యూజ్‌మి, దిస్

సీటీజ్ ఇండెండెజ్ ఫర్ లేడీస్, ఇఫ్ యువార్ ఎ లేడీ సిట్ కంఫర్టబ్లీ-నో ప్రాబ్లమ్" అనేసి కిటికీవైపు తిరిగి రుమాలు నోటికడ్డం పెట్టుకుంది. కుర్రాడు పాపం కాళ్ళకింద బాంబు పేలి నట్లు లేచి నిలబడి తనకేసి నవ్వుతూ చూస్తున్న ముఖాలు చూడలేక వెనక్కి పరుగులాంటి నడకతో వెళ్ళిపోయాడు. నాకు భలే కోపమెచ్చింది. పాపం ఆ కుర్రాడు తొందర్లో కూర్చున్నాడేమో నోటి కొచ్చినంతా అనెయ్యటమే! మరీ అంత దుడుకుతనం పనికిరాదు.

దిగిన తర్వాత ఈభావమే వెలిబుచ్చే సరికి "చూడండీ ప్రపంచంలో అంతా మీలా నొప్పించక తానొవ్వక అనే స్వభావంతో ఉంటారనుకోకండి. ఆ కుర్రాడిని చాలా సార్లు చూశాను. ప్రతీ సారి బస్సులో వెనకంతా ఖాళీగా ఉన్నా ఆడవాళ్ళ ప్రక్కనే కూచుంటాడు కావా లనే. ఒక సారయినా కాస్త ఘాటుగా ఇవ్వకపోతే...."

మరోసారి బీచిలో నడుస్తున్న మా ప్రక్కనుంచి ఇద్దరు యువకులు మాట్లాడుకుంటూ వెళ్తున్నారు.

"ఫిగర్ బాగుంది గురూ"

"కానీ ఫోజు ఎక్కువ బాసూ"

"ప్రక్కన వీడెవడు బింపాంజీలా, బాడీగార్డా?" ఎటోచూస్తున్న వాడ్నల్లా అనూరాధకేసి చూసేటప్పటికి విసురుగా వెనక్కి తిరిగి వెళుతూ కన్పించింది, వాళ్ళిద్దరి ముందూ నిలబడి "క్షమించండి ఒక్కనిముషం" అని హేండ్‌బాగ్‌లోంచి మిర్రర్‌తీసి వాళ్ళిద్దరి ముఖాల ముందు ఓసారి పెట్టి "ఒక్కసారి చూసుకోండి ఎలా ఉన్నాయి మొహాలు? మనుషులు కోతులనించి పరిణామం చెందారని చిన్నప్పట్నుంచి చదువుతున్నా నమ్మ బుద్ధెయ్యలేదు కానీ మిమ్మల్ని చూశాక తప్పట్లేదు, ఒక్క విషయం, మరొకళ్ళని కామెంట్ చేయడానికి పెద్ద ప్రజ్ఞ అక్కరలేదు. కానీ మనం చేసే కామెంట్ అవతలి వ్యక్తిని కూడా నవ్వించ గలగాలి. అంతేగాని....... బైదిబై ఈ మిర్రర్ మీ దగ్గరుంచుకొని ఎవర్నైనా కామెంట్ చేసే ముందోసారి....వస్తా" అనకోని ఈ షాక్ నుంచి వాళ్ళు తేరు కోకముందే వచ్చేసింది.

● ● ● ●

అసలు థామ్సన్‌ను అనురాధకు పరిచయం చేసింది నేనే, అయితే వాళ్ళిద్దరి మధ్య స్నేహం అంత త్వరలో అంత గాఢంగా పెరిగి పోతుందని గాని, కెమికల్ రియాక్షన్స్‌లో కెటలిస్ట్‌లా నాపని న్యూట్రల్‌గా ఉండి పోతుందని గాని ఆరోజు నేను ఊహించని విషయం.

అధైర్యస్తుడిగా, ముభావంగా ఉండే నాకు ఓ విదేశీయుడు స్నేహితుడుగా ఉండడం అప్పట్లో గర్వకారణంగా ఉండేది, ఆగర్వాన్ని అనూరాధముందు చాటుకొనే ప్రయత్నంలో ఒక భాగమే అతన్నిపరిచయం చేయడం. వైజాగ్‌లో ఒక ప్రయివేట్ కంపెనీలో అసిస్టెంట్

ఇంజనీర్‌గా పనిచేస్తున్నా ఛార్లెస్ మాతృదేశం ఇంగ్లండ్.

"అనాది మానవుడిలో ఉండే సంచార ప్రవృత్తి కొంచెం ఎక్కువ పాళ్ళలోనే నాలో మిగిలిపోయింది. అందుకే ఇంగ్లండ్ నుంచి నా హైస్కూల్ స్టడీస్ కాగానే ఇండియావచ్చి ఢిల్లీలో ఇంజనీరింగ్ చదివాను. సౌత్‌లో వర్క్ చేయాలనిపించి వైజాగ్ వచ్చా. సింగపూర్ వెళ్ళి కొన్ని నెలలయినా అక్కడుండాలని నాకోరిక, ఎప్పటికి తీరుతోందో మరి?" అప్పుడెప్పుడో చెప్పాడు ఛార్లెస్.

వాళ్ళిద్దర్నీ పరిచయం చేసిన తర్వాత మా ఆఫీస్‌లో ఇన్స్‌పెక్షన్! నా అఫీషియల్ కేంపులు మొదలైన వాటితో పది రోజులదాకా వాళ్ళని విడివిడిగానే తప్ప కలిసి ఉండగా కలవడం పడలేదు. తర్వాత ఓరోజు సాయంత్రం బీచిలో వాళ్ళు కూర్చున్న చోటికి వెళ్ళి పలకరించి ప్రక్కనే కూర్చున్నా. అప్పుడే సిగరెట్ ముట్టించబోతున్న ఛార్లెస్‌ను "స్మోక్ చేయడం మానవా" అంది అనూరాధ.

"ప్రయత్నిస్తా"

"ప్రయత్నించడంకాదు"

"తగ్గిస్తా సరేనా"

పదిరోజుల్లోనే ఆమె సంపాదించిన అధికారానికి అతను తలఒగ్గుతున్న తీరు గమనించాను.

"తగ్గించడం కాదు ఈరోజుతో మానేస్తానని ప్రామిస్ చేశావ్"

ఛార్లెస్ తలమీద ఎడంచేత్తో కొట్టుకుంటూ అన్నాడు.

"చంపేశావ్! నీకు జ్ఞాపకశక్తికూడా ఎక్కువ"

"ఔను నీకు అన్ని విషయాలు ఎలా గుర్తుంటాయి" మాటల్ని కాస్త మామూలు ధోరణిలోకి తెద్దామనుకుంటూ నేను కల్పించుకొన్నా.

"నాకా! భలేవాడివే. ఓ జోక్ చెప్తా విను. ఓసారి అద్భుతమైన జ్ఞాపకశక్తి ప్రదర్శిస్తున్నాడొకతను ఓ పార్టీలో. కుతుహలంతో ఒకాయన అయన్నడిగాడు. మీరన్ని విషయాలు ఎలా గుర్తుంచుకొంటున్నారని. ఏముంది నేను కొన్నాళ్ళు ఎయిర్‌ఫోర్స్‌లో పనిచేశా, ఓసారి పారాచూట్‌తో విమానంనుంచి దూకడం ట్రయినింగ్ ఇస్తూ రెడీ అనగానే దూకేశా, ఇంతట్లో పైనుంచి వినబడింది ఆఫీసర్ గొంతు పారాచూట్ మర్చిపోయావని. అప్పట్నుంచి ఏదీ మర్చిపోవడం లేదు. అని చెప్పాట్ట. ఎలా వుంది?" అంటూ కనుబొమ్మలు ఎగరేసింది.

....ఆతర్వాత....

o o o

ఖగోళ శాస్త్రజ్ఞుల లెక్క ప్రకారం భూమి సూర్యుడి చుట్టూ ఓసారి తిరిగొచ్చింది. నా జీవితంలో పెద్దమార్పేమీ లేదు కానీ అనూరాధ జీవితంలో రెండో మేజర్ ఆక్సిడెంట్ అయింది. (జీవితంలో మొదటి ఏక్సిడెంట్ పుట్టుక, రెండు పెళ్ళి, మూడు మరణం అని

అని ఎవరో కవిగారి ఉవాచ )

అయితే పుట్టుక మరణమంత అనెక్స్పెక్టెడ్ కాదేమో - పెళ్ళి కాస్తో కూస్తో ముందు తెలుస్తుంది. అనూరాధ పెళ్ళి నాకు మాత్రం అనెక్స్పెక్టెడ్ కాదు. నాలోని అంతరంగపు మూలల్లో కొంప దీసి అలా జరగదు కదా అని చాలా సార్లు శంకించబడ్డ విషయమే. అనూరాధ చూపే మొండి ధైర్యం చూసినా, ఎదిరించే ఆమె స్వభావం చూసినా నాకు మొదటినుంచీ భయమే. ఆమె భర్తని ఎంచుకొన్న విధానం కూడా ఆమె స్వభావ విరుద్ధ మేంకాదు. కులాలు మతాలు, శాఖలే కాకుండా వీటన్నటితో పాటు వరకట్నాలు కూడా నేటి యువతీ యువకుల పెళ్ళికి అడ్డుగోడలై తే ఒక మధ్యతరగతి యువతిగా అనూరాధ ఆ గోడల్ని కూల్చి బయటికి వెళ్ళడమే కాకుండా విదేశీయుడైన ఛార్లెస్‌ను పెళ్ళాడి చుట్టు పట్ల పెద్ద దుమారమే లేపింది.

తర్వాత ఆమె పెళ్ళయిన నాల్గు నెలలకి తండ్రి పోవడంతో ఆమెకు చెప్పుకోదగ్గ బంధువులెవ్వరూ మిగల లేదు. కూతురు చేసిన పనికి కుమిలి, కుమిలి పోయాడన్నారు ఆమె చేసిన పని కిట్టని కొందరు. నాకు తెల్సున్నంతలో ఆయన ఆ విషయమై ఎన్నడూ బాధ పడలేదు.

జీవితం సరళరేఖ అయితే మరణం ఒక బిందువు మాత్ర మే. తనకు ఒక్కగా నొక్క కూతురు అతని దృష్టిలో యోగ్యుణ్ణే (విదేశీయుడై తేనేం) పెళ్లాడించి, తను జీవితంలో చేయవలసిందేమీ మిగలలేదు. మార్గం సరళరేఖలా సుగమమం కావడంతో సహజంగానే మరణ బిందువు దగ్గరయి ఉంటుంది.

అనూరాధ వివాహం తర్వాత వాళ్ళిద్దరూ కలిసి ఉంటున్న ఇంటికి చాలాసార్లు వెళ్ళాను. మొదటిసారి ఇంట్లో ప్రవేశించగానే కన్పించింది ఓ అందమైన అమ్మాయి చేతులు జోడిస్తూ వచ్చేవారిని ఆహ్వానిస్తున్నట్లుండే క్యాలెండరు. తర్వాత కొన్ని రోజులకు వెళ్ళేటప్పటికి నెల మారడంతో పేజీమారి అమ్మాయి చేతులు అలవోకగా పూలను నీటిలోకి జారుస్తున్నాయి. అక్యాలెండరులోని అన్ని బొమ్మలనూ చూడడానికి నాకు అవకాశం కుదరలేదు, మామగారు పోయిన రెండు నెల్లకే ఛార్లెస్‌కు ప్రమోషన్ మీద భోపాల్ ట్రాన్స్‌ఫర్ కావడంతో.

"నీ చదువు డిస్కంటిన్యూ చేస్తావా" అడిగాను అనూరాధని.

"ఆః ప్రస్తుతానికి అంతేమరి. కొంత నయం, థర్ ఇయర్ ఎగ్జామ్స్ కూడా అయిపోయాయి. కోర్సు ఇంకా రెండేళ్ళకు గాని పూర్తికాదు - అక్కడికీ అతను ప్రమోషన్ వదులుకొనైనా కోర్సు అయిందాకా ఇక్కడే ఉంటాను అన్నాడు

'పో నీ నా కోర్సు అయిందాకా ఇక్కడే ఉంటాను నువ్వెళ్ళి అక్కడ

మేఘం: -మౌన రాగం

జాయిన్ అయిపోకూడదూ అన్నదానికి మౌనంగావుండి పోయాడు, ఇప్పటికే అనేకసార్లు నిన్ను విడిచి ఎక్కడికి వెళ్ళినా నా శరీరంలో కొంతభాగం విడిచి వెళ్ళినట్టుంటుంది అన్నాడు. బహుశా నా ప్రశ్నకు కూడా అదేసమాధానం కాబోలు. ఎంత మనస్సులో అరమరికలు లేకుండా బ్రతుకుతున్నామనుకొనే భార్యా భర్తల కైనా హృదయపు ఏ చీకటి మూల ల్లోనో కొన్ని సున్నితమైన విషయాలు చెప్పకుండా మిగిలి పోతాయి. వాటిని బలవంతాన స్పృశించి బయట పెట్టాలని ప్రయత్నించడంవల్ల ఇదరికీ చికాకు తప్ప ఏమీ మిగలదు' కనుక నేను ఆవిషయం మళ్ళా ప్రయత్నించలేదు. అదీకాక ప్రస్తుతం ఇక్కడ నాకంటూ ఎవరూలేరు. హాస్టల్లో చేరి ఉండాలి, నా జీవితానికి ఒక్కడే అయిన తోడును కొన్ని వందల మైళ్ళ దూరాన వదలుకొని అయినా ఎప్పటికైనా కోర్సు పూర్తిచేసి తీరతాను. ఆ విషయమై గట్టి నమ్మకముంది."

ఆమె జీవిత నాటకంలో త్వరత్వరగా మారుతున్న అనేక సీనుల్ని ఆసక్తిగా గమనిస్తున్న నేను, అందులో ఆమె నిర్వహిస్తున్న పాత్రని ఆమె స్వభావ సిద్ధమేనని సరిపెట్టుకుంటూ ప్రేక్షకుడి గానే మిగిలి పోయాను. కానీ భర్తకోసం చదువుమానుకొని వెళ్ళడం ఆమె స్వభా వానికి ఎలా అన్వయించాలో ఇప్పటికి నాకర్థంకాదు. కొండలమీదుగా అమిత వేగంతో ప్రవహిస్తూ వస్తూ ఒక్కసారి మైదానం చేరి తనపూర్వపువడీ, వేగం కోల్పోయి ఇంచుమించు నిశ్చలస్థితికి చేరిన సెలయేరు మాత్రం జ్ఞప్తికి వచ్చింది.

ం ం ం

తర్వాత ఆఫీసు రికార్డుల్లో నావయసు ఆరేళ్ళు పెరిగింది. ఆఫీసర్‌గా ప్రమోషన్ వచ్చింది. పెళ్ళికొడుకుల మార్కెట్‌లో నేనింకా అమ్ముడు పోని ఆకర్షణీయ మైన వస్తువునే. ఛార్లెస్, అనూరాధల వద్దనుండి కొన్నాళ్ళు ఉత్తరాలు వచ్చాయి. ఆతర్వాత క్రమంగా తగ్గి పోయాయి.

ఈ మధ్యనే నెల్లూర్‌లో ఆఫీస్ పని ఉంటే పూర్తి చేసుకొని మెయిల్లో వస్తున్నా. కంపార్ట్‌మెంట్‌లో కూర్చుని కూర్చుని విసగేయడంతో ఒంగోలు ప్లాట్‌ఫారమ్ రాగానే దిగాను బాగ్ పట్టు కుని, (అందులో ఇంపార్టెంట్ పేపర్లు న్నాయి మరి) అటూ ఇటూ చూస్తున్న నాకు కొంచెం దూరంలో లైట్ల వెలుగులో కంపార్ మెంట్ విండోలోంచి బయటకు చూస్తున్న పరిచితమైన ముఖం కన్పిం చింది-పోల్చుకోవడం కష్టం కాలేదు. చక్కనమ్మ చిక్కితేనే కాదు కొద్దిగా లావైనా కూడా అందమే కాబోలు.

ఛార్లెస్ ప్రభావం అనూరాధ మీద బాగాపడ్డట్టుంది. బొట్టు పెట్టుకోలేదు.

పిల్లగాలి: -రూపం లేని జాలి.

చెవులకు తమాషాగా వ్రేలాడుతుండే రింగులు తీసేసింది. మాక్సీ లాంటిదేదో వేసుకుంది. దగ్గరయ్యేటప్పటికి గబుక్కున చూసింది.

"ఏయ్ మాన్ రా! రా! నిన్నుచూసి ఎన్నిరోజులయిందో" ఆమె కళ్ళలోని మెరుపును స్టేషన్‌లోని ఫ్లోర్‌సెంట్ లైట్లు సరిగా చూపలేకపోయాయి.

"ఎక్కడిదాకా" నాకేసి పరీక్షగా చూస్తూ అడిగింది.

"రాజమండ్రి"

గార్ గ్రీన్ సిగ్నల్ చూపిస్తున్నాడు.

"అయితే లోపలికి వచ్చెయ్ నీతో మాట్లాడాలి"

జేబులో త్రీటయర్ టికెట్ మాత్రమే వున్న నేను ఫస్ట్ క్లాస్ కూపేకేసి అనుమానంగా చూస్తున్నా.

"ఏంటలా చూస్తున్నావ్, నువ్వెక్కిన కంపార్ట్‌మెంట్ వెనకనుందా? ఫర్లేదులే. అయ్యో! నీకింకా అప్పటి పిరికితనం పోలేదన్నమాట. అంతకీ కండక్టర్ వస్తే ...ఏయ్ ట్రైన్ కదిలిపోతోంది క్విక్" మొత్తానికి ఆమె ఉన్న కంపార్టుమెంట్ ఎక్కా.

ఆమెకు ఎదురుగా ఉన్న బర్త్ మీద పడుకొని ఉన్నారు నాలుగైదేళ్లు ఉన్న కుర్రాళ్ళు, మొహంలో ఛార్లెస్ పోలికలు.

"నాకీ విషయం తెలియదే" పడుకున్న అబ్బాయిని చూస్తూ నవ్వుతూ అన్నా.

"ఉత్తరం రాసాను. అప్పటికే వైజాక్ నుంచి పారిపోయినట్టున్నావ్ ఎక్కడున్నావో తెలిస్తేగా"

"సరేకాని ఛార్లెస్ బావున్నారా"

కాసేపు మౌనంగా ఉండిపోయింది. వేగంగా పరిగెడుతున్న స్టేషన్ దీపాల వెలుతురులో ఆమె కళ్ళలో సన్నటి నీటి పొర ఏర్పడడం గమనిస్తున్న నాకు ఆమె కళ్ళు దుఃఖంతో ఆర్ద్రాలవడం చూడడం మొదటిసారి. ఎప్పుడూ ధైర్యంతోనూ తెలివి తేటలతోనూ మిల మిల లాడే ఆకళ్ళు నీరు చిందించడం నేను ఊహించలేని విషయం "ఛార్లెస్‌కు నాతో జీవితం బోరు కొట్టిందేమో రాఘవా, అందుకే వెళ్ళిపోయాడు."

"ఎక్కడికి? ఇంగ్లండా... లేపోతే ఎవరితోనైనా.. "

నేను జీవితంలో అనేక మంది విషయంలో ప్రిజుడైస్‌తో మాట్లాడా. కానీ అనురాధ ఎటోచూస్తూ మాట్లాడుతున్నదల్లా నాకేసి చివాలున చూసి అంతలోనే విషాదంగా నవ్వుతూ "నన్ను మాత్రమేకాదు ఈ లోకాన్నే విడిచి" అన్నపుడు తెల్సింది నేను ఒక మంచి వ్యక్తి ప్రవర్తన పట్ల ఎంత భయంకరమైన అనుమానాన్ని వ్యక్తం చేసానో.

తర్వాత విజయవాడ దగ్గరయేవరకూ అనేక విషయాలు చెప్తూనే

ఉంది తెచ్చిపెట్ట కొన్నసిబ్బరంతో. నేనూ వింటున్నా, మోటార్ ఏక్సిడెంట్‌లో ఫాదర్‌ని పోయేటప్పటికి బాబుకి ఏడాదిట. ఇన్స్యూరెన్స్ డబ్బుతో వైజాగ్‌లో బి. ఇ. పూర్తిచేసి ఒక సంవత్సరం జె. ఇ. గా చేసి ఇవుడు రాజస్తాన్‌లోని "కోట" లో ఎక్స్‌పీరియన్స్ పుటప్ చేసి ఎ. ఇ. గా వెళుతున్నానని, విజయవాడలోని స్నేహితురాల్ని కలుసుకొని రెండు రోజులో బయలుదేరు తానని.

విజయవాడ దగ్గర కావడంతో లేచి సామాను సర్దుతోంది. నడకలో తేడా కనిపిస్తుండడంతో

"కాలు తిమ్మిరెక్కిందా కూర్చొని కూర్చొని"

నా అజ్ఞానానికి కాబోలు చిన్నగానవ్వి

"ఆక్సిడెంట్ అయినపుడు బైక్‌మీద నేనూ ఉన్నా. కుడికాలు మాత్రం... "

కొద్దిగా మాక్సీ ఎత్తి చూపించింది ఆర్టీఫిషియల్ లింబ్!

"మైగాడ్" నాలోనేను గొణుక్కున్నా. నా కంఠంలో నాకు తెలియకుండానే సానుభూతి తొంగి చూసింది.

"చూడు రాఘవా నేను ఎవరేమన్నా సహించగలనేమోకాని "ఐపిటీయూ"అనే అర్థం వచ్చేటట్లు మాట్లాడితే మాత్రం సహించలేను, ఎన్ని కష్టాలొచ్చినా తట్టుకొని నిలబడ గల ధైర్యం నాకు పుట్టుకతో వచ్చినవిద్య. అధైర్యంతోనే జీవిత ప్రవాహంలో ఎదురీదుకొని వస్తున్నా అన్నట్లు స్టేషన్ వచ్చేసింది, మళ్ళా ఎప్పుడు కలుస్తామో..' బెస్ట్ ఆఫ్ లక్"

ఆమెతోబాటు నేనూ ప్లాట్ ఫారమ్ మీదకు దిగా. బాబుచేత టాటా చెప్పించి ఓచేత్తో నడిపించుకొని వెళ్ళిపోతోంది, అప్పుడు తూర్పునుండి వెలుగు రేఖలు విచ్చుకొంటున్నాయి.

"తమ సోమా జ్యోతిర్గమయా" అంటూ చీకటినుండి వెలుగులోకి చేర్చమంటూ ఎవర్నో ప్రార్థించే వాళ్ళలా కాక తనకు తానుగా తన జీవితంలో ముసురుతున్న చీకట్లని చీల్చుకొంటూ వెలుగు వైపు పయనిస్తోంది అనిపించింది అనూరాధ.

"ఆడది కాకూడదు అబల
ప్రయత్నించి కావాలి సబల"

ప్రభుత్వం తరపున నా ఉద్యోగ ధర్మంగా ఇలాంటి ప్రకటన లెన్నింటినో సేకరించి, కూర్చి పత్రికల్లో ప్రకటనలు వేయించాను. ...

కష్టాలను ఒంటరిగా ఎదుర్కొని గెల్చి హిమవన్నగంలా వ్యక్తిత్వాన్ని పెంచుకొంటూ పోతున్న ఆమె నా దృష్టిలో నిజమైన "అపరాజిత" ❋

---

కన్నీళ్లు:- గుండె గులాబీ ముళ్ళు

---

శ్రీయుత

# సౌభాగ్యలత

## ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవీ రామశాస్త్రి

(జరిగిన కధ)

శారద వకుళకు రాసిన వుత్తరం చదివి అంతర్మధనకు లోనయ్యాడు శ్రీమంత్ శ్రీమంత్ తనకు మరింత దూరమవుతున్నట్లు బాధపడింది వకుళ. అద్దెగా వెయ్యి రూపాయిలు వకుళ తండ్రికి పంపి చాలన్న శ్రీమంత్ నిర్ణయంతో నిర్విణ్ణురాలయింది వకుళ. వకుళ మౌనంతో శ్రీమంత్ అభిమానం దెబ్బతింది.

—ఇక చదవండి—

చివాలున తల ఎత్తింది వకుళ దెబ్బతిన్న హరిణి లాగ,

"ఆ మాటలు .. ... ఆ మాటలు....... ఔను, నావే, వివాహం ముందు నేను నీకు వాగ్దానం చేశాను శ్రీమతి శ్రీమంత్ అన్నివిధాలా శ్రీమంత్‌కు సహకరించ గలదని, సహకరిస్తాను జన్మాంతం!"

గిరుక్కున తిరిగి లోనికి వెళ్ళి క్షణంలో ముఖం కడిగి బొట్టు పెట్టుకుని వచ్చింది.

"నడు శ్రీమంత్," అంటూన్న ఆ వదనం నిర్మలంగా ఎప్పటి ప్రశాంతతతో కన్పట్టింది శ్రీమంత్‌కు,

"ఆ డబ్బు తీసుకురా"

"ఇదిగో, తెస్తున్నాను"

రఘురామయ్య భవనమంతా సందడిగా వున్నది. వెల్లలు వేస్తున్నారు. వెనుక పెరడులో పసుపు దంచుతున్నారు కొందరు, కారం కొట్టేవారు, పచ్చళ్ళూ, వడియాలూ పెట్టే ఆడవాళ్ళు కోలాహలంగా వున్నారు, లోపల హాలులో ఒక ప్రక్క బియ్యం బాగుచేస్తున్నారు. మరో వైపు పప్పులు విసురుతున్నారు.

రఘురామయ్యా విశ్వేశ్వరీ వంట బ్రాహ్మలతో మాట్లాడుతున్నారు

కుమారై అల్లుడినీ చూచి రఘురామయ్య వదనం విప్పారింది

"రండి రండి,"

ఇద్దరూ తండ్రికి అభిముఖంగా కూర్చున్నారు,

"ఇదిగో, ఇందులో ఏ నమూనా నచ్చాయి చూడండి?" రక రకాల శుభ లేఖల దొంతిని వారి ముందుంచాడు,

"అందరికి నచ్చడం దేనికి? శశికి నచ్చాలి కాపీలు పంపిస్తాను," అంటూ విశ్వేశ్వరి లేచి వెళ్ళిపోయింది, పత్రికలు చూడబోతున్న వకుళ చెయ్యి ఆగిపోయింది

రఘురామయ్య నిట్టూర్చాడు,

"ఏళ్ళు ఎక్కిన కొలది బుద్ధి దిగజారుతోంది" అన్నాడు విచారంగా,

"అక్క ఇంటి దగ్గర లేదా నాన్నగారూ?" వకుళ మాట మార్చింది

"లేనట్లుంది,"

"ఎందుకు రమ్మన్నారట మామయ్యా?" శ్రీమంత్ అడిగాడు,

"లగ్న పత్రిక పెండ్లివారికి తీసుకువెళ్ళి యివ్వాలి బాబూ,"

"ఇవ్వండి, ఇచ్చి వస్తాను,"

"దీనికి తతంగం వున్నది, వెంట మిరాయిలూ, ఇంకా మన ఆశ్రితులూ వస్తారు, పెద్దగా వెంట నీవు వెళ్ళాలి, కొడుకులుంటే వాళ్ళని పంపుతారు, నాకు నువ్వున్నావు."

"ఎంత మాట! ఇందుకు వేరే అడగాలా? మీరు ఎప్పుడు వెళ్ళమంటే అప్పుడే వెళ్తాను"

"రేపు మంచిరోజు శ్రీమంత్ రేపు వెళ్ళాలి, ఆఫీసుకు సెలవు పెట్టగలవా?"

కాఫీ సరంజామా పట్టించుకు వచ్చింది విశ్వేశ్వరి

భర్త మాటలను విన్నది ఆమె

"లేని కొడుకుల కోసం యిప్పుడు క్రొత్తగా విచారించడం దేనికిగానీ ముఖ్యమైన పనులు సరైన మనుష్యులకు మాత్రమే ఒప్పజెప్పాలి!"

"అంటే?" రఘురామయ్య చీకాకుగా చూచాడు

విశ్వేశ్వరి శ్రీమంత్ వైపు తిరిగింది.

"నువ్వు పని చేస్తాననడం, బాధ్యత తీసుకోవడం బాగానే వున్నది కానీ, అక్కడ మహేష్‌తో మాత్రం గొడవ పడకు, ఆడపెళ్ళివారం—అణకువగా వుండాలి!"

శ్రీమంత్ వదనం అవమానభారంతో జేవురించింది.
వకుళ ఆవేశాన్ని నిగ్రహించుకోలేక పోయింది.
'నీకంత అనుమానంవుంటే ఇంకెవరినైనా ఆ పనికి నియమించమ్మా'
"వకుళా!" మందలింపుగా అనినా మార్దవంగానే వున్నది శ్రీమంత్ స్వరం.
'శాంతం వహించు!' అని అర్థించుతున్నట్లు ఆమె కనులలోనికి చూచాడు!
వకుళ తలవాల్చి మౌనంగా కూర్చున్నది
"సరే, అయితే రేపు సెలవు పెడ్తున్నాను అంతేగా మామయ్యా పని?"
"పనులు చాలా వుంటాయి, రేపటినుండీ సెలవు తీసుకో పెండ్లి తారీఖు తర్వాత నాల్గు రోజుల వరకూ"
'తండ్రికి ఆలోచనలేదు, ఇటువంటిపనినా శ్రీమంత్‌కు ఇవ్వడం? అతడి మనస్సెంత గాయపడి వున్నదీ—మరెంత మథనతో సతమత మౌతోందీ—అను నవజ్ఞుడిగా ఆయనకు తెలియవద్దా?'
అంతలో శశి చూడ వచ్చింది
ఆమె శ్రీమంత్ వకుళలను పలుకరించనేలేదు
"ఏమిటవి నాన్నగారూ శుభలేఖలా? అబ్బే యిటువంటి చౌకబారు వైరెటీస్ వద్దు, అక్కడ వాళ్ళు చాలా గొప్పగా వేస్తున్నారు ఇదిగో తీసిపోకుండా వుండాలని మనకూ మహేష్ తానే సెలెక్ట్ చేసేశాడు"
వేనిటీ బాగ్‌నుండీ ఒక పత్రికను తీసి తండ్రికి యిచ్చింది
సరిగా చూడకనే "చాలా బాగుంది" అన్నది విశ్వేశ్వరి
రఘురామయ్య అటూయిటూ త్రిప్పిచూచి, "ఊం" అన్నాడు
"వాళ్ళు నాల్గువేల లేఖలు వేయించుతున్నారు మనం రెండువేలు వేయిందాం నాన్నగారూ"
"దానికేం భాగ్యం? అడగాలా?" అన్నది విశ్వేశ్వరి
"చూశారా వాళ్ళెంత గొప్పవాళ్ళో! నాల్గువేల శుభలేఖలే!" అన్నది తిరిగి విశ్వేశ్వరి
మరి వినలేని వకుళ లేచింది
"వెళ్తానా న్నాగారూ, అన్నట్టు ఇదుగో ఈ డబ్బువుంచండి"
వెయ్యి రూపాయలు తండ్రిచేతిలో వుంచింది
"ఏమిటమ్మాయిది?" రఘురామయ్య తెల్లబోతూ అడిగాడు
"ఇంటి అద్దె నాన్నగారూ, నెలకు రెండ వందల లెఖ్ఖన
విశ్వేశ్వరీ శశీ ముఖముఖాలు చూసుకున్నారు

"ఇంటికి అద్దె! నా కూతురు నా యింట్లో వుండడానికి అద్దె చెల్లిస్తోంది!"

రఘురామయ్య ప్రతి మాటలోనూ అమితమైన వేదన ధ్వనించింది

"నేను నిన్ను నా యింట్లో వున్నావని ఎప్పుడైనా ఏమైనా అన్నానా అమ్మా నేను?" ..రసంగా అడిగాడు.

అతడి బాధను చూచిన వకుళకు కన్నీ.. ఆగలేదు

అవనత వదనయై మౌనంగా నిలబడింది.

"శ్రీమంత్! నవ్వు నువ్వలా చూస్తూ నిల...వంటే ఇది నీపనే సందేహం లేదు ఇద్దరూ కూడబలుక్కుని నన్నిలా హింసించుతున్నారా? ఇది నీకు భావ్యమా?" రోదించుతున్నట్లే వున్నది రఘురామయ్య దీనస్వరం.

'మామయ్యా!"

అతి మృదువు స్వరంతో అన్నాడు శ్రీమంత్ "మన్నించండి, మీరు బాధపడ వద్దు నేనే యిస్తున్నాను ఋణగ్రస్తుడిగా అసమర్థుడిగా ముద్ర వేయబడడం నేను సహించుకోలేను!"

"ఎవరు? ఎవరు నిన్నలా అన్నవాళ్ళు? ఎన్నయినా సహించాను కానీ, ఇది మాత్రం నేను సహించను పైసా కట్నకానుకలివ్వలేదు నీకు, ఆర్భాటమైన ఖర్చు లతో పెండ్లివేడుకలు చేయలేదు, కనీస ఖరీదైన సారె కూడా యివ్వలేదు నన్ను ఏ విధంగానూ అలసట చెందనీయని చిట్టితల్లి వున్న యింటికి అద్దె తీసుకుంటే అంతకంటె పాపం ఏముంటుంది? ఈ జన్మలో కొడుకులే లేరు-మరు జన్మలో అసలు సంతానమే వుండరాదని శపించగలడు దైవం"

అంటూ పై కండువాతో కనులు అద్దుకున్నాడు

వకుళ ఆ పైకొన్ని వెనక్కుతీసి, శ్రీమంత్ కేసి చూచింది అతడి వదనంలో మార్పులేదు, అవే స్థిరగాంభీర్యాలు పేరుకొని ఇనుప మనిషిలాగా వున్నాడు

అటు తండ్రి సుకుమార ప్రేమైక హృదయం అమితవేదనకు గురి ఔతోంది

ఇటు భర్త అభిజాత్యాన్ని నిలుపవలసిన గృహిణి తాను

అప్రయత్నంగా తల్లివైపు చూచింది వకుళ

అక్కడ జరుగుతూన్న దృశ్యం విశ్వేశ్వరినేమీ బాధించినట్లు లేదు

ఇటు వకుళను కన్నతల్లిగా ఆ కనులలో ఏ బాధా కలవరాలూ కానరావ డం లేదు

' అటు ఆ యింటి గృహిణిగా ఒక్క పెద్దరికపు మాట కూడ ఆమె నోటి నుండి వినరావడం లేదు

"అమ్మా, నాన్నగారి మాటకేం? ఇదిగో ఇంటి అద్దె యింతవరకూ వెయ్యి

రూపాయలు ఇక జరుగుతూన్న నెలకు రెండువందలు తర్వాత యిస్తాను"

ఏమాత్రం సంకోచం లేకుండా విశ్వేశ్వరి ఆ పైకాన్ని తీసుకుంది

వకుళ ఆక్కడెస తిరిగింది

"అక్కా మేము నాన్నగారి నీడన తలదాచుకుంటున్నామని ఇక నీవు మమ్మల్ని శిక్షింప వరచవద్దు, అద్దెయిచ్చి వుంటున్నాం ఈ విషయం అందరి ఎదుటా చెప్పవలసి వచింది నాన్నగారికిబాధ చూడలేక వెళ్తున్నాను నాన్నగారూ"

రఘురామయ్యకు సంగతి అర్థమైంది

"ఓహో!" అర్థయుక్తంగా తల పంకించాడు.

"ఇప్పుడు ఇప్పుడు అర్థమైంది శ్రీమంత్ నాకు, నువ్వుకూడా అర్థమయ్యావు! ఈ రఘురామయ్యకు తగిన అల్లుడివినీవు! నిజంగా గర్విస్తున్నాను కానీ ఇకనుండీ నువ్వుయిచే వన్నీ అవి కావలసిన వారికే ఇయ్యి నాకు నువ్వు యివ్వాల్సింది ఒకటే—నా ఎదుటే యింటనేవుండడం!"

"రేపు వస్తాను మామయ్యా మరి! వెళ్ళొస్తాను అత్తయ్యా!"

శ్రీమంత వెళ్ళిపోయాడు

"కొరకరాని కొయ్య!" తల్లికి మాత్రమే వినబడేట్లు గొణిగింది శశి

"విశ్వేశ్వరీ! ఇదటే నీ పెద్దరికం?"

---

భార్యను ఏవగించుకుంటూ అడిగాడు రఘురామయ్య

"ఆస్తి అంతా కట్టగట్టి ఒకతె నెత్తినే పెడ్తున్నావు మరోపిల్ల ఇంట వున్నందుకే అద్దె డబ్బులకు కక్కుర్తి పడ్డావు నీ పెద్దరికం ఏమైందే? వకుళ కూడా నీ కడుపున పుట్టిన బిడ్డేనే! బొత్తిగా సవతితల్లి చూపు చూస్తున్నావు వకుళను నీకేమైంది?"

"హుం, నీతులు కట్టిపెట్టండి అది సవతి కూతురులాగే ప్రవర్తించిందిగా నా మాట వినకుండా! ఒక అల్లుడ కోటీశ్వరుడైతే మరొకడు గర్భ దరిద్రుడని తలవంచుకొనేట్లు చేసింది! దానికి శాస్తి కావలసిందే, శశి ముందు దాసీదానిలాగా వుంటుందిక"

"నోర్ముయ్! కనీసం శపించకే కన్నవోటితో. ఛీఛీ, నీ కడుపున అది తప్పబుట్టింది!"

# 32

మహేష్ నాల్గంతస్థుల భవంతి విపరీత విద్యుద్దీపాలంకరణతో, గానా బజానాలతో మహా కోలాహలంగా వున్నది

పెద్ద పెద్ద పందిళ్ళలో బాజా బజంత్రిలు విన్పిస్తున్నాయి ఒకవంక డాన్స్ ప్రోగ్రాం జరుగుతోంది, వేలాది మనుషులున్నారు వందల కార్లు ఆగివున్నాయి తరహా తరహాల బాణసంచా ప్రేల్చబడుతోంది

'ఈనాడే యిలావుంటే ఇక ఎల్లుండి పెండ్లినాడెంత అట్టహాసంగా జరుగుతుందో!'

అనుకుంటున్నారు చూపరలు

టాక్సీదిగిన శ్రీమంత్ కూడ ఆ హడావుడి అంతా చూచి అలానే అభిప్రాయ పడ్డాడు లోలోన.

అతడివెంట రఘురామయ్య తరపు బంధువులైన యిద్దరు నడివయస్కులు, విశ్వేశ్వరి తమ్ముడూ కూడా వచ్చారు

అయితే మేళతాళాలలో మునిగి వున్నవారు కొందరు, రకరకాల పానీయాల సేవనలో వున్ననారు మరికొందరు

వారంతా ఖరీదైన వాహనాలలో అరుదెంచిన అతి ఖరీదైన మనుష్యులు

సాధారణ టాక్సీలో వచ్చిన మామూలు మనుష్యులను పట్టించుకొనే తీరిక ఎవరికీ లేదు

"మహేష్ ఎక్కడండీ?" అనడిగాడు శ్రీమంత్ ఒకరిని

అతడు మాట్లాడలేదు

ఇద్దరు ముగ్గుర్ని అడగగా ఒకడు చెప్పాడు

"మహేష్ తన ముఖ్య స్నేహితులతో నాల్గవ అంతస్థులో వున్నాడు ఇప్పుడు దర్శనం కాదు" అని

"నేను రఘురామయ్యగారింటినుండి వచ్చానండి మహేష్‌ను కల్సుకోవాలి!" అన్నాడు శ్రీమంత్

అతడు యింకొకడికి చెప్పాడు

కొందరు శ్రీమంత్‌ను ఎగాదిగా చూచారు, "తమకు తగనివాడు అన్నట్లున్నాయి ఆ చూపులు ఎలాగైతేనేం మహేష్ వున్న పై అంతస్థుకు జేరుకోగలిగాడు శ్రీమంత్

అక్కడి వరండాలో నుండి క్రిందికి చూస్తే లోని ఆవరణ అంతా కన్పడుతోంది అక్కడ వున్న నాల్గు కార్లలో ఒకటి కుమార్‌ది మరొకటి అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసర్‌ది ఇంకొకటి లేబర్ కమీషనర్‌ది అయితే వీరంతా లోపల మహేష్‌తో వున్నారన్నమాట!

వారి కార్లు కాక, మహేష్ రోజూ తిరిగే కారువున్న షెడ్‌లో వున్నాయి.

ఆ కార్లు రెండూ ?

"అదుగో ఆ హాలులో వున్నారు మహేష్ బాబుగారు" బేరర్ చెప్పి వెళ్ళిపోయాడు

ఎయిర్ కండిషన్డ్ హాలులో మహేష్ కుమార్ ప్రభృతులు సరదాలలో మునిగి వున్నారు, ఇద్దరు అందమైన యువతుల నాట్యాన్ని చూస్తూ, సోఫాలలో చల్లని మత్తు పానీయాలను సేవించుతున్నారు

శ్రీమంత్ ప్రవేశం పానకంలో పుడకవలె అన్పించింది మహేష్‌కు, కుమార్

ముఖంకూడ ప్రసన్నంగాలేదు

కూర్చున్న తాప్రనుండి లేవకనే "హల్లో! ఏంకధ?" అంటూ కన బొమ్మ వెగరేశాడు మహేష్

శ్రీమంత్ వెంటనున్నవారు గదిలోని వాతావరణాన్ని తిలకించి, మరలా బయటకు వెళ్ళిపోయారు

ఒంటరిగా మిగిలిన శ్రీమంత్ మహేష్ చేస్తున్న అగౌరవాన్ని ఖాతరు చేయలేదు

"మహేష్! లగ్న పత్రిక మీకు లాంఛనాలతో అందజేసి రమ్మన్నారు మామయ్యగారు."

"ఓ!" వక్రహాసంలో, బలవంతాన లేచివచ్చాడు మహేష్.

"ఇటువంటివి ఇంటి నాశ్రయించి వున్న నౌకర్లూ, పౌరోహిత్యులూ వగైరా వగైరాలు తీసుకు వెళ్తారు లాంఛన ప్రకారం మా అక్కల పెండ్లిండ్లలో మేము ఆ విధంగా చేశాం"

ఆ గర్వపు మాటలకు తదితరులంతా బిగ్గరగా నవ్వారు. అందులో ఏదో పెద్ద హాస్యం యిమిడి వున్నట్టు

శ్రీమంత్ నరకు జేయనట్లే తన సహజ గాంభీర్యంతో అన్నాడు "రోజులూ, పద్ధతులూ మారుతున్నాయి కదా! అందువల్లనేమో నన్ను తీసుకు వెళ్ళమన్నారు"

"వెరిగుడ్ వెరీగుడ్! కానీ ఈ పాత-మునలి లాంఛనాలు నాకు చాలా వెగటు క్రింద ఎక్కడో మా నాన్నగారూ అమ్మగారూ వుంటారు వాళ్ళదగ్గరకు వెళ్ళు"

ఇప్పుడు కూడా శ్రీమంత్ ఓర్పు కోల్పోలేదు

"కానీ, వారెక్కడుంటారో-నాకెలా తెలుస్తుంది? ఒక్కసారి వస్తావా?" అన్నాడు శ్రీమంత్

నిర్లక్ష్యమైన నవ్వు నిలిచింది మహేష్ పెదవులపై, చేతిని పైకి ఒకసారీ కిందికి ఒకసారీ చూపుతూ- "ఇంతటి భవనానికి యజమానులు - ఎక్కడుంటారో కనుక్కోవడం కష్టమా? అహహహా"

ఆ విరగబాటును చూస్తూ నిశ్చలంగా నిలబడ్డాడు శ్రీమంత్ ఆ గది అలంకరణనూ, ఖరీదైన తెరలనూ, గోడలకున్న చిత్రాలనూ విస్మయంగా పరిశీలనగా చూస్తూ

"ఏం ఏమైనా తీసుకుంటావా?" అన్నాడు మహేష్

"వద్ద"న్నట్లు తల విదిలించాడు శ్రీమంత్

"ఔనులే, ఆడపెళ్ళివారి మనిషివి కదా? అదీకాక నీపై అధికారులు యిక్కడ వున్నారాయె!"

"ఔను, నాకు మీ దగ్గర కూర్చునే యోగ్యత కూడా లేకనేకదా మరి వచ్చిన దగ్గరనుండీ నిలబడేవున్నాను! వస్తాను మళ్ళీ పెండ్లిలో కలుద్దాం," (సశేషం)




శ్రీదేవి ఎన్ టి. ఆర్ ముఖ చిత్రంతో వెలువడిన జ్యోతి మార్చి సంచిక చదివాను ముఖ్యంగా మొదటి బహుమతి పొందిన కథ "పురుషులందు" తులసి బాల కృష్ణగారి రచన పత్రికకే హైలైట్!

మాష్టారి పాత్ర చక్కగా చిత్రించారు మాధవరావు వంటి మహాపురుషులు ఈ లోకంలో వుండటం చాలా అరుదు నేటి బాలల్నే రేపటి పౌరులుగా తీర్చిదిద్దే బాధ్యత ఉపాధ్యాయులపైనే ఆధారపడి వుందని తెలియజేసింది కథ రచయితకూ ప్రచురించిన మీకూ నాయొక్క అభినందనలు!

లక్కరాజు ప్రఫుల్లచంద్ర,

ధర్మవరం

కథల పోటీలో మొదటి బహుమతి గెలుచుకున్న శ్రీ "తులసి బాలకృష్ణ" గారి "పురుషులందు" కథ చాలా అద్భుతంగా వుంది ఈ రోజుల్లో ఉపాధ్యాయులు, విద్యార్థులు చదవవలిసిన కథ ఇది నిజంగా ఈ కథకు మొదటి బహుమతి రావలసిందే నిష్పక్షపాతంగా న్యాయ నిర్ణేతలుగా వ్యవహరించిన శ్రీ "నండూరి రామమోహన్‌రావు", శ్రీ 'రమణ' గార్లకు కళాభినందనలు తెలియ జేస్తున్నాను

యన్ శివానంద్,

బెల్లంపల్లి

అనుబంధ నవల 'అస్తమించని సూర్యుడు' చదివి చాలాసేపు స్తబ్ధుడనై పోయాను సినిమాలకు పనికివచ్చే పిచ్చి నవలలు వ్రాస్తున్న యీ రోజుల్లో వాస్తవానికి అతిచేరువలో భయం లేకుండా యిలాంటి నవల వ్రాయడం నిజంగా సాహసమే అవుతుంది రచయిత గణపతిరావు గారు అభినందనీయులు "రేగిపళ్ళు కోసుకుందాం ఒడ్డుకు రమ్మంటే, అరగంట క్రితమే అమ్మ బావిలోపడి చచ్చిపోయింది కాబట్టి రావటం ఆలస్యమైందని అతి మామూలుగా జవాబు చెప్పిన నా పిచ్చినేస్తం" అంటారు సింగరాజును గూర్చి వ్రాస్తూ! కళ్లు చెమర్చే వాక్యాలివి. ఇంకో చోట సింగరాజు నిర్లిప్తతను కాస్త తొలగించే ప్రయత్నంలో "షేక్ బిఫోర్ యూజ్" టానిక్ సూత్రం గుర్తుకొచ్చిందంటారు-ఎంత చక్కటి ఉదాహరణ?! ఇలా ఎన్నో విషయాలలో అతిచక్కగా ఆకట్టుకున్న నవల "పురుషులందు" శ్రీ తులసి బాల కృష్ణగారి కథకు ప్రథమ బహుమతి యిచ్చి నూటికి నూరుపాళ్లు న్యాయం చేకూర్చారు-న్యాయ నిర్ణేతలు! వారికి నా హృదయపూర్వక ధన్యవాదాలు-

పి ఎస్ పాత్రో

తుమ్మపాల

మార్చినెల జ్యోతి ముఖచిత్రం బాగుంది కథలపోటీలో ప్రథమ బహుమతి పొందిన తులసి బాలకృష్ణగారి కథ "పురుషులందు" వైవిధ్యంగల ప్రత్యేకమైన ఇతి వృత్తం రచనాశైలి కూడా బాగుంది కథనంలో అధ్యాపక వృత్తి యొక్క వైశిష్ట్యతని కర్తవ్యాన్ని చాలా చక్కగా చూపించ

## ధ్వస్వానుకరణం !

హృదయాన్ని బీరువాలో దాచిపెట్టి
మేధస్సుతో కవితావలో వీరవిహారం
చేస్తున్నారు
తీవ్రత ఆర్ద్రత అనన్యత లేని
కలాలతో కవితను స్రవిస్తున్నారు
తాము జ్వలించకుండానే పాఠకుల గుండెల్లో
కవితాదీపం వెలిగించాలని ఆతుతపడు
తున్నారు
తాము ద్రవించకుండానే కరకు పాషా
ణాన్ని
ద్రవింపజేద్దామని ప్రయాస పడుతున్నారు
తెరలతో కిటికీలు మూయబడిన కార్లలో
పయనిస్తూ లోకావలోకనం చేస్తున్నారు
సహజ అనుభూతులను వెనక్కినెట్టి
కృత్రిమ భావాలను వెల్లగక్కి
చప్పట్ల స్వర్గంలో కళ్ళు మూస్తున్నారు
కొత్తగా వుందామని సుకుమారంగా అంటా
దామని
వైచిత్రికోసం మాటల గారడీలు చేస్తు
న్నారు
టక్కుటమార విద్యలు ప్రదర్శిస్తు
న్నారు
పాతమాటల మసిముసుగు విప్పి
తమ భావాలకు తొడిగి ముస్తాబు చేస్తు
న్నారు
మృత శిశువుకు వన్నెరంగుల గిలు
తొడిగి ఏ ప్రాణం రాద
కొమ్మ బొమ్మకి ఎన్ని శబ్దాల వలువలు
చుట్టి
రువ్వు గల పెట్టినా జీవం పుట్టదు
ఎవడో ఊది పారేసిన ఎంగిలి సిగరెట్టును
ఏరుకొని
అగ్గిపుల్లతో అంటించి పీల్చడం కాదు
కవిత్వం
ఎవడో తాగి పారేసిన సీసాను పట్టుకొని
అందులో మిగిలిన తాగి పేలడం కాదు
కవిత్వం
అను గాలను ఉరితీస్తున్నారు ధ్వన్యర్థాను
కరణం చేస్తున్నారు
కళ్ళతో చూడలేక కవిత నిర్జీవి
పోయింది

—ఏ. సూర్యప్రకాశ్—

గలిగారు విద్యార్థుల భవిష్యత్తును తీర్చి దిద్దడంలో అధ్యాపకుల కార్య దీక్షత, పట్టుదల- విద్యార్థికి అధ్యాపకుడికి మధ్య వున్న సత్సంబంధం అధ్యాపకుల వల్లే విద్యార్థులకు విద్య నేర్పడమే కాదు విద్యతో పాటు విద్యార్థుల నైతిక విలువల్ని తీర్చి దిద్దడంలోనూ తద్వారా సమాజానికి ఆదర్శ ఉన్నత పౌరుడిగా తయారు చేయడంలో ప్రధాన పాత్ర వహించేది అధ్యాపకులే కథలో మాధవరావు పాత్రని ఎంతో ఉదాత్తతతో చిత్రీకరించారు రచయిత ఈకథకు ప్రథమ బహుమతి ఇవ్వడం సమంజసం ఒక చక్కని కథని చదివామన్న తృప్తి మాకు కల్గింది ముఖ్యంగా కథలపోటీ రచనల్ని రచయిత పేర్లను తెలియపరచ కుండా న్యాయ నిర్ణేతలకు ఇవ్వడంలో జ్యోతి యొక్క ప్రత్యేకతని అభినందిస్తున్నాము సీరియల్స్ రెండూ విభిన్న వైవిధ్యంతో అత్యంత సస్పెన్స్‌తో ముందుకు ఏం జరుగుతుందో వూహాకు అందకుండా పయనిస్తున్నాయి ఈ నెలలో పడిన ప్రతి కథా బాగుంది, కార్టూన్స్ ఈ నెల తక్కువగా ప్రచురించారు కొంత హాస్యం లోపించినట్లు తెలుస్తున్నాయి 'అమ్మ నాన్న' కథ ఎంతో హాస్యాన్ని అందించింది రచయితకు అభినందనలు

వై. హేమసుందర్ రావు,
డోర్నకల్




# యువనటుడు సాయిచంద్‌తో కాస్సేపు

జ్యోతి  "హలో నమస్తే"

సాయిచంద్  నమస్తే నమస్తే ప్లీజ్ సిడౌన్

జ్యోతి  ?!

సాయి  సరి- మొదలయిందా! ఆఁ నేను స్పష్టంగా వత్తులతో సహా పలకగలను- చూడండి ధైర్యము బాధ ధనము ఇంకా ఏమైనా పలకమన్నారా!! రెడీ

జ్యోతి  " "?

సాయి  అవునండీ. నావరకు కెమెరా ఇవతల ఫ్రీగా వుండి, కెమెరా రెడీ కాగానే ఎప్పుడూ బిగుసుకు పోలేదు

జ్యోతి  ?

సాయి.  యెస్ యెస్ కెమెరా ఎదర నుంచుంటే ముందు నటుడికి క్రాఫ్ట్, టెక్నిక్, క్రియేటివిటీ, ఇన్‌స్టింక్ట్ వుండాలి ఆ గ్రహింపు వుంటే ఈజ్ అనేది ఏర్పడుతుంది- ఖంగారు, దడ వుండవు షాట్ రెడీ కాగానే

జ్యోతి  ?

సాయి  ఊఁ నిజమే- ప్రతి ఆర్టిస్ట్‌కి ముందుగా పిక్చరైజ్ చేస్తున్న సీన్ చెబుతారు, కెమెరా ఎంత ప్రదేశం తీసుకుంటుందో చెబుతారు-దాన్నిబట్టి నటుడు మూమెంట్స్‌తో ఫ్రీగా వుండగలుగుతాడు

జ్యోతి

సాయి  ఊఁ ముఖంలో భావం చూపిస్తున్నప్పుడు కెమెరా ముఖాన్నే తీసుకుంటుంది గనక చేతులూ, కాళ్ళూ అన్న విషయం, కదలికలు అక్కర్లేదు గదా ఆ గమనింపు వుంటుంది లెండి

జ్యోతి  ?

సాయి  యెస్ అదే కెమెరా దృష్టిలోనే మనం ఏ పోస్, ఏ యాంగిల్ ఎలా ఇస్తున్నామనే కాదు- అది చూసేవారికి ఎలా వుంటుందో మనకి ఐడియా వుంటే- అప్పుడు లోటు పాట్లు సర్దుకోవచ్చును



జ్యోతి : .......?

సాయి : ....బాదల్ సర్కార్ కూడా చెబుతారు మన మూమెంట్, మన కదలికల రేంజ్, ప్లేన్, అది దృష్టిలో వుండాలని....

జ్యోతి : ........

సాయి : అఫ్ కోర్స్...నటుడికి దర్శకుడితో గల స్నేహపూర్వక సంబంధాన్నిబట్టి ఒకటికి పదిసార్లు అడిగి తెలుసుకోవడం వుంటుంది....

కథ, సీన్, డైలాగ్, మాడ్యులేషన్ కెమెరాతో సహా ఇవన్నీ మనం అడిగి తెలుసుకుంటే దర్శకుడికీ సంతోషం వేస్తుంది నటుడికీ అనుభవం ప్లస్ విజ్ఞానం కదా

**జ్యోతి**

**సాయి** అవునండి ఎక్స్‌ప్రెషన్ అనేదీ, డైలాగ్ సుఖంగా పలకడం అనేది పక్కవారిని వినడం బట్టి వుంటుంది మరి వారి డైలాగ్‌నీ, అర్థాన్నీ వింటే సరిగ్గా మనమే భావం చెడకుండా డైలాగ్ చెప్పగలుగుతాం-అవతలివారి డైలాగ్ కొస పట్టుకుని టెన్షన్‌గా వుండకూడదు కెమెరా ముందు స్టేజయినా అదే ఈ రియాక్షన్ గమనించే సంగతి స్టానిస్లోవ్‌స్కీ కూడా స్ట్రెస్ చేసి చెప్పారు గదా!

**జ్యోతి** ?

**సాయి** అవును కెమెరా ముందు ప్రతి సీన్‌నీ కొంత రిహార్సల్ చేసుకోవచ్చు ముఖ్యంగా ఎక్స్‌ప్రెషన్‌లో జాగ్రత్త తీసుకుంటే డైలాగ్ విషయంలో కొద్ది పొరబాటు జరిగినా దాన్ని డబ్బింగ్‌లో సర్దుకోవచ్చు

**జ్యోతి**

**సాయి** మన సినిమాలు డైరెక్టర్ మీడియంవే గనుక నటులు ఎంత సహకరిస్తే అంత వారికీ, దర్శకులకీ, ప్రేక్షకులకీ మంచిదని అనుకుంటున్నాను - ఆ అండర్‌స్టాండింగ్ వల్లనే సత్యజిత్ రేని మించిన మూడ్‌నీ, ఎక్స్‌ప్రెషన్‌నీ ఇవ్వగలిగి ఆయన అభినందనలు పొందాడు సౌమిత్ర ఛటర్జీ .

**జ్యోతి** ?

**సాయి** అబ్బే లేదండి - పాతబడిపోయి అర్థం పర్థం లేని స్టాక్ గెశ్చర్స్ అంటే ఆకలనగానే కడుపు పట్టుకోడం, అమాయకత్వానికి -తలగోక్కోవడం ఇలాంటివి ఇన్‌స్టింక్ట్ తెలిసి నటిస్తే రావు

**జ్యోతి**

**సాయి** నిజం - మరీ తప్పనిసరయితే తప్ప మేకప్ లేకుండా నటించడాన్నే కోరుకుంటాను

**సాయి** దానికేం-రీమేక్ సినిమాల్లోనైనా ఆదే పాత్రని మన సొంత ధోరణిలో పాత్ర చెడకుండా నటించవచ్చు - ప్రతి కదలికా, ఎక్స్‌ప్రెషన్ కాపీ చెయ్యనక్కరలేదు రీమేక్ అనే గాదు కొన్ని పాత్రల స్వరూపాన్ని గుర్తుపెట్టుకుని నటుడు తన సొంత అప్రోచ్‌తో పాత్రలో గొప్పగా నటించవచ్చు గదా ఉదహరణకి హిట్లర్ ప్రతి కదలికనీ అలాగే చూపుతూ కూడా అందులో హ్యూమనిర్ చూపాడు చార్లీ చాప్లిన్ మహానుభావుడు - ఆమాత్రం చేత హిట్లర్ హాస నటుడై పోయాడా - హిట్లర్‌ని తన కదలికల్లో బ్రహ్మాండంగా ఎష్టాబ్లిష్ చేశాడుమరి!

**జ్యోతి** ?

**సాయి** ఓ యెస్ బాపూగారి సాన్నిహిత్యంలో ఆయన విసిరిన జోకులా? ఇంకా కొన్ని మూట కట్టుకోవాలి త్వరలో అలాగే ఇస్తాను వుంటానండి

**జ్యోతి** నమస్తే

**సాయి** నమస్తే

వి. రామకృష్ణ

# ప్రేమ

ఏ పనైనా పదిసార్లు ప్రయత్నించినా ఫలితం దక్కకపోతే విసుగుచెంది విడిచిపెట్టడం మానవ నైజం ఎంతటి త్యాగం చేసినా ఒక ప్రోత్సాహపు పలుకైనా పలుకక సివారికోసం విడువకుండా త్యాగం చేసేవారు అరుదు తన కుమారులను మంచిమార్గంలో పెట్టాలని ఎంతో ప్రయత్నించి, ఫలితం పొందలేక విసిగి వేసారి వారిని విడిచి దేశాంతరం వెళ్ళాలని తలంచిన ఒక వ్యక్తితో దేవుడు ఒక కలద్వారా మాట్లాడాడు కలలో ఆ వ్యక్తి ఒక బరువైన సుత్తితో ఒక పెద్ద బండరాయిని బ్రద్దలు కొడుతున్నాడు ఎంత ప్రయత్నించినా చిన్న పెచ్చుకూడా ఊడి పడటం లేదు కొట్టికొట్టి చేతులు నెప్పిపెడుతున్నాయి, 'ఇంక నా చేతకాదు, ఈ పని నే చేయలేను" అని విరమించుకొని పోయే సమయంలో ఒక గంభీర స్వరం వినిపించింది "బాధ్యతగల ఈ పని దేవునిచేత నీ కప్పగింప బడిందని నీకు తెలియదా?" 'నాకు తెలుసు" బదులిచ్చాడు ఆ వ్యక్తి "అయితే దీనినుండి విరమించుకొని పోదామని ఎందుకు ఆలోచిస్తున్నావు?" "ఎంత కొట్టినా ఫలితం శూన్యం ఈ బండరాయి బ్రద్దలవ్వదు" అన్నాడా వ్యక్తి నిరాశతో 'పనిచేయటం నీ కర్తవ్యం ఫలితం దైవాధీనం"-విసుగుతో ఒరిగి ఆ బండరాయిని సుత్తితో కొట్టడం ప్రారంభించాడు ఉన్నట్టుండి ఆ బండరాయి వెయ్యి ముక్కలైంది దుష్టులైన ఆ కుమారులను వదిలి దూరదేశం వెళ్ళాలన్న ఆలోచన వక్కకిపెట్టి తిరిగి వారిని మంచిమార్గంలో పెట్టటానికి పట్టుదలతో ప్రయత్నించాడు ఆ దుష్టులైన కుమారులు తండ్రి ఓర్పును, సహనాన్ని గుర్తించి మార్పు చెంది మంచి మార్గములో నడిచి జీవితాంతమువరకు ఆయనకు సేవ చేశారు ప్రేమ దీర్ఘకాలం సహించును దయ చూపించును స్వప్రయోజనము నాశించదు అన్నిటినీ ఓర్చును ఓర్పు, ప్రేమ శాశ్వత కాలముండునని పరిశుద్ధ పౌలు సెలవిచ్చాడు నిజముగా ఈ ప్రేమ మనసులో ఉంటే జయం మనదేకదా! ఇది క్రీస్తు ప్రేమ ఆ ప్రేమను గూర్చి తెలుసుకున్నారా!

**ఉచితం ! ఉచితం !**

కరుణామయుడైన యేసుక్రీస్తు జీవిత చరిత్ర మానవాళికి ఆయన చేసిన కమనీయ బోధలు తెలియజేసే అందమైన పుస్తకం ఉచితంగా పొందదలచుకుంటే మీ చిరునామా వెంటనే మాకు వ్రాయండి పోస్టుఖర్చులు మేమే భరించి వెంటనే మీకు పుస్తకం పంపుతాము


డా ఎన్ జాన్ డేవిడ్,

పోస్టు బాక్సు నెం 14,

చిలకలూరిపేట

గుంటూరు జిల్లా


**GOSPEL MESSAGE**

తప్పక చూడండి!

శ్రీ ఉమయచంద్ర కంబైన్స్ పింజల నాగేశ్వరరావు సమర్పించు

# తల్లీకొడుకుల అనుబంధం

కలర్

దర్శకత్వం: కె.యస్.ఆర్.దాసు నిర్మాత: R.M.సుబ్రమణియన్ లక్ష్మీఫిలింస్

రిలీజ్ నవయుగ ఫిల్మ్స్ నెల్లూరు కళ్యాణి ఫిలింస్ కర్ణాటక ఉమారాణి కార్పొరేషన్స్ బెంగుళూరు

LAKSHMI PUBS



# అనిమ (ఆస్ట్రియా)

మానవ సృష్టి ఆరంభం నుంచీ బలమైన రెండు భిన్న స్వరూపాలు స్త్రీ పురుషులు. వారి కలయిక, సహజీవనమే యిన్ని వేల ఏళ్ళచరిత్రక పునాది, నైసర్గిక సాంఘిక, ఆర్థిక పరిస్థితులు, విలువలు ఎన్ని రకాలుగా మారినా వీరి పరస్పర అవగాహన సామరస్యమే మానవ జీవిత స్థాయిని నిర్ణయిస్తూ వస్తున్నాయి. అనిమ అంటే ఎటర్నల్ వుమన్.



డా॥ హైటన్ లెబర్

మగవాడికి స్త్రీ తల్లి, భార్య, ఆత్మీయురాలు, కాముకి, వ్యభిచారిణి, మంత్రించి వశపరచుకునే మంత్రకత్తె, నవ శారీరక సుఖం అనుభూతి అందించే కన్య, జీవిత చరమదశలో ఓదార్పునిచ్చే నిర్మల యోగిని అంతేకాక అనుభవైక వేద్యమైన వస్తువు ఇన్ని రకాలుగా మగవాడి భావన, జీవన అయిన స్త్రీ వివిధరూపాల దృశ్యకావ్యం అనిమ. నవయువ దర్శకుడు హైటన్ లెబర్ అద్భుతసృష్టి.

ఈ సినిమాకి కథలేదు. మగవాడి అవగాహనలో స్త్రీ అన్న వస్తుప్రాధాన్యత, దృశ్యీకరణ ప్రతిభే యీ చిత్రానికి ఆయువుపట్టు. ఈ దృక్కోణమే యీ చిత్రాన్ని ప్రపంచ చలన చిత్రరంగంలో విభిన్నమైన దానిగా, విశిష్టమైన దానిగా నిలబెట్టింది.

దృశ్యం వెనుక దృశ్యం, మానవ అనుభూతి, జీవితాన్ని ప్రతిబింబించే ప్రతీకలు ఇమేజరీలు రంగుల కలయిక, భావన స్థాయి వీటిగురించి ఎంత రాసినా యీ చిత్రం తాలుకు ఒక్క దృశ్యాన్ని కూడా



అనిమ చిత్రంలో ఒక దృశ్యం

కళ్ళముందు సాదృశం చేయలేం. కమ్యూనికేషన్‌ని మించి అనుభూతినిచేరి సంగీతం, స్పర్శ, సువాసన స్థాయికి ఈ చిత్రంలోని దృశ్యాలు ఎదిగాయి.

నవయవ్వనంలో, అందులో బ్రహ్మచారిగా జీవించేటప్పుడు మగవాడి భావనకి వున్న టెండర్‌నెస్, సరళత్వం, పరిణితి యింక మరే దశలోనూ వుండవు. అందుకే ఒక బ్రహ్మచారి దృక్పథంనుంచి స్త్రీ రూప విశ్లేషణకి దర్శకుడు పూనుకున్నాడు. ఈ ఎన్నిక హైటన్ లెబర్ సృజనాత్మకతకి గీటురాయి.

సృష్టి ఆరంభంలోని స్త్రీ పురుషుల ఏకత్వాన్ని, ఆ ఏకత్వంలోని భిన్నత్వాన్ని క్రమేపీ విడివడిన వారిస్వరూపాల్ని చిత్రీకరించటానికి, స్త్రీపట్ల మగవాడిలో ఏకాంతంలో వుదయించే భిన్నభావనల సముదాయాన్ని ప్రతిబింబించే స్త్రీ రూపాల్ని చిత్రీకరించటంలోనూ దర్శకుడు తీసుకున్న శ్రమ, జాగ్రత్త, ప్రతిభ అవస్యం.

ప్రకృతి, కాలం, యుద్ధం, శాంతి వీటి ప్రాతిపదికగా మానవ ప్రగతి, ఆర్థిక పరమైన మార్పు, ఇండస్ట్రియలైజేషన్ వీటి బలమైన వత్తిడల్లో మగవాడిలా మారే స్త్రీ భావనకి. దృక్పథానికి, కోరికకి, ఆకాంక్షకి దృశ్యరూపం అనిమా.

## స్త్రీ స్వభావ, స్వరూపాల సిద్ధాంత గ్రంథం ఈ చిత్రం

సంఘటనలు, కథ లేని యీ చిత్రపు క్లిష్టమైన స్క్రీన్‌ప్లే హైటన్ లెబర్ స్వయంగా రాసుకున్నాడు. మూడేళ్ళపాటు స్క్రీన్‌ప్లే రాసుకున్న లెబర్ కృషి ఈ చిత్రం ప్రతి ఫ్రేంలోనూ కనిపిస్తుంది. కొన్నిచోట్ల అతను కోరుకున్న చిత్రీకరణ రావటంకోసం ఒకే దృశ్యంలో 74 సూపర్ యింపోజ్‌లు చేయాల్సివచ్చిందట. ఇంచుమించు తన చలనచిత్ర తొలి దశలోనే చిన్నవయసులోనే యింత గొప్ప చిత్రం తీసిన హైటన్ లెబర్‌కి గొప్ప భవిష్యత్తు వుంది.

—వి. రాజారామమోహనరావు



# ! కార్టూన్ ఇష్టులకో శుభవార్త !

## మాసపత్రిక ప్రప్రథమంగా నిర్వహిస్తున్న

## 'కార్టూన్ పోటీ'

### బహుమతులు

(1) ఒకే విషయం (Subject) పై కార్టూన్‌లు 10 కి మించకుండా వుండాలి

| | |
|---|---|
| మొదటి బహుమతి | **300** రూ |
| రెండవ బహుమతి | **200** రూ |
| మూడవ బహుమతి | **100** రూ |

(2) ఇతర విడి కార్టూన్‌లకి

| | |
|---|---|
| మొదటి బహుమతి | **200** రూ |
| రెండవ బహుమతి | **125** రూ |
| మూడవ బహుమతి | **75** రూ |

### నిబంధనలు

1 కార్టూన్ సైజు మా పత్రికలో 10x6 సెం మీ వచ్చేలా వుండాలి

2 బహుమతి పొందని కార్టూన్‌లు ప్రచురించే హక్కు వుంది మాకు

3 గెలుపొందని కార్టూన్‌లు తిప్పి పంపబడవు

4 పోటీ విషయమై ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు

5 కాపీ కార్టూన్‌లు పోటీకి అంగీకరింపబడవు——హామీపత్రం విధిగా జతపరచాలి కవర్ మీద కార్టూన్ పోటీకి అని రాయాలి

**మాకు కార్టూన్‌లు చేరవలసిన ఆఖరు తేదీ మార్చి 31**



**Edited & Published by V Leelavathy Raghavaiah at 3 5 1039/1 Narayanaguda Hyderabad 20 & Printed by P Ramakrishna at Raghava Printers 1 8 4/1/1 Chikkadpalli Hyderabad 500 020**